# చతుర

మార్చి 2016
రూ. 15/-

★ డా. శ్యామ్ సఖాశ్యామ్
హిందీ నవల
**ఏమీ లాభం లేదు!** .... 6
అనువాదం:
**ఆర్. శాంత సుందరి**

★ పెద్దకథ
**ఈతరం ప్రతినిధి** .... 99

# పూల తివాచీ..!

యూరోప్‌లోనే అత్యంత అందమైన స్క్వేర్‌గా, ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తింపు పొందిన బ్రసెల్స్‌లోని గ్రాండ్ ప్లేస్ వద్ద రెండేళ్లకో సారి 1900 చదరపు అడుగుల పూల తివాచీని ఏర్పాటు చేస్తున్నారు. టూరిస్టులకు ఇదో ప్రత్యేక ఆకర్షణగా నిలువడంతో 1971 నుంచి ఈ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. కేవలం నాలుగు గంటల వ్యవధిలోనే కోట్లాదిపూలతో దీన్ని నిర్మిస్తారు. వారం రోజులపాటు కొనసాగుతుందిలా!

వారెవ్వా!





# భామనే.. సత్యభామనే..!

* డైటింగ్ మీద నమ్మకం లేదంటూనే చక్కని ఆకృతిని తన సొంతం చేసుకున్న ఆ బాలీవుడ్ భామ ఎవరు? ఆమె అందచందాల రహస్యమేంటి?
* బయటికెళ్లిన పిల్లల క్షేమసమాచారం తెలుసుకునే కిటుకు!
* వెజిటబుల్ కట్‌లెట్స్ తయారు చేయడం ఎలా?

చలో పేజీ నెం. 122

– సంపాదకులు

## రచయిత్రుల కథా కదంబం విపుల మార్చి సంచిక ప్రత్యేకం!

తనని ఒంటరిగా వదిలి విదేశాలకు ఎగిరిపోయిన కొడుకు, వెళుతూ వెళుతూ చేసిన నిర్వాకం ఆమెకప్పుడు తెలీలేదు. తెలిశాక కాళ్లకింద భూమి నిలువునా చీలిపోయినా బాగుండేదనిపించింది! ఇంతకీ ఏమిటా విషయం? డాక్టర్ ఉషా అగర్వాల్ హిందీ కథ అమ్మ అమ్ముడైంది

ఓ పక్క ఇంట్లో వివాహ వేడుక.. మరోపక్క గుండెల్ని చీల్చేసే విషాద వీచిక.. వీటి మధ్య చిగురుటాకులా వణికిపోతున్న ఆమె బాధేంటి?

పద్మశ్రీ, జ్ఞానపీఠ గ్రహీత ఆశాపూర్ణాదేవి బెంగాలీ కథ లక్ష్మణరేఖ

* జగత్ప్రసిద్ధ రచయిత్రి కేట్ చోపిన్ అమెరికా కథ లాకెట్
* కథకుల ఫైల్‌లో.. ప్రసిద్ధ తెలుగు రచయిత్రి మాలతీ చందూర్ కారుణ్యం

ఈనెల విపుల చదివారా?!




విపుల

# మనసున ఉన్నదీ...

★ అక్కినపల్లి సుబ్బారావు 'ఆవలి అంచు' కుటుంబ నేపథ్యంలో సాగిన మనోవిశ్లేషణాత్మక నవల. కథనంలో విలక్షణమైన తీరు.. వాక్యాల్లో అడుగడుగునా పలకరించే సహజమైన భావనాబలం.. సూటిగా సాగే సంభాషణలు.. పాత్రల మనసుల లోతుల్ని తడిమి చూపించిన పద్ధతి.. అన్నీ నవలని చక్కగా తీర్చిదిద్దాయి. పాతతరానికి సొంతగడ్డ మీద అభిమానం.. కొత్తతరానికి పరాయిగడ్డని విడిచి పెట్టలేని నిస్సహాయ పరిస్థితి.. రెండు తరాల అంతరాలకీ, ఆంతర్యాలకీ అద్దం పట్టింది ఈ నవల. 'కొత్తగాలి' కవితలన్నీ మనోరంజకంగా ఉన్నాయి. నవలావలోకనంలో ఆదివిష్ణు గారి 'మనిషి - మిథ్య' సమీక్ష అలనాటి జ్ఞాపకాలని తట్టిలేపింది. నాటి యువతరం ఆశల్ని, ఆశయాల్ని వాస్తవానికి దగ్గరగా చిత్రించడం ఈ నవలలో విశేషం!

– **డి. శ్రీనివాస దీక్షితులు,** *నరసరావుపేట*

★ 'ఆవలి అంచు' నవలలో పాత్రలు సహజంగా మన జీవితానికి దగ్గరగా అనిపించాయి. స్పష్టమైన అగాహన లేక విదేశాల మీద మోజుతో అమెరికా వెళ్లిన రామారావు దంపతుల బాధలు కళ్లకు కట్టినట్టుగా వర్ణించారు రచయిత. అలాగే చదువుకున్న స్కూలు, కాలేజీలకు తమవంతు సహాయం అందించి అభివృద్ధి పరచలానే సందేశం ఉత్తమ్, వినయ్ పాత్రల ద్వారా చెప్పించారు. 'మనిషి - మిథ్య' నవలలో కుటుంబ విలువలు మధ్యతరగతి జీవితానికి అద్దం పట్టాయి. ఈ తరం యువత ఇలాంటి నవలలు చదవగలిగితే ఒత్తిడిలో ఒంటరి కాదు అనే భావం కలుగుతుంది.

– **సయ్యద్ జమీలాబేగం,** *కర్నూలు*

★ అక్కినపల్లి సుబ్బారావు 'ఆవలి అంచు' నవల ఆణిముత్యం. అమెరికా పరిసరాలను, జీవన విధానాలను చక్కగా విశదీకరించారు. రచయిత సమకాలీన అంశాలన్నింటినీ ఆకళింపుచేసుకుని సైకలాజికల్‌గా మోటివేట్ చేయడం గమనార్హం. ఈ నవల ఎప్పటికీ జ్ఞాపకముండిపోతుంది. 'కొత్తగాలి' కవితలు సింపుల్‌గా చురుక్కుమనే ఫ్లాష్ పాయింట్‌తో వెలుగులు విరజిమ్ముతున్నాయి.

– **జి. విజయశ్రీ,** *శ్రీకాకుళం*

★ ఇద్దరు సోదరులు వేర్వేరు దేశాలలో నివసిస్తూ వారివారి మనోగతాలను, కష్టసుఖాలను చెప్పుకుంటున్నట్లుగా 'ఆవలి అంచు' నవల సాగింది. నవలలో చాలా ఘట్టాలు హృదయానికి హత్తుకునేలా ఉన్నాయి. జన్మదిన సంచికలో ఇంత చక్కని నవలను ప్రచురించినందుకు ధన్యవాదాలు.

– **వెలగా రాజేశ్వరరావు,**
*తాళ్లపాలెం, విశాఖ జిల్లా*

★ చతుర జన్మదిన ప్రత్యేక సంచిక అందించిన అక్కినపల్లి సుబ్బారావు నవల 'ఆవలి అంచు' ఎంతో ఉత్కంఠభరితంగా సాగింది. ఆధునిక పోకడలను అనుసరిస్తూ జన్మభూమిపై మమకారం రంగరించిన తెలుగు కథగా సాగింది. ఎంతటివారికైనా విదేశం పరదేశమే. ఫలహారాలతో, ఐస్‌క్రీములతో కడుపునిండదు. సొంతగడ్డన ఎన్నాళ్లు గడిపినా తనివితీరదు. మనకు చద్ది అన్నమే కావాలి. మాతృదేశం నీడనే బతకాలి. మాతృదేశం కన్నతల్లి కన్నా గొప్పది అంటూ సుబ్బారావు గొప్పగా చిత్రించారు.

– **పక్కి శ్రీదేవి,** *విజయనగరం*

★ నవల 'ఆవలి అంచు' ఆసాంతం ఆసక్తిగా సాగింది. కృష్ణారావు ఇక్కడ ఇమడలేక, రామారావు దంపతులు అమెరికాలో ఉండలేక తిరిగి తమ మొదటి చోటుకే రావడానికి కారణాలను చక్కగా చిత్రీకరించారు. పెద్దకథ 'గాజుసీసా' బాగుంది.

– **రాజేశ్వరి,** *నల్గొండ*

★ 'ఆవలి అంచు' చాలా సహజంగా అనిపించింది. అమెరికా జీవనపరిస్థితులు చక్కగా వివరించారు. చతుర'సమ్'గతులు ద్వారా చాలా విషయాలు తెలుసుకున్నాం. చతురకత 'నాగమ్మ ఆంగ్లం' కడుపుబ్బా నవ్వించింది.

– **సునీత,** *కొత్తగూడెం*

సంపుటి -39,
సంచిక - 2
458వ సంచిక,
పేజీలు : 132, మార్చి 2016

# చతుర



★ ముఖచిత్రం : హోలీ ఆయీరే..!
ఫొటో : దిలీప్ బెనర్జీ
★ రెండో కవరు : వారెవ్వా!
★ పుస్తకాలంకరణ : రాజు యాట



'రత్నా, మీ నాన్న నీ పెళ్లి నిశ్చయించబోతున్నారు' చెప్పింది తల్లి. ఒక్కసారిగా మిన్ను విరిగి మీద పడ్డట్టనిపించింది రత్నకు. 'అదేంటి? నా గ్రాడ్యుయేషన్ కూడా పూర్తి కాలేదే?' అందామె. 'నాకూ ఇపుడే పెళ్లి చెయ్యాలని లేదు నీకు. కానీ మీ నాన్న నీ పెళ్లి నరోత్తమ్‌తో దాదాపు నిశ్చయించేశారు. నిశ్చితార్థం కూడా చేసేవారే. నరోత్తమ్ నీ ఇష్టాయిష్టాలు తెలుసుకోమన్నాడట. నువ్వీ పెళ్లికి ఒప్పుకోవద్దు. అతను ఐ.ఎ.ఎస్. అయితే అవుగాక! అతనితో నీ పెళ్లి జరగడం నాకేమాత్రం ఇష్టం లేదు!' చెప్పింది తల్లి. కలెక్టర్ ఉద్యోగంతోపాటు అమ్మాయి ఇష్టాయిష్టాలకు విలువిచ్చే మంచి మనసున్న నరోత్తమ్‌ని పెళ్లి చేసుకోవద్దని ఎందుకు చెప్పింది తల్లి? రత్న ఏ నిర్ణయం తీసుకుంది? ఆద్యంతం ఆసక్తికర మలుపులతో సాగే **డా. శ్యామ్ సఖా శ్యామ్** హిందీ నవలకు **ఆర్. శాంతసుందరి** తెలుగు అనువాదం **ఏమీ లాభం లేదు!** చతుర మార్చి కానుక!

అతను ఓ ఫొటోగ్రాఫర్..
ఆమె ఓ మోడల్..
ఒకే ఫ్లాట్‌లో మకాం..
ఇద్దరి మధ్యా సాన్నిహిత్యం
పెరిగింది..
ఆమెనే పెళ్లి చేసుకోవాలన్న
నిర్ణయానికొచ్చాడతను.
ఓ రోజు హఠాత్తుగా బ్యాగు
సర్దుకుని ఎటో వెళ్లిపోయిం
దామె..! ఆ తర్వాతేమైంది?
మళ్లీ వాళ్లిద్దరూ ఎలా కలిశారు?
ఆద్యంతం ఆసక్తికరమైన
మలుపులతో ఉత్కంఠగాసాగే
డా. శ్యామ్ సఖా శ్యామ్
హిందీ నవలకు
ఆర్. శాంతసుందరి
తెలుగు అనువాదం
**ఏమీ లాభం లేదు!**
చతుర మార్చి కానుక!



హిందీ మూలం :
డా. శ్యామ్ సఖా శ్యామ్

అనువాదం : ఆర్. శాంతసుందరి

## ముంబై

ఒకేచోట స్థిరంగా ఉండటం చాలామందికి ఇష్టముండదు. నాది కూడా అలాంటి స్వభావమే. ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ఒకరకమైన అసంతృప్తి వెంటాడుతూ ఉంటుంది. ఇది నా తప్పేమీ కాదు. నేను పుట్టిన నక్షత్రమే అలాంటిదని మా నాయనమ్మ ఎప్పుడూ అంటూ ఉండేది. ఆమెకి కూడా ఆ సంగతి ఏ జ్యోతిష్కుడో చెప్పి ఉంటాడు. ఆవిడ అమాయకురాలు, ముక్కుసూటిగా పోయే మనిషి. ఈ చంచలమైన నక్షత్రమే నన్ను ఎక్కడా నిలకడగా ఉండనివ్వడంలేదు. ఆ రోజుల్లో ఎం.బి.ఎ. చదవటమే గొప్ప. నేనూ అందులో చేరాను. కొత్తగా వచ్చిన ఆ కోర్సు చదివి పాసయాను కూడా. ఎం.బి.ఎ. చేసిన వాళ్లకి బోలెడన్ని ఉద్యోగావకాశాలుండేవి. ఈ రోజుల్లో లాగా దాన్ని తీసిపారెయ్యటం ఉండేది కాదు. అంటే బంగాళాదుంపలు విపరీతంగా పండిన ఏడాది కిలో ధరకి ఐదు కిలోలు అమ్మినట్లన్నమాట. అలాగే ఇదీనీ. ఎం.బి.ఎ.లు చేసిన వాళ్ల సంఖ్య విపరీతంగా పెరిగిపోవడంతో ఉద్యోగాల కోసం చెప్పులరిగేలా తిరుగుతున్నారు. నెలకి ఒక కూలీపనివాడు సంపాదించే మొత్తం మాత్రమే జీతంగా ఇచ్చే ఉద్యోగాన్ని, మీరు కూలీపని అనుకోకపోతే, చేసేందుకు ఎం.బి.ఎ.లు సిద్ధంగా ఉన్నారు. ఇక నేను మూడు మంచి ఉద్యోగాలు చేశాక, తొమ్మిది నుంచి ఏడు గంటల వరకూ పని చేసీ.. చేసీ.. విసిగి పోయాను. కాలేజీలో చదువుకునే రోజుల్లో సరదాకి నాటకాలు వేసేవాణ్ణి. ఫొటోగ్రఫీలోనూ అభిరుచి ఉండేది. మొదట్లో మోడలింగ్ చేస్తూ ఒక ప్రొఫెషనల్ ఫొటోగ్రాఫర్ దగ్గర అసిస్టెంట్‌గా చేరాను.

ఆ రెండు పనులూ నా మనసుకు నచ్చినవి. ఎందుకో తెలుసా? నా వయసు వాళ్లతోను, నాకన్నా చిన్నవయసు యువతీ యువకులతోనూ కలిసి పనిచెయ్యడం సరదాగా ఉండేది. అంతేకాక వాళ్లకి కూడా నాలాగే మూస జీవితం ఇష్టముండేది కాదు. వాళ్లందరూ కలలు కనేవారు. వాటిని నిజం చేసుకోవాలన్న ఉత్సాహం ఉండేది. వాళ్లలో వాళ్లకి పోటీ ఉండేది. అందుకే అంత చిన్నవయసులోనే పూర్తిగా ప్రొఫెషనల్ అయిపోయాను. యువతుల్లో చాలామంది సుస్మితాసేన్‌నీ, ఐశ్వర్యారాయ్‌నీ చూసి ప్రేరణ పొంది మిస్ ఇండియా, మిస్ వరల్డ్ కావాలని కలలు కనేవారు. బాగా చదువుకున్న అమ్మాయిలు, పొడుగ్గా, అందంగా, మంచి శరీర సౌష్టవం ఉన్న యువతులు అన్నీ మరిచి పోయి ముంబైకి వచ్చేవారు. వాళ్లని ముంబై అయస్కాంతంలా ఆకర్షించేది. ముంబైకి వచ్చేముందు నేను మాత్రమే తెలివితక్కువగా స్థిరమైన ఉద్యోగాన్ని వదులుకుని భవిష్యత్తు గురించి ఆలోచించకుండా రిస్క్ తీసుకుంటున్నానని అనుకునే వాడిని. కానీ ఇక్కడ నాకన్నా పెద్ద పిచ్చి వాళ్లే కనిపించారు. అమ్మాయిల్లో ఇంజినీరింగ్, మెడిసిన్, ఆర్కిటెక్చర్, లా చదువుకునే వాళ్లు, ఎంట్రెన్స్ టెస్ట్‌లో మంచి మార్కులు తెచ్చుకుని సీట్లు సంపాదించుకున్నవాళ్లు చదువు మధ్యలో ఆపేసి తమ కలలు సాకారం చేసుకునేందుకు ముంబైకి వచ్చారు. అమ్మాయిలూ, అబ్బాయిలూ గుంపులు గుంపులుగా స్టూడియోల్లో, ప్రకటన కేంద్రాల్లో, నటన బోధించే విద్యాలయాల్లో తమ పోర్ట్‌ఫోలియోల్లో ఫొటోలు పెట్టుకుని తిరిగేవారు. ఎక్కడా ఫలితం లభించకపోయినా వాళ్లు నిరాశ పడ్డట్టు కనిపించేవారు కాదు.

నాకు మొదట్లోనే కొన్ని మంచి యాడ్లు చేసే అవకాశం దొరికింది. పని దొరికింది కానీ, మోడలింగ్ కన్నా ఫొటోగ్రఫీలోనే నాకు ఆసక్తి ఎక్కువ. మోడలింగ్‌లో టీమ్

వర్క్ ఉంటుంది. డైరెక్టర్, కెమెరా మేన్ ముఖ్యపాత్ర పోషిస్తారు. మోడళ్లు 'కీ' ఇస్తే కదిలే బొమ్మల్లా ఉండి పోతారు. బాహ్య సౌందర్యం.. శరీర సౌష్టవం.. అవే ముఖ్యం తప్ప, వాళ్ల ఆత్మసౌందర్యాలని, మనసులనీ ఎవరూ పట్టించుకోరు.

ఫొటోగ్రఫీలో కూడా పోర్ట్‌ఫోలియోలు తయారుచెయ్యడమంటే నాకు ఇష్టంగా ఉండేది. ఎందుకంటే ఆ పనిలో యువతీ యువకులతో మాట్లాడే అవకాశం ఉంటుంది. తమ ఫొటోలు ఎలా ఉండాలని అనుకుంటున్నారో వాళ్లు చెప్పేవాళ్లు. గ్రాడ్యుయేషన్‌లో చదువుకున్న మనస్తత్వ శాస్త్రం నాకు ఎంతో పనికొచ్చింది. వాళ్లతో మాట్లాడి, వాళ్ల ధోరణి కనిపెట్టి ఏ యాంగిల్‌లో ఫొటో తీస్తే వాళ్లు అందంగా కనిపిస్తారో చెప్పేవాణ్ణి. నా అదృష్టం బావుండి నా చేత ఫొటోలు తీయించుకున్న యువతీయువకులకి సీరియళ్లలో, యాడ్లలో, మ్యూజిక్ ఆల్బమ్ లాంటి వాటిలో అవకాశాలు వచ్చాయి. ఇక సీరియల్ నిర్మాతలు కూడా పనికొస్తారనుకున్న కొందరు యువతీ యువకులని ఫొటోలు తీయించుకోమని నా దగ్గరకి పంపించటం మొదలుపెట్టారు. ఈ రకంగా ఎంతోమంది యువతీ యువకులు నాకు స్నేహితులుగా మారారు.

వీళ్లలో చాలామంది తల్లిదండ్రులు చదువుకోమని ఒత్తిడి చెయ్యటం వల్ల తమ కుటుంబాలతో సంబంధాలు తెంపేసుకున్నారని, ఒంటరి జీవితాలు గడుపుతున్నారనీ తెలిసింది. చెట్లనుంచి రాలిన ఆకులు గాలి వాటుకు కొట్టుకుపోతున్నట్టు ఉండేవి.. వాళ్ల జీవితాలు. వాళ్ల గురించి, వాళ్ల కుటుంబాల గురించి ఆలోచిస్తే నాకు జాలి పుట్టుకొచ్చేది. తల్లిదండ్రులు ఎన్ని కష్టాలకి ఓర్చి పిల్లల్ని పెంచుతారు! ఎన్నో త్యాగాలు చేసి పిల్లల భవిష్యత్తుని తీర్చిదిద్దాలని చూస్తారు. కానీ పిల్లలు హఠాత్తుగ రెక్కలు విప్పి ఎగిరిపోయి, వాళ్ల కలల్ని ముక్కలు ముక్కలు చేస్తారు. ఒక్కోసారి కుటుంబాల్లోని పెద్దవాళ్లు వాళ్ల కోసం వెతుక్కుంటూ వస్తారు. ఇంటికి తీసుకెళ్లి పోవాలని అనుకుంటారు. కానీ ఎప్పుడూ అందంగా, వినయం ప్రదర్శించే వీళ్ల ముఖాలు అప్పుడెలా ఉంటాయో చూడవలసిందే. కని పెంచిన తల్లిదండ్రుల పట్ల వాళ్లు ఎంత కఠినంగా, దుర్మార్గంగా ప్రవర్తిస్తారో నేను చూశాను.

నేను మగవాణ్ణి! నా దగ్గర ఫొటోలు తీయించుకునే అమ్మాయిల పట్ల, మోడళ్ల పట్లా ఆసక్తి ఉండటం సహజమే కదా! ఒక ఫొటోగ్రాఫర్ ఒకే మోడల్‌తో ఎక్కువ కాలం పనిచేస్తూ ఉంటే, పేరులేని సంబంధమేదో ఇద్దరి మధ్యా ఏర్పడుతుంది. ఒక్కోసారి ఆ సంబంధం మరింత దగ్గరకి చేరుస్తుంది. ఇలాంటిది ముంబైలో చాలా మామూలు విషయం. నాక్కూడా ఇలాంటి అనుభవమే ఎదురైంది. ఎంతోమంది స్త్రీలతో స్నేహం కలిసింది. ఒకే ఫ్లాట్‌లో కలిసి ఉన్నాం, కానీ ఎవరితోనూ ఎక్కువ కాలం ఉండలేదు నేను.

ఈ మధ్య రూబీ అనే అమ్మాయితో ఉంటున్నాను, దాదాపు ఆరునెలలుగా. రూబీ వయసు ఇరవయ్యో, ఇరవై ఒకటో ఉంటుంది. అందంగా.. చాలా అందంగా ఉంటుంది. కానీ మనసులో ఏముందో ఎపుడూ చెప్పదు. పెద్ద పెద్ద నల్లని కళ్లు. కానీ ముఖం మీద దిగులుతో కూడిన సన్నని చిరునవ్వు. ఆమె చిరునవ్వు చాలా అందంగా ఉంటుంది.. కానీ అది తెచ్చిపెట్టుకున్నది అని అంటారు అందరూ. అయితే మీరే చెప్పండి, ఆరు నెలలుగా ఆమెతో కలిసి బతుకుతున్నాను.. అన్నాళ్ళు అలా నాటకీయంగా నవ్వడం ఎవరికైనా సాధ్యమంటారా? అసలు నన్నడిగితే అలా ఎవరికీ అంతుపట్టని ఆ చిరునవ్వే ఆమెలోని అతిపెద్ద సౌందర్యం అంటాను.

మా స్నేహానికి శారీరకంగా ఎలాంటి పరిమితులూ లేవు. రూబీ ఊరేదో? ఎక్కణ్ణించి వచ్చిందో? అసలు ఆమె ఎవరో? ఏమీ నాకు తెలీదు. ఒకటి రెండుసార్లు తెలుసుకోవాలని ప్రయత్నించి అడిగాను. కానీ వెంటనే ఆమె నా మీద విరుచుకుపడింది. 'నా గతంలోకి తొంగి చూసేందుకు ఎప్పుడూ ప్రయత్నించకు!' అని ఇంగ్లీషులో తిట్టింది. అలాంటప్పుడామె ముఖం వికృతంగా, అవతలి వ్యక్తి రక్తం కళ్ళ చూస్తుందా అన్నంత కోపంగా మారిపోతుంది. అందుకే నేను మళ్ళీ ఆ ప్రసక్తి తీసుకురాలేదు.

మిగతా మోడళ్లలాగే రూబీ కూడా చాలా ప్రొఫెషనల్‌గా ఉండేది. ఈ యాడ్ల ప్రపంచంలో ఆమెకి బాగా పేరు కూడా వచ్చింది. ఒకటి రెండు సీరియళ్లలో నటించడం మొదలుపెట్టింది. కానీ త్వరగానే వాటిలోంచి తప్పుకుంది. ఒకే పని ఎక్కువ కాలం చేస్తే విసుగు పుడుతుందనీ, పైగా జీవితానికి ఏమాత్రం సంబంధం లేని ఆ సీరియల్ కథలంటే వెగటు పుట్టిందనీ చెప్పింది. అంతకన్నా మోడలింగ్, ఫ్యాషన్ షోలే తనకి బావుంటాయని అంది. వీటిలో ఎలాంటి ఒత్తిడీ ఉండదనీ, నిటారుగా నిలబడి ర్యాంప్ మీద అటూ ఇటూ నడవడమేగా అనీ, అలా నడుస్తున్నప్పుడు సామాన్య జనం ముందు నడిచే మహారాణిలా అనిపిస్తుందనీ అంది.

బోలెడంత డబ్బు తగలేసి ఫ్యాషన్ షోలకి వచ్చేవాళ్ళు బాగా డబ్బున్నవాళ్లే. అందమైన మోడళ్లని ఆబగా చూస్తూ, వాళ్ళతో శారీరక సంబంధం పెట్టుకుని స్వర్గ సుఖాలని అనుభవిస్తున్నట్టు ఊహించుకుని, తృప్తిపడుతూ ఉంటారు. కానీ ఈ మాట రూబీ నోట వినడం నాకు నచ్చలేదు. కారణం, నేనామెని రహస్యంగా ప్రేమించడం మొదలెట్టాను. ఈ విషయంలో కూడా రూబీ ప్రొఫెషనల్‌గానే ప్రవర్తిస్తుంది. ఏమాత్రం సంకోచం లేకుండా స్పష్టంగా, 'నీతో ఉండడం నాకు బావుంది. అందుకే మనం కలిసుంటున్నాం! నీ మీద మోజు తగ్గిపోయిన రోజున చెప్పాపెట్టకుండా పారిపోతాను' అంటూ ఉంటుంది. ఆ మాట వినగానే నాకు దిగులు కమ్ముకొస్తుంది. ఇంతకు ముందు నాకు ఎంతోమంది అమ్మాయిలతో సంబంధాలు ఉండేవి. కానీ రూబీని కలిశాక నా మనసు ఇంకెవరి మీదకీ పోలేదు. ఈ ఆరునెలల్లో రూబీ తన బంధువుల గురించి గానీ, స్నేహితుల గురించి గానీ ఎప్పుడూ మాట్లాడలేదు. నాకు తెలిసినంత వరకూ ఎవరి దగ్గర్నించీ ఆమెకి ఒక్క ఫోను గానీ, ఉత్తరం గానీ రాలేదు. తను కూడా ఎవరికీ ఫోన్ చెయ్యలేదు.. ఉత్తరం రాయలేదు.

నాకు ఆమె మీద ప్రేమ పెరిగినకొద్దీ ఆమె ఎవరో? ఏమిటో? తెలుసుకోవాలన్న తపన పెరగసాగింది. ఆమె ఎక్కణ్ణుంచి వచ్చింది? తల్లిదండ్రులు ఉన్నారా? ఉంటే ఏం చేస్తున్నారు? ఎక్కడున్నారు? లాంటి వివరాలు తెలుసుకుంటే గానీ నాకు నిద్రపట్టేట్టు లేదు. చివరికి ఆమె ఏ మతానికి చెందిందో కూడా నాకు తెలీదు. అలాగని నేను మతాన్ని నమ్మే ఛాందసుణ్ణి కాను. నేను చేసే వృత్తిలో అన్ని కులాలవాళ్ళు, మతాలవాళ్ళూ కలిసిమెలిసి ఉంటారు. ఆవు మాంసం తిననంతవరకూ నేను హిందువునే. హోళీ, దీపావళి, క్రిస్‌మస్, ఈద్.. అన్ని మతాల స్నేహితులతోనూ జరుపుకుంటాను. చర్చికి, మసీదుకి వెళ్ళటానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు.

అన్నట్టు మునుపు జుబేదా అనే ముస్లిమ్ అమ్మాయితో నాకు పరిచయం ఉండేది. ఒకసారి ఈద్ రోజున వాళ్ళింటికి వెళ్ళాను. వాళ్ళందరూ ఈద్ గాహ్‌కి వెళ్తూ వుంటే నన్ను కూడా వాళ్ళ వెంట తీసుకె

# హాలీవుడ్ విశేషాలు




టాలీవుడ్ కేవలం తెలుగువాళ్లనే ఆకర్షిస్తే, బాలీవుడ్ భారతీయులనే ఆకర్షిస్తుంది. పేర్లలో వీటికి మాతృక అయిన హాలీవుడ్ ప్రపంచం లోని కోట్లాది మందిని ఆకర్షిస్తోంది. అలాంటి హాలీవుడ్‌కి చెందిన కొన్ని నిజాలు..

★ వార్నర్ బ్రదర్స్ కంపెనీలో నిర్మాతగా పనిచేసే హాల్ వేలిస్ స్వంతంగా చిత్రాలు నిర్మించడానికి నిర్ణయించుకుని, తన ఉద్యోగానికి నెలరోజుల నోటీస్ ఇచ్చాడు. వార్నర్ బ్రదర్స్ ప్రెసిడెంట్ జాక్‌వార్నర్ వెంటనే హాలీవేలిస్ గది తలుపుకి తాళం వేయించి, అతని డెస్క్‌ని బయట లాన్‌లో వేయించాడు. వెళ్తున్నాడనే కోపంతో ఓ లారీడు గుర్రపు పెంటని తెప్పించి వేలిస్ డెస్క్ పక్కనే పోయించాడు.



★ కొలంబియా పిక్చర్స్ ఓ సినిమాకి పెట్టిన పేరు రాజ్‌మతాజ్. ఇది తెలిసిన థియేటర్ యజమాని, ఆ చిత్ర నిర్మాతని పిలిచి కోపంగా 'దేశంలో ఏ థియేటర్ యజమానికైనా నాలుగు జడ్‌లున్నాయేమో కనుక్కో' అన్నాడు. అప్పట్లో సినిమా పేరుని ప్లాస్టిక్ ఆల్ఫాబెట్‌లతో థియేటర్‌లో అతికించేవారు. సాధారణంగా ఏ థియేటర్‌లోనూ నాలుగు ప్లాస్టిక్ జడ్‌లు ఉండవు. దాంతో ఆ సినిమా పేరు మార్చారు.

★ దర్శకుడు సిసిల్.డి.మిలీ నటీనటులు, కెమెరామేన్, డైరెక్టర్లకన్నా రచయిత ముఖ్యమని భావించేవాడు. తెరపై కనిపించే సినిమాని పేపర్‌పై బ్లూప్రింట్ గీసేవాడు రచయిత అనేవాడు. స్టూడియో అధినేతలూ నమ్మి గౌరవించేవారు.

★ 'సెవెన్ ఇయర్స్ ఇన్ టిబెట్' చిత్రంలో నటించినందుకు హాలీవుడ్ నటుడు బ్రాడ్‌పిట్‌కి చైనా వీసా రద్దయింది. జీవితకాలంలో అతనికి చైనా వీసా మంజూరు కాదు!

★ 1940లో విడుదలైన 'గ్రేప్స్ ఆఫ్ రాత్'ని సోవియట్ యూనియన్ అధినేత జోసెఫ్ స్టాలిన్ నిషేధించాడు. అతి బీద అమెరికన్స్ కూడా కారు ఉపయోగిస్తారని రష్యన్ ప్రజలకి తెలియడం ఇష్టంలేకపోవడమే కారణం.

★ 'అవతార్' సినిమాను చైనాలో నిషేధించారు. అందులో ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం వారికి నచ్చలేదు.

ళ్లమని అడిగాను. జుబేదా తల్లిదండ్రులు బాగా చదువుకున్న వాళ్ళే. తల్లి కాలేజీలో లెక్చరర్, తండ్రి సివిల్ ఇంజినీరు. వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ముందు జుబేదా లోపలికి వెళ్ళింది. ఆమె వెనకే నేను లోపలికి అడుగుపెట్టాను. జుబేదా నన్ను వాళ్ళకి పరిచయం చేసి, ఈద్ గాహ్‌కి వాళ్ళ వెంట వెళ్ళాలనుకుంటున్నానని చెప్పింది. జుబేదా మోడలింగ్‌తో పాటు, సీరియళ్లలో కూడా నటించేది. నేను ఒత్తిడి చేస్తేనే షూటింగ్ కేన్సిల్ చేసుకుని కుటుంబ సభ్యులతో పండగ చేసుకునేందుకు వచ్చింది. కానీ నేను ఈద్ గాహ్‌కి వెళ్లాలనుకుంటున్నానని జుబేదా చెప్పగానే వాళ్ళు హఠాత్తుగా మౌనం వహించారు. ఒక్కరు కూడా సరే అని కానీ, వద్దు అని కానీ అనలేదు. నేను ఈద్ గాహ్‌కి వెళ్ళలేకపోయాను. ఆ తరువాత జుబేదాతో నాకున్న స్నేహం కూడా పల్చబడిపోయింది.

సినీతారలైనా, క్రికెట్ సెలబ్రిటీలైనా, ఇంకే రంగంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించిన కళాకారులైనా తమ మతానికి సంబంధించిన లక్కీ మస్కట్లనో, చిహ్నాలనో ఒంటి మీద ధరిస్తారు. లేదా ఇంట్లో పెట్టుకుంటారు. ఈ పద్ధతి మోడళ్లలో కూడా ఉంది. కానీ రూబీ ఏ పండగా

చేసుకునేది కాదు. ఎలాంటి లక్కీ చార్మ్స్‌నీ ఆమె వాడటం నేను చూడలేదు. రూబీ చాలా విచిత్రమైన అమ్మాయి. ఆమెకి తన మూడ్ ఒక్కటే ముఖ్యం. పని ఎంచుకోవటం కూడా అప్పటి మూడ్‌ని బట్టే ఉంటుంది. తనకిష్టమైన పనిని మాత్రమే చేసే రకం. ఒక పేరుపొందిన ఫ్యాషన్ డిజైనర్ దగ్గర ఆమె పనిచేసేందుకు ఇష్టపడకపోవటానికి కారణం వింటే మీరు ఆశ్చర్యపోతారు. అతను ముక్కుతో మాట్లాడతాడని, అతని గొంతు వింటేనే తనకి వాంతి వస్తుందనీ చెప్పింది రూబీ.

ఒకసారి తన ఫ్యాషన్ షో నుంచి ఇంటికి వచ్చామో? లేదో? రూబీ తన బ్యాగు సర్దుకోవడం మొదలుపెట్టింది. రూబీకి ఉన్న వింత అలవాట్లలో ఇది కూడా ఒకటి. ఏ క్షణాన ఏం చేస్తుందో ఎవరికీ తెలీదు. ఇన్నాళ్ళుగా కలిసి ఉంటున్నా ఎక్కడికెళ్తున్నావని అడిగే ధైర్యం చెయ్యలేకపోయాను. కొత్తలో ఒకసారి ఈ ప్రశ్న అడిగితే 'నీకెందుకు?' అని కటువుగా జవాబు చెప్పింది. 'మనిద్దరం స్నేహితులం! కలిసుంటున్నాం! ఆ మాత్రం అడిగే హక్కు లేదా?' అన్నాను. నా వాక్యం పూర్తయేలోపలే రూబీ మండిపడి, 'షట్ అప్! ఏమిటి నీకున్న హక్కు? ఇద్దరం కలిసి ఒకే ఫ్లాట్‌లో ఉంటున్నాం. ఒకే గదిలో గడుపుతున్నాం. ఎందుకంటే ఇద్దరికీ అది బావుంది! అంతేగా?' అంది. ఇంకా కోపం చల్లారలేదేమో 'ఇక నుంచీ నా మీద నీకేదో హక్కున్నట్టు మాట్లాడకు. ఈ ఫ్లాట్ అద్దెలో సగం, మిగతా ఖర్చుల్లో సగం భరిస్తున్నాను. నేనిచ్చే డబ్బు నీకు అందని రోజున నా సామాను తీసి బయటపారెయ్యి. కానీ నా మీద హక్కున్నట్టు మాత్రం ప్రవర్తించకు' అంది.

ఆ తర్వాత అలాంటి ప్రశ్నలు అడిగే సాహసం చెయ్యలేదు నేను. తనకి బుద్ధిపుట్టినప్పుడు బ్యాగు సర్దుకుని వెళ్ళిపోయేది. ఒక్కోసారి రెండ్రోజులు, లేదా పది రోజుల తరువాత, ఇంకా మాట్లాడితే నెల తరువాత కూడా వచ్చేది. కానీ నాతో ఉన్నప్పుడు మా ఇద్దరిమధ్యా ఎన్నోజన్మల బంధం ఉన్నంత ప్రేమ చూపించేది. ఒకవేళ మనిద్దరికీ ఉన్న సంబంధం ఏమిటి? అని నేను అడిగి ఉంటే, 'ఒకే మంచం మీద పడుకుంటున్నాం! అదే.. అలా పడుకోవటం మనిద్దరికీ బావుంది! అందుకే పడుకుంటున్నాం!' అనేది.

ఎంత నిజాయితీ గల అమ్మాయి! నదురూబెదురూ లేని అందమైన ముద్దొచ్చే అమ్మాయి రూబీ. మరి అలాంటి అమ్మాయితో ప్రేమలో పడటం నా తప్పా?

ప్యాక్ చేసిన బ్యాగుని భుజానికి తగిలించుకుని రూబీ వెళ్ళిపోయింది. ఒక బై బై లేదు.. టాటా లేదు.

నేను స్నానం చేసి ఒక పెగ్గు విస్కీ గ్లాసులో పోసుకుని రాకింగ్ ఛైర్‌లో కూలబడ్డాను. అలా కూర్చున్నానో? లేదో? ఫోను మోగింది. ఎవరితోనూ మాట్లాడాలని లేదు నాకు. కానీ ఫోన్ మోగుతూనే ఉండేసరికి ఎత్తక తప్పలేదు.

"హలో" అన్నాను.

"నేను! శంతనూని మాట్లాడుతున్నాను"

"ఆఁ! చెప్పు!"

"ఏమిటీ గొంతు అదోలా ఉంది? మళ్ళీ రూబీ తుర్రుమందా?"

"అవును శంతనూ! సరే! ఇంతకీ ఫోన్ ఎందుకు చేశావు?"

"ఒకపని దొరికింది! ఒక ప్రైవేట్ షోని వీడియో తియ్యాలి!"

"శంతనూ!"

"అవును భాయ్! నాకు తెలుసు! నువ్వు ప్రైవేట్ ఆల్బమ్‌లు చెయ్యవు. కానీ బోల్డెంత డబ్బు వస్తుంది ఇందులో. అయినా నాలుగైదు గంటలేగా!"

"ఎప్పుడు?"

"ఎల్లుండి"

అ
క్ష
రం

నేను నిజం ఎందుకు మాట్లాడతానంటే
అబద్ధం చెప్పడం రాదు కాబట్టి
అలాంటప్పుడు నిన్ను ప్రేమించడంలేదని
ఎలా చెప్పగలను?

– మీర్జా గాలీబ్



"ఎక్కడ?"

"నేను వచ్చి నిన్నక్కడికి తీసుకుపోతాలే"

ఇక ఏమీ మాట్లాడాలని అనిపించక ఫోన్ పెట్టేశాను.

చెప్పిన సమయానికి శంతను వచ్చాడు. నా ఎక్విప్మెంట్ని కారులో పెట్టాక, ఇద్దరం బయలుదేరాం. మడ్ ఐలాండ్కి ఉత్తరాన ఒక నిర్మానుష్యమైన చోట ఉన్న బంగళాలో షూటింగ్ జరగాల్సి ఉంది. అన్ని ఏర్పాట్లు చేసేశారు. తీరా వెళ్ళాక.. ముందుగా తెలిస్తే ఈ పనికి ఒప్పుకునే వాణ్ణి కాను అని అనుకున్నాను. కానీ జరగాల్సిన పొరపాటు జరిగిపోయింది.

అదొక ప్రైవేట్ క్లబ్! దాని పేరు మస్కెటీయర్స్. కానీ అది మహిళలకి మాత్రమే ప్రత్యేకించిన క్లబ్. అక్కడ సభ్యులందరూ నడివయసుకి చేరుకున్న కోటీశ్వరులు. ఆనాటి షో పురుషుల స్ట్రిప్టీజ్. ఆ షోలో మోడలింగ్లో పైకొస్తున్న యువకులు ర్యాంప్ మీద తమ శరీరాలని ప్రదర్శించబోతున్నారు. సరిగ్గా అమ్మాయిలు చేసినట్టే వీళ్ళూ చేస్తారు. షో మొదలైంది. చూసేందుకు వచ్చిన ఆడవాళ్ళందరూ చేతుల్లో రకరకాల మద్యం గ్లాసులతో కూర్చుని ర్యాంప్ మీద నడుస్తున్న అబ్బాయిల వైపు తినేసేట్లు చూడడం మొదలెట్టారు. ఇంత నిర్లజ్జగా మగవాళ్ళు కూడా అమ్మాయిలవైపు చూడరేమో! షో అయిపోవస్తూ ఉండగా ఆ ఆడవాళ్ళ ఆరాటం పతాకస్థాయికి చేరుకుంది. రకరకాల మాటలూ, ఈలలూ, మూలుగులూ వినిపించసాగాయి. నేల తరగతి సినిమా ప్రేక్షకుల్లాగ ప్రవర్తిసున్నారు కోటీశ్వరులైన ఆ ఆడవాళ్ళు.

ఇలాంటి కార్యక్రమాల గురించి తను చాలాసార్లు విన్నాడు. కానీ చూడటం ఇదే మొదటిసారి. ర్యాంప్ మీద కుర్రవాళ్ళు కూడా అమ్మాయిల్లా హొయలు ఒలకబోస్తూ నడుస్తున్నారు. శంతను ర్యాంప్ మీద లేకపోయినా ఈ షోకి కొరియోగ్రాఫర్ అతనే. షో జరుగుతున్నంతసేపు నాకు దూరంగానే ఉండిపోయాడు. నేనేమైనా అంటానని భయపడ్డాడు లాగుంది. ముందుగా షో గురించి వివరాలు అడగనందుకు నన్ను నేను తిట్టుకున్నాను. కానీ ఇప్పుడు చెయ్యగలిగిందేముంది.

షో అయిపోయాక ఆ నడివయసు ఆడవాళ్ళు తమకి నచ్చిన కుర్రాళ్ళని వేలంపాటలో గెలుచుకుని డబ్బిచ్చి కొనుక్కున్నారు. మరుక్షణం శంతను నన్ను గబగబా కారెక్కించి నా ఫ్లాట్లో దింపి వెళ్ళిపోయాడు. రెండురోజుల తరువాత ఫోన్లో శంతను మెసేజ్ పంపాడు. నేను తీసిన వీడియోని, షో ఏర్పాటు చేసిన ఆవిడ ఇంటి దగ్గర ఇచ్చెయ్యమనీ, తను ఇరవై రోజులు గల్ఫ్కి వెళ్తున్నాననీ దాని సారాంశం. నాకు డబ్బు తను ముందే ఇచ్చేశాడు.

సాయంత్రం ఎనిమిది గంటల ప్రాంతంలో ఆవిడ ఇంటికి వెళ్ళాను. బెల్ కొడితే ఒక పనమ్మాయి తలుపు తీసింది. గోవా అమ్మాయిలా కనిపించింది. పందొమ్మిది ఇరవై ఏళ్ళుంటాయి. అందంగా ఉంది. ఆమె తొడుక్కున్న బట్టలు మెరిసి

పోతున్నాయి. నేను లోపల లాబీలో కూర్చున్నాను. ఆ పనమ్మాయి నా ముందు కూల్‌డ్రింక్ పెట్టి వెళ్ళేంతలో ఇంటి యజమానురాలు వచ్చింది. అరవై యేళ్ళు ఉండొచ్చు. కానీ చూసేందుకు ఆవిడ నలభై - నలభై ఐదేళ్ళ మనిషిలా కనిపించేందుకు ప్రయత్నిస్తోంది.

వస్తూనే నాకు షేక్‌హ్యాండిచ్చి, "హలో యంగ్‌మ్యాన్! ఎలా ఉన్నారు? " అంది.

తరువాత పనమ్మాయి వైపు చూసి గద్దిస్తున్నట్టుగా, "డైజీ! ఈ టైములో కూల్ డ్రింక్ ఇచ్చావేంటి? ఉత్త పల్లెటూరి మొద్దువి! ఎంత చెప్పినా అర్థం కాదు నీకు? " అంది ఇంగ్లీష్‌లో.

తరువాత నా వైపు తిరిగి "చెప్పండి! ఏం తీసుకుంటారు? విస్కీ.. స్కాచ్.. వైన్.. బీయర్.. ఏం కావాలి? " అని మళ్లీ "సారీ నన్ను నేను పరిచయం చేసుకోనే లేదు కదూ? నా పేరు దత్!" అంటూ కృత్రిమంగా నవ్వింది.

"నా పేరు శేఖర్!" అని బల్లమీదున్న వీడియో క్యాసెట్ చూపిస్తూ "శంతను దీన్ని మీకిమ్మని అన్నాడు" అన్నాను.

మిసెస్ దత్ సోఫాలో కూర్చుంటూ, "అవును! ఒట్టి అల్లరి పిల్లాడు! శంతను లేకపోతే నాకేమీ తోచడంలే!" అంది.

ఆమె వ్యవహారం చాలా ఇబ్బందిగా ఉన్నప్పటికీ నేనేమీ అనలేదు. డైజీ డ్రింక్ తెచ్చింది. వద్దు వద్దంటున్నా వినకుండా మిసెస్ దత్ బ్లాక్ హార్స్ గ్లాసులో ఒంపి నా చేతికిచ్చింది. మరో గ్లాసు తను తీసుకుంది. నేను తెచ్చిన వీడియోని ప్లేయర్‌లో పెట్టమని డైజీకి చెప్పింది.

"మీరు చూడండి! నే వెళ్తాను" అన్నాను.

కానీ ఆవిడ నా చెయ్యి పట్టుకుని కూర్చోపెట్టేసింది. వీడియో మొదలై పది నిమిషాలయిందో? లేదో? ఆమెలో ఉద్వేగం పెరిగిపోసాగింది. నేను అభ్యంతరం చెప్పేసరికి సిగ్గులేకుండా నవ్వుతూ "నువ్వు చాలా మంచి స్నేహితుడివని శంతను చెప్పాడు. మరి అందమైన ఈ సాయంత్రాన్ని నాకు దక్కకుండా ఎందుకు చేస్తున్నావు? ఊరికే కాదులే, నీకు డబ్బిస్తాను. వీడియో తీసినందుకు ఇచ్చినదాని కన్నా ఎక్కువే ముట్టజెపుతాను. రా..! సరదాగా గడుపుదాం!" అంది మత్తుగా!

ఆమె అలా అనేసరికి నాకు ఒళ్ళంతా పురుగులు పాకినట్టయింది. పెద్ద పెద్ద నగరాల్లో ఇలాంటి ఆడవాళ్ళు ఉంటారని నాకు తెలుసు. 'మగవేశ్యల' మీద బోలెడంత డబ్బు తగలేస్తారనీ తెలుసు. కానీ నాకు ఇలాంటిదెపుడూ ఎదురుపడలేదు. శంతను నన్ను ఇలాంటి ఇరకాటంలో పడేస్తాడని అనుకోలేదు. కానీ ముంబైలాంటి మహానగరంలో అవతలి వ్యక్తి ఎలాంటి వాడో మనకి ఎప్పుడూ పూర్తిగా తెలీదు.

"మీ వయసెంతో తెలుస్తోందా మీకు? " అన్నాను అప్రయత్నంగా.

ఆమె వెంటనే "మగవాడికి ఎంత వయసొచ్చినా పదహారేళ్ళ పడుచుపిల్ల కావాలి. మరి ఆడదానికి అలాంటి కోరిక ఎందుకుండకూడదు? పదహారేళ్ళప్పుడు బంధువుల్లో ఒక ముసలాడు నా మీద అత్యాచారం చేశాడు. అయినా ఈ లోకంలో మనిషికున్న సంబంధం ఒకటే స్త్రీ - పురుష సంబంధం. ప్రస్తుతం ఈ నాలుగ్గోడల మధ్య నువ్వొక్కడివే మగాడివి! మేం ఇద్దరం ఆడవాళ్ళం! రా! మజా చేసుకో! నేను పదివేలిస్తాను. డైజీ ఫ్రీగా దొరుకుతుంది!" అంది.

ఎంతో కష్టం మీద ఆ ఉచ్చులో పడకుండా తప్పించుకున్నాను. బయటకి వచ్చాక సముద్రం ఒడ్డున నడుస్తూ ఊపిరితిత్తుల నిండా గాలి పీల్చుకున్నాను. కానీ నా గాబరా తగ్గలేదు. కాస్త స్థిమితపడ్డాక ఇల్లు చేరాను. ఉదయం పెందలాడే మెలకువ వచ్చింది. నిన్న జరిగిన సంఘటన తాలూకు అవశేషాలు ఇంకా ఉండిపోయిన

చమత్కారం

# కవిత్వం రాయాలంటే.. ఇవి కావాలట!

కవిత్వం రాయాలంటే నిరుపహతి స్థలంబు, కర్పూరతాంబూలం, ఊయల మంచం తదితరాలు కావాలన్నాడు ప్రబంధ కవి పెద్దన. కూచిమంచి తిమ్మకవిగారి మాటా ఇంచుమించు అంతే! ఆయనగారు ఏమంటున్నారో చూడండి..

నిరుపమ దివ్యమందిరములు దధిఘృత
శాకసూపాంచిత సరసభోజ
నములు విచిత్రాంబరములును బీఠముల్
పట్టెమంచమ్ములు ప్రక్కదిండ్లు
పరుపు బాలీసులు వటవాసమృగమదా
గురుచందనాదులు కులుకు కలికి
జవ్వనియును వ్రాయ జదువగా నేర్చిన
భృత్యవర్గంబు వివిక్తతలము

కలుగకుండిన జెలువంపు కవితగూర్ప
అలవికాదు గదయ్య యా నలువకైన
సరసదరహాస! పీఠికాపుర నివాస!
గౌతమీకాశ నీకాశ! కుక్కుటేశ!

గొప్ప గొప్ప దివ్యభవనాలు, పెరుగు, నేయి, కూరలు, పులుసులు గల రుచికరమైన భోజనాలు, పట్టుపీతాంబరాలు, ఘనమైన ఆసనాలు, పట్టెమంచాలు, మెత్తని దిండ్లు, పరుపులు, బాలీసులు, కస్తూరి చందనాలు, కళ్లకు నవ్వుతూ ఆనందాన్ని కూర్చే చెలికత్తె, రాయడం, చదవడం వచ్చిన అనుయాయులు, ప్రశాంతతకు వీలైన ఏకాంతం ఇవేవీ లేకుండా గొప్పకవిత్వం రాయడం ఆ బ్రహ్మకైనా సాధ్యమవుతుందా? అని పిఠాపురం కుక్కుటేశ్వరస్వామికి విన్నవిస్తున్నాడు ఈ కవిగారు.

ప్రాచీన కవులు ఇలాంటి కవితాసామగ్రి కావాలంటే ఆధునిక యుగకవి శ్రీశ్రీ 'సిందూరం, రక్తచందనం, బంధూకం, సంధ్యారాగం, పులిచంపిన లేడినెత్తురు, ఎగరేసిన ఎర్రని జెండా..' కవిత్వం రాయడానికి కావాలన్నారు. ఇంకా 'కదిలేదీ కదిలించేదీ, మునుముందుకు నడిపించేదీ, పెనునిద్దుర వదిలించేదీ కావాలోయ్ నవకవనానికి..' అన్నారు.

సేకరణ: చంద్రప్రతాప్



ట్టున్నాయి. నైట్ ల్యాంప్ వెలుతురులో రూబీ ఫొటో కళ్ళబడేసరికి ఆమెలో మిసెస్ దత్ పోలికలు కనిపించసాగాయి. ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాను. లేచి డార్క్ రూమ్‌లోకి వెళ్ళాను. శంతను స్టిల్ ఆల్బం తాలూకు రఫ్ ప్రూఫ్‌లు డస్ట్‌బిన్‌లో ఉన్నాయి. వాటిలోంచి మిసెస్ దత్ ఫొటో వెతికి బయటికి తీశాను. రూబీ ఫొటోతో దాన్ని పోల్చిచూశాను. ముందు ఇద్దరికీ బాగా పోలిక ఉన్నట్టే అనిపించింది. మళ్ళీ ఇది నా మనసు చేస్తున్న గారడీయేమో అనుకున్నాను. నిన్న రాత్రి అనుభవం మళ్ళీ గుర్తొచ్చింది. శంతను ఇలాంటి వ్యవహారాలు చేస్తున్నట్టు నాకు కొందరు స్నేహితులు చూచాయగా చెప్పారు. కానీ ఆ మాటలను నేనంతగా పట్టించుకోలేదు. అసలు ముంబై మహానగరంలో ఇలాంటివి ఎవరూ పట్టించుకోరు. తమ పనేదో తామేదో అన్నట్టు పూర్తిగా ప్రొఫెషనల్‌గా ప్రవర్తిస్తారు.

ఒకసారి నేను ఘజియాబాద్‌లో ఉండగా ఒక పార్టీలో- తను ఇలాంటి వ్యాపారం చేసే డబ్బు సంపాదించాననీ, ఆ డబ్బుతోనే నర్సింగ్ హోమ్ కట్టించాననీ ఎవరో డాక్టర్ చెప్పినట్టు గుర్తు. ఆయన ఏమాత్రం సంకోచం లేకుండా, ఆడవాళ్ళు కొన్ని వందల ఏళ్ళుగా తమ శరీరాలతో వ్యాపారం చేస్తూ, డబ్బు సంపాదిస్తూ, మగవాళ్ళ తెలివితక్కువతనాన్ని తమ లాభానికి ఉపయోగించుకుంటున్నారనీ, ఇప్పుడు ఈ విషయంలో మగవాళ్ళు కూడా తెలివిగా అదే పని చేస్తే తప్పేమిటనీ వాదించాడు. సాయంకాలం ఏడెనిమిది గంటల ప్రాంతంలో ఢిల్లీలో కనాట్ ప్లేస్‌లో నిలబడితే చాలు.. మిమ్మల్ని కొనుక్కోదలుచుకున్న ఆడది వెతుక్కుంటూ వస్తుంది. మిమ్మల్ని ఫైవ్ స్టార్ హోటల్‌కి తీసుకుపోయి జన్మలో మీరు మరిచిపోలేనంత సుఖాన్ని పంచుతుంది. అలాంటి ఆడవాళ్ళ భర్తలు కూడా అదేవిధంగా అమ్మాయిలని వేటాడుతూ ఉంటారు. వాళ్ళకి డబ్బంటే లెక్కలేదు. వీళ్ళూవాళ్ళని కాదు, ఆ దేహవ్యాపారంలో కాలేజీ కుర్రాళ్ళ దగ్గర్నించీ వివాహితులైన యువతీయువకులు కూడా ఉంటారు. అంటూ ఏవేవో చెప్పుకొచ్చాడు ఆ డాక్టరు. అప్పుడు అతను లేనిపోనివి కల్పించి చెపుతున్నాడని అనుకున్నాను. కానీ గత రాత్రి జరిగిన సంఘటన నా కళ్ళు తెరిపించింది. వాస్తవం కల్పన కన్నా ఎక్కువ అందంగా, భయంకరంగా, అసహ్యంగా, విషాదంగా, మార్మికంగా ఉంటుందనిపించింది నాకు.

చెప్పకుండా వెళ్ళిన రూబీ మర్నాటికల్లా ఉరమని పిడుగులా చెప్పకుండానే వచ్చేసింది. ఈసారి ఎందుకో ఆందోళనగా ఉన్నట్టు కనిపించింది. నేరకపోయి కారణం అడిగాను.

"నా ఇబ్బందుల గురించి తెలుసుకోవాల్సిన అవసరం నీకు లేదు" అంది.

కానీ ఆమెకి ఏదో సమస్య వచ్చిందని నాకు తెలిసిపోయింది.

రెండు రోజుల తరువాత సాయంత్రం పని ముగించుకుని ఇంటికి వచ్చేసరికి రూబీ మళ్ళీ సామాను సర్దుకుని వెళ్ళేందుకు సిద్ధంగా ఉంది. కానీ ఆమె మంచి మూడ్‌లో ఉన్నట్టు కనిపించింది. ఎప్పటిలా కాకుండా, ఏదో పని మీద తను యూరప్ వెళ్తున్నానని తనంతట తానే చెప్పింది. ఆ రోజు రాత్రి ఫ్లయిట్‌కే వెళ్తున్నాననీ, ఎనిమిది తొమ్మిది నెలలదాకా తిరిగి రాననీ, తన వెంట తన టీమ్ కూడా వస్తోందనీ, ముందు జర్మనీకి వెళ్తున్నామనీ.. అన్ని వివరాలూ చెప్పింది.

ఆ రోజు ఆమె తన నైజానికి భిన్నంగా ప్రవర్తించింది. వెళ్ళేటప్పుడు నాతో వెళ్లొస్తానని చెప్పింది. నన్ను ముద్దు పెట్టుకుని, 'నిన్ను చాలా మిస్ అవుతాను, తరచు ఫోన్ చేస్తూనే ఉంటాలే' అంది.

# మహిళా శాస్త్రవేత్తలు

చతుర సమగ్గలు

శాస్త్రవేత్త అనగానే పురుషులే గుర్తొస్తారు. కానీ మహిళా శాస్త్రవేత్తలు కూడా చాలామంది ఉన్నారు. నిత్యజీవితంలో ఉపయోగించే అనేక వస్తువులని మహిళలే కనిపెట్టారు.

**సిగ్నల్ ఫ్లేర్స్:** మార్తా కాస్టన్ వీటిని కనిపెట్టింది. ఆమె భర్త బెంజిమన్ కాస్టన్ కూడా శాస్త్రజ్ఞుడే. చనిపోయిన తన భర్త నోట్స్‌ని చదివింది. దాంతో సముద్రంలో రంగుల జెండాలు, అరుపుల బదులు 'సిగ్నల్ బుల్లెట్' కనిపెట్టాలన్న ఆలోచన వచ్చింది. పదేళ్ళు కష్టపడి, కాస్టన్ 'నైట్ సిగ్నల్ ఫ్లేర్స్' (తుపాకీలోంచి పేలిస్తే అది ఆకాశంలో కొద్దిసేపు వెలుగులు చిమ్ముతుంది) కనిపెట్టి, 20వేల డాలర్స్‌కి యు.ఎస్. నేవీకి అమ్మింది.



**ఫుట్‌పెడల్ ట్రాష్‌కేన్:** ఒంగకుండా, కాలితో నొక్కి చెత్తడబ్బా మూతని తెరిచే పద్ధతిని లిలియన్ అనే అమెరికన్ మహిళ కనిపెట్టింది. ఫ్రిజ్ తలుపు లోపల షెల్ఫులు, ఎలక్ట్రిక్ ఫుడ్ మిక్సర్, ఇంకా వంటగదిలో ఉపయోగించే ఎన్నిటినో ఆమె కనిపెట్టింది.

**పేపర్ బేగ్:** 1860లలో మార్గరెట్ నైట్ అనే ఆమె పేపర్ ఫ్యాక్టరీలో పనిచేస్తూ పేపర్ బేగ్‌ని తయారు చేసే యంత్రాన్ని కనుగొంది. ఇంకా రోటరీ ఇంజెన్, షో కటింగ్ మిషన్‌లాంటి అనేక యంత్రాలు కనిపెట్టింది.

**డిష్‌వాషర్:** ఐశ్వర్యవంతుడైన వ్యాపారి భార్య జోసెఫీన్ తరచు పార్టీలు ఇచ్చేది. పాత్రలు కడిగేప్పుడు పనివాళ్లు కప్పులని పగలకొడుతుండటంతో అంట్లు తోమే యంత్రాన్ని 1886లో కనిపెట్టి పేటెంట్ పొంది, 1961లో 'వర్ల్‌పూల్ కార్పొరేషన్'కు అమ్మింది.

**విండ్ షీల్డ్ వైపర్స్:** 1900లో వర్షంలో లేదా మంచులో బస్‌ని డ్రైవ్ చేసేప్పుడు డ్రైవర్ మధ్య మధ్యలో వాహనాన్ని ఆపి ముందు అద్దం తుడవడం గమనించిన మేరీ ఏండర్సన్ అద్దాన్ని యాంత్రికంగా తుడిచే విండ్‌షీల్డ్ వైపర్స్‌ని కనుక్కుంది. ఇప్పుడు వైపర్స్ లేని కార్లే లేవు.

**సర్క్యులర్ సా:** తబీతా బేబిట్ అనే మహిళ గుండ్రటి రంపాన్ని చక్రంలో చుట్టి, సర్క్యులర్ సా కనిపెట్టింది.

రూబీ వెళ్ళిపోయిందన్న దిగులు నన్ను చుట్టుముట్టింది. వెళ్ళిపోయే సమయంలో ఆమె కళ్ళలో తడి మెరవటం కూడా కనిపించింది నాకు. అయితే ఆమె కూడా నన్ను ప్రేమిస్తోందా? నేనైతే ఎప్పుడో ఆమెని ప్రేమించడం ప్రారంభించాను మరి.

ఒక పక్క రూబీ వెళ్ళిపోయిందన్న బాధ, మరో పక్క శంతను, మిసెస్ దత్‌ల వల్ల కలిగిన అసహ్యామైన అనుభవం నన్ను బాగా కుంగదీశాయి. నేను ముంబై వదిలి వెళ్ళిపోవాలని అనుకుంటున్న తరుణంలోనే, కొన్నాళ్ళ క్రితం నేను వాక్ ఇన్ ఇంటర్వ్యూకి వెళ్ళి వచ్చిన ఒక మల్టీనేషనల్ కంపెనీ నుంచి పిలుపొచ్చింది- ఉద్యోగం జబల్‌పూర్‌లో. నా సెల్‌ఫోన్ కనెక్షన్ తీయించేయాలని అనుకునేంతలోనే రూబీ ఫోన్ చేసింది. ఫ్రాంక్‌ఫర్ట్ నుంచి జెనీవా వెళ్తానని చెప్పింది. అక్కడ నెలరోజులు ఉంటానని అంది. నాకు జబల్‌పూర్‌లో ఉద్యోగం వచ్చిన సంగతి చెప్పి ఆఫీస్ ఫోన్ నెంబరు ఇచ్చాను. సెల్‌ఫోన్ నెంబర్ అక్కడికెళ్ళాక ఇస్తానని కూడా అన్నాను. రూబీ నాకు శుభాకాంక్షలు చెప్పింది. నా సామానూ, రూబీ వదిలేసిన కాసిని వస్తువులూ ప్యాక్ చేసుకుని జబల్‌పూర్ చేరుకున్నాను. అక్కడ సివిల్

లైన్స్‌లో రెండు గదుల పోర్షన్ అద్దెకి తీసుకున్నాను. ఆ ఇల్లు మిస్టర్ అండ్ మిసెస్ నథ్వానీ సింధీ దంపతులది.



## జబల్‌పూర్

నథ్వానీ సింధీ దంపతులు నా పక్కింట్లో ఉండేవాళ్ళు. అంటే వాళ్ళు కాదు, వాళ్ళకొడుకు తన పెళ్ళాం పిల్లలతో ఉండేవాడు. తల్లిదండ్రులు అతనితో ఉండేవాళ్ళు. మీరనుకోవచ్చు. వీడేమిటీ ఇలా మెలికేసి మాట్లాడుతున్నాడు? అని. కొడుకూ కోడలూ మనవలతో కలిసి తల్లిదండ్రులు ఒకే ఇంట్లో ఉంటున్నప్పుడు వాళ్ళందరూ మీ పక్కింటివాళ్ళే అనుకోవాలి కదా? కొడుకూ కోడలే పెద్దవాళ్ళతో కలిసి ఉంటున్నారనైనా అనాలి కదా? ఇంత డొంక తిరుగుడుగా చెప్పాల్సిన అవసరం ఏముంది? క్షమించాలి! మీరు చెప్పింది నిజమే..! నేను చెప్పేదీ నిజమే! అసలు ముందే అన్నీ విడమర్చి చెప్పి ఉండాల్సింది నేను. కొడుకు పేరు వ్యాస్, పెద్దాయన అతని తండ్రి అనీ, ఆయన మానసికంగా దెబ్బతిని ఉన్నాడని తప్ప నాకు ఇంకేమీ తెలీదు.

ఆయన రోజంతా ఇంటి వరండాలో కూర్చునే ఉంటాడు. అసలు నోరు విప్పి మాట్లాడడం చూడలేదు నేను. వాళ్ళింటికి తరచు వచ్చిపోయే వాళ్ళకి మాత్రం ఆయన ఎప్పుడైనా ఒకటి అరా మాటలు మాట్లాడతాడని తెలుసు. కానీ నా లెక్కన అది మాట్లాడటం అనిపించుకోదు.

మొదటిసారి నేను వ్యాస్ ఇంటికి సాయంకాలం ఐదు గంటలకి వెళ్ళాను. మా ఇంటి యజమానికి గుండె నొప్పి వచ్చింది. వాళ్ళ టెలిఫోన్ పనిచెయ్యడం లేదు. ఆయన భార్య నన్ను పక్కింటి నుంచి డాక్టర్‌కి ఫోన్ చెయ్యమని కోరింది. ఆ హడావిడిలో కాలింగ్ బెల్ నొక్కకుండా గేటు తెరిచి లోపలికి వెళ్ళిపోయాను. బయట వరండాలో కూర్చున్న పెద్దాయన్ని చూసి "నమస్తే అంకుల్!" అని పలకరించాను.

ఆయన జవాబు విని ఉలిక్కిపడ్డాను. నా మాటకి ఆయన ఇచ్చిన సమాధానం, "ఏం లాభం లేదు!"

నా ఆతృతలో "అంకుల్! నథ్వానీకి హఠాత్తుగా గుండె నొప్పి వచ్చింది. వాళ్ళ ఫోన్ పనిచెయ్యటం లేదు, మీ ఫోన్ వాడుకోవచ్చా? " అని అడిగాను.

మళ్ళీ ఆయన "ఏం లాభం లేదు" అన్నాడు.

నాకు చాలా కోపం వచ్చింది. కానీ ఈ లోపల ఆయన కోడలు తలుపు తీసి నన్ను ఇంట్లోకి రమ్మంది. నేను ఫోన్ చేసుకుని వెళ్ళిపోయాను. చాలారోజులు నథ్వానీకి సేవలు చేస్తూ, పక్కింటి పెద్దాయన గురించి పూర్తిగా మర్చిపోయాను.

కొంతకాలం తర్వాత మళ్ళీ బయటికి వెళ్ళేప్పుడు ఆయన వరండాలో అలాగే కూర్చుని ఉండటం చూశాను. వెళ్ళి పలకరిద్దామనిపించింది. కానీ క్రితంసారి ఆయన ధోరణి గుర్తుకొచ్చి ఆగిపోయాను. ఆ రాత్రి నథ్వానీతో ఆయన విషయం ప్రస్తావించేసరికి అంత అనారోగ్యంలో కూడా ఆయన పగలబడి నవ్వాడు. తర్వాత, "అయ్యో! ఆ ముసలాడా! ఆయనకి మతిస్థిమితం లేదు. ఐదేళ్ళుగా చూస్తున్నా. . 'ఏం లాభం లేదు'అనే మాట తప్ప మరోమాట ఆయన నోటంట రాదు.

ఆయన కొడుకు కలియుగ శ్రావణకుమారుడి లాంటివాడు. అందుకే ఆయన భారం మోస్తున్నాడు. నా కొడుకైతేనా, ఏనాడో నన్ను పిచ్చాసుపత్రిలో చేర్పించి ఉండేవాడు. అన్నం తినేందుకు రమ్మని కోడలు పిలిస్తే, 'ఏం లాభం లేదు' అంటాడు. మనవడు వచ్చి ఏదైనా అడిగినా అదే జవాబు. అసలు ఆయనతో మాట్లాడటమే శుద్ధ దండగ" అన్నాడు.

నథ్వానీ నాకు ఈ సలహా ఇచ్చి ఊరుకున్నాడు. కానీ నేను మాత్రం ఆయన్ని గమనించటం మానలేదు. నా గది రెండో అంతస్తులో ఉంది. కిటికీలోంచి చూస్తే వ్యాస్‌వాళ్ళ ఇంటి ముందు లాన్, వరండా కనిపిస్తాయి. ఇంట్లో ఉన్నప్పుడల్లా ఆ కిటికీలోంచి ఆయన్ని గమనిస్తూ ఉండేవాణ్ణి. నాకు ఆయన గురించి కుతూహలం పెరిగిపోసాగింది. నేనేమిటి నా పరిస్థితిలో మీరున్నా ఇలాగే ప్రవర్తించేవారు!

నా రొట్టె విరిగి నేతిలో పడ్డట్టయింది. వ్యాస్‌వాళ్ళ ఇంటి రెండో అంతస్తులో ఉండే కొత్త దంపతులు ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోతున్నారని తెలిసి నథ్వానీ నాకు ఆ పోర్షన్ ఇప్పించాడు. నా కోరిక తీరింది. బయటికి వెళ్ళేటప్పుడూ, ఇంటికి వచ్చేటప్పుడూ ఆ ముసలాయన్ని రోజూ గమనించడం మొదలుపెట్టాను. కానీ అది ఇంకెవరూ చూడకుండా ప్రయత్నించేవాణ్ణి.

ఆ ముసలాయన గది నా గది కిందే ఉంది. పొద్దున్నే ఆరింటికల్లా నౌకరు ఆయనకి టీ తెచ్చి ఇచ్చేవాడు. టీ తాగాక ఖాళీ కప్పు తీసుకుపోయేందుకు మళ్ళీ వచ్చి, 'అయ్యా! వేణ్ణీళ్ళు పెట్టాను. ఉతికిన బట్టలు తీసిపెట్టాను. స్నానం చేసి బట్టలు మార్చుకోండి' అనేవాడు. అన్నిటికీ ఆయన జవాబు అదే, 'ఏం లాభం లేదు!' స్నానం చేసి బట్టలు వేసుకుని- నౌకరు వచ్చి 'కూర్చోండి' అనేదాకా అలా నిలబడే ఉండేవాడాయన. చాలా విచిత్రంగా ఉండేది నాకు. ముసలాయన కొడుకు వ్యాస్ బ్యాంకు మేనేజర్. కోడలు లెక్చరర్. వాళ్ళ కూతురు పదకొండో క్లాసు, కొడుకు తొమ్మిదో క్లాసు. వాళ్ళెవరికీ ముసలాయన ధోరణి వింతగా అనిపించనట్టే తమ పనులు తాము చేసుకుంటూ ఉండేవారు. చివరికి నౌకరు కూడా ఏమీ అనేవాడు కాదు. ముసలాయనకి ఏ ఇబ్బందీ లేకుండా అన్నీ జరిగిపోయేవి.

వాళ్ళెవరికీ లేని చింత నాకు పట్టుకుంది! ప్రైవేట్ కంపెనీలో నా పనేదో నేను చూసుకోకుండా, ఈయన గురించి అంతగా బుర్ర బద్దలు కొట్టుకోవడం ఎందుకో? నాకే ఒక్కోసారి అర్థమయేది కాదు. శారీరకంగా ఎటువంటి అనారోగ్యమూ లేని ఈయన మానసికరోగిలా ఎందుకు తయారయాడు? బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా, ఒకే ఒక వాక్యం మాట్లాడే ఈయన జీవితంలో జరిగిన ఏ బలమైన సంఘటన ఈ స్థితికి తీసుకొచ్చింది?

వాళ్ళ కుటుంబంతో నాకున్న సంబంధం కాస్త బలం పుంజుకోసాగింది. అప్పుడప్పుడూ వాళ్ళు నన్ను భోజనానికి కూడా పిలిచేవారు. వాళ్ళది నాకు నిజంగానే ఒక ఆదర్శ కుటుంబంలా కనిపించేది. అందరూ టైం ప్రకారం అన్ని పనులూ చేసుకుంటూ.. ఒకరి విషయంలో మరొకరు అనవసర జోక్యం చేసుకోకుండా ఉండేవారు. ఎవరూ గట్టిగా అరుస్తూ మాట్లాడగా వినలేదు. టీవీ, మ్యూజిక్ సిస్టమ్ మోగుతున్నా బయటికి పెద్దగా వినిపించేది కాదు. పనివాళ్ళు కూడా క్రమశిక్షణతో మెలిగేవాళ్లు. వంటింట్లో గిన్నెల చప్పుడైనా వినబడేది కాదు. పిల్లలిద్దరూ చక్కగా చదువులో రాణిస్తూ, మర్యాదగా ఉంటారు. భార్యాభర్తలు కూడా మంచీ మర్యాదా పాటించేవాళ్లే! మరి వ్యాస్ తండ్రి.. ఈ ముసలాయన.. మాత్రం ఇలా అయిపోయాడేమిటి? ఈ ప్రశ్న




నాకు మనశ్శాంతి లేకుండా చేసింది. ఎక్కడైనా ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని బుర్ర బద్ధలు కొట్టుకున్నాను. కానీ ఏమీ అంతుపట్టలేదు.

నౌకర్లని అడగటం మర్యాద కాదు. వ్యాస్‌ని అడగటానికి ధైర్యం చాలలేదు. అనవసరంగా తల దూరుస్తున్నానని అనుకునే ప్రమాదం ఉంది. ఇల్లు ఖాళీ చేసి పొమ్మన్నా పొమ్మంటాడు. వాళ్ళందరిలాగే ఆయన్ని పట్టించుకోకుండా ఉందామని ప్రయత్నించాను. కానీ నా వల్ల కాలేదు.

వాళ్ళ దృష్టిలో ఆ ముసలాయన ఉనికికీ, మేలు జాతి శునకం ఉనికికీ తేడా లేదనిపించింది. డబ్బున్న వాళ్ళు కుక్కని పెంచితే దానికి సకలసేవలూ చేస్తారు. స్నానం చేయిస్తారు. షికారుకి తీసుకెళ్తారు. మందులు ఇప్పిస్తారు. తిండి పెడతారు. పెద్దాయన పరిస్థితీ అంతే! కుక్కని కనీసం ముద్దు చేస్తారు. ఈయనకి వాళ్ళ ప్రేమ కొంచెం కూడా దొరకటం లేదు. అన్నట్టు ప్రతినెలా ఆయనకి ఫొటో తీస్తారు, కానీ అది ఎందుకో నాకు చచ్చినా అర్థం కాలేదు. అంతా ఏదో గోల్‌మాల్ లాగ అనిపించేది, అదీ నాకు మాత్రమే. మా వీధిలో ఉండే ఇంకెవరికీ ఈ విషయం గురించి ఏ ఆందోళనా ఉన్నట్టు కనిపించలేదు నాకు.

ప్రతి ఆదివారం వ్యాస్ నాతో చదరంగం ఆడటం మొదలుపెట్టాడు. సాయంకాలం సరిగ్గా నాలుగు నుంచి ఐదు గంటల దాకా మా ఆట సాగేది. ఐదు గంటలకి ఆట ముగిసినా, ముగియక పోయినా ఆయన అందరితో కలిసి టీ తాగేందుకు కిందికి వెళ్ళిపోయేవాడు. ఎప్పుడైనా నన్ను కూడా రమ్మని పిలిచేవాడు. ఆయన కొడుకు వారంలో రెండు రోజులు నా దగ్గర గిటార్ నేర్చుకోవటం మొదలెట్టాడు. కాలేజి యూత్ ఫెస్టివల్ కోసం వాళ్ళమ్మ నా చేత కొన్ని కవితలు రాయించుకుంది. వాళ్ళమ్మాయి కూడా ఎదురు పడినప్పుడల్లా 'గుడ్‌మార్నింగ్ అంకుల్' లాంటి పలకరింపులు నావైపు విసిరేది.

సెలవులకి కుటుంబంతో సహా వ్యాస్ పదిహేను రోజులు విహారయాత్రకి వెళ్తూ ముసలాయన్ని చూసుకునే బాధ్యత నౌకరుతో పాటు నాకు కూడా అప్పజెప్పాడు. మునుపు ఈ బాధ్యత నథ్వానీ దంపతులు తీసుకునేవారు. నథ్వానీ ఆరోగ్యం సరిగ్గా లేదనో, లేక నేను మంచివాడిననో తెలీదు గానీ, ఆ బాధ్యత ఈసారి నాదయింది. ఆ పదిహేను రోజుల్లో ముసలాయన గదిని సర్దే నెపంతో ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని పూర్తిగా వెతికాను. కానీ అక్కడ ఆయనా, ఆయన భార్యా కలిసి తీయించుకున్న ఫొటో తప్ప ఇంకేమీ దొరకలేదు.

వ్యాస్ కుటుంబం వెనక్కి వచ్చే రోజు రానే వచ్చింది. రేపు ఉదయమే వాళ్ళు వచ్చేస్తారు. నాకు ఇంతవరకూ రహస్యం ఏమిటో అంతు చిక్కలేదు. ఆ రోజు బాస్ నన్ను అవమానించాడన్న కోపంతో ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఇంటికి దిగులుగా వచ్చాను. పైనున్న నా పోర్షన్లోకి వెళ్ళబోతుండగా, ఒకసారి పెద్దాయన ఏం చేస్తున్నాడో చూడాలన్న సంగతి గుర్తొచ్చింది. పొద్దున హడావిడిగా ఆయన్ని పలకరించకుండానే ఆఫీసుకు వెళ్ళాను. అన్యమనస్కంగా మళ్ళీ మెట్లు దిగి ఆయన గది

లోకి వెళ్ళాను. అలవాటు ప్రకారం "గుడ్ ఈవెనింగ్ అంకుల్!" అన్నాను.

ముసలాయన ఎప్పటిలాగే, ఎటువంటి భావమూ పలకని గొంతుతో "ఏం లాభం లేదు" అన్నాడు!

అనుకోకుండా నేను కూడా "నిజం అంకుల్! ఈ లోకంలో బతికి ఏం లాభం లేదు!" అన్నాను.

అప్పుడాయన "సరిగ్గా చెప్పావు నాయనా! నిజం! ఈ లోకంలో బతికి ఉండటం శుద్ధ దండగ!" అన్నాడు.

నాకు ఇది ప్రపంచంలోని ఎనిమిదో వింతలా అనిపించింది. రెండేళ్ళుగా ఈ ఇంట్లో ఉంటున్నాను. ఈయన నోటి వెంట ఇలాంటి వాక్యాలు వినటం ఇదే మొదటిసారి! 'ఇది నిజమా? భ్రమా? ఎప్పుడూ ఏమీ మాట్లాడని ఈయన నిజంగానే మాట్లాడాడా? నా చెవులు నన్ను మోసం చేస్తున్నాయా?' ఇలా అనుకుంటూ ఉండగానే ఆయనే మళ్ళీ "ఈ లోకంలో బతకటం వల్ల ప్రయోజనం ఏమీ లేదన్న సంగతి నేనెలా మర్చిపోయానో?" అన్నాడు. మరుక్షణం తను కూర్చున్న మంచం మీదే పక్కకి దొర్లిపోయాడు. నేను పరిగెత్తికెళ్లి పడిపోకుండా పట్టుకున్నప్పుడు, ఆయన ప్రాణం పోతున్నట్టు అనిపించింది. నౌకర్ని కేకేసి వాడిని ఆయన దగ్గర ఉండమని డాక్టరుకి ఫోన్ చేశాను. నర్వాసీని పిలుద్దామనుకున్నాను, కానీ ఆయన భార్యాసమేతంగా తన తమ్ముడి ఇంటికి వెళ్ళాడని గుర్తొచ్చింది.

ఏం చెయ్యాలో తోచలేదు. వ్యాస్‌కి ఫోన్ చేశాను. విషయం వినగానే "ఓహ్! నో..!" అన్నారు. ఆ తరువాత "రేపు ఉదయం ఇంటికి చేరుకుంటున్నాం! మీరు ఆయన్ని నేల మీద పడుకోబెట్టండి! గంగా జలం తెచ్చి ఆయన నోట్లో పొయ్యమని నౌకర్‌కి చెప్పండి!" అన్నాడు వ్యాస్.

నేను ఫోన్ పెట్టేసి మళ్ళీ ఆయన గదిలోకి వెళ్ళాను. నౌకర్ ఆయన కాళ్ళ మీద తలవంచి ఏడుస్తూ "పెద్దయ్యగారు ఒక్కసారి నాతో మాట్లాడితే ఎంత బావుండేది! 'గిరిధారీ!' అని పేరు పెట్టి ఏనాడూ పిలవలేదు కదా! ఏమీ మాట్లడకుండానే వెళ్ళిపోయారు" అంటూ బాధ పడసాగాడు.

నేనతన్ని పట్టుకుని లేపి గంగాజలం తెమ్మని చెప్పాను. అతను కళ్ళు తుడుచుకుంటూ గంగనీటి చెంబు పట్టుకొచ్చాడు. ఇద్దరం కలిసి పెద్దాయన పార్థివ శరీరాన్ని నేల మీదికి దింపి గంగ నీరు నోట్లో పోశాం. ఇక తెల్లవారేదాకా వేచి ఉండటం తప్ప చేసేందుకేమీ లేదు. కొంతసేపు ఇద్దరం మౌనంగా కూర్చున్న తరువాత గిరిధారిని "అసలు ఈయన ఇలా ఎందుకయ్యాడు?" అని అడిగాను.

గిరిధారి జవాబు చెప్పలేదు. ఏమీ చెప్పకుండా ఇంటి వెనక ఉన్న తన సర్వెంట్ క్వార్టర్స్‌కి వెళ్ళాడు. మళ్ళీ నా దగ్గరికి వచ్చినప్పుడు అతని చేతిలో ఒక డైరీ ఉంది. "తను పోయాక ఈ డైరీని గజేంద్రబాబుకి ఇవ్వమని పెద్దయ్యగారు చెప్పారండి. కానీ ఈయనకన్నా ముందే ఆయన పోయారు. ఎందుకోగాని ఈ డైరీ మీకివ్వాలనిపిస్తోంది. తీసుకోండి సార్! ఇది పెద్దయ్యగారి డైరీ" అన్నాడతను.

నాకు నిద్ర ఎలాగూ రావటం లేదు. తెల్లారేదాకా చేసేందుకు పనేమీ లేదు. పైగా ముసలాయన ఎందుకు అలా అయ్యాడో తెలుసుకోవాలన్న కుతూహలం ఎన్నాళ్ళ నుంచో వెంటాడుతోంది. అందుకే ఆ డైరీ చదవటం మొదలుపెట్టాను.

...నా జీవితం ఒకప్పుడు ఎంత ఆనందంగా గడిచింది! ఉల్లాసంగా, ఉత్సాహంగా నవ్వుతూ తుళ్ళుతూ సాగిపోయింది జీవితం. ఎడారిలో దారి తప్పిన వాడికి ఒయాసిస్సు ఎదురైనట్టు అనిపించింది. కానీ ఒక్కోసారి ఎడారిలో ఎండమావులు ఒయాసిస్సుల్లా భ్రమింపజేస్తాయి. నా

విషయంలో కూడా అదే జరిగింది. ఎంతో ఆనందంగా బతుకుతున్నానని అనుకున్న నాకు ఆ ఆనందం, సంతోషం కేవలం నా భ్రమే అని అర్థమైపోయింది. మా అమ్మా నాన్నలకి నేను ఒక్కడినే సంతానం. మా నాన్న టీచర్, అమ్మకి చదువు సంధ్యలు లేవు. నేను చదువులో ఎప్పుడూ ఫస్ట్‌గా వచ్చేవాణ్ణి. ఎం.ఎస్.సి. తరువాత ఐ.ఎ.ఎస్.కి సిద్ధం కాసాగాను. మాది చిన్న ఊరు కావటం వల్ల ఆ చదువు కోసం పట్నం వెళ్ళాను. ఒక బంధువు ఉండే పేటలో, వాళ్ళింటి పక్కనే గది అద్దెకి తీసుకున్నాను. ధనవంతులైన వాళ్ళు తమ బంధువర్గంలోని కుర్రవాడు పేదవాడూ, తెలివైనవాడూ, యోగ్యుడూ అయితే అతని ద్వారా ఇరుగు పొరుగువారి మధ్య ఇంకా ఎక్కువ గౌరవం సంపాదించుకోవటానికి ప్రయత్నిస్తారు. మా బంధువు తన పిల్లల్ని 'చదువురాని మొద్దులనీ, చదువుమీద శ్రద్ధ లేదనీ తిడుతూ, బతకలేక బడిపంతులు ఉద్యోగం చేసే పేదవాడి కొడుకుని చూడండి! ఎలాంటి సౌకర్యాలూ లేకపోయినా చదువులో ఎంతగా రాణిస్తున్నాడో!'



అంటూ ఉంటే నాకు చాలా బాధగా ఉండేది. మరోపక్క ఆయన పిల్లలు నాకు బద్ధ శత్రువులుగా మారారు. నేను చదువుకునేప్పుడు నా గది



లోకి వచ్చి నన్ను డిస్టర్బ్ చెయ్యడం, వాళ్ళింట్లో స్టీరియోలో పాటలు పూర్తి వాల్యూమ్‌లో పెట్టడం వాళ్ళకి దైనందిన కార్యక్రమం అయింది. ఒక్కోసారి ఐ.ఎ.ఎస్. వద్దు, ఏమీ వద్దనుకుని ఇంటికి పారిపోవాలనిపించేది. కానీ నాకు గది అద్దెకిచ్చినాయన.. వరసకి పెద్దమ్మ భర్త. మా పెద్దమ్మ మొదటి కానుపులోనే తనూ తన పురిటికందూ చనిపోతే ఆయన రెండో పెళ్ళి చేసుకున్నాడు. అయినా ఆయనకి మొదటి భార్య తరపు బంధువైన మా నాన్న అంటే అపేక్ష. చాలా ఆప్యాయంగా ఉండేవాడు. అంతేకాక గత ఐదారేళ్ళుగా నా చదువుకి డబ్బు సాయం కూడా చేస్తున్నాడు. మా నాన్నకి నన్ను ఐ.ఎ.ఎస్. చదివించాలని చాలా కోరికగా ఉంది. ఇవన్నీ ఆలోచించాక ఇక అన్నీ భరిస్తూ చదువు పూర్తిచెయ్యక తప్పదని అనిపించింది. మిగతా ఆలోచనలన్నీ పక్కన పెట్టి పూర్తిగా చదువు మీదే ధ్యాస పెట్టాను.

ఆ ఇంట్లో ముప్పై ఐదేళ్ళ ఒకామె, ఆయన మరదలు ఉండేది. భర్త వదిలేశాడనుకుంటా! కానీ ఎప్పుడూ చక్కగా అందంగా అలంకరించుకునేది. ఇంట్లో అందరి మీదా పెత్తనం చెలాయించేది. ఆమె అలా అందరినీ తన పిడికిట్లో ఉంచుకోవటానికి కారణం, చనిపోయిన ఆమె తండ్రి చాలా ధనవంతుడు. ఆయన ఆస్తిలో సగం వాటా ఆమెదే. పైగా ఒంటరిది. పిల్లలు లేరు. ఉద్యోగం కూడా చేసేది.

కోచింగ్ సెంటర్ నుంచి లైబ్రరీకి వెళ్ళి అక్కడ చాలాసేపు చదువుకుని ఆలస్యంగా ఇల్లు చేరుకునేవాణ్ణి. రాత్రి అందరూ భోజనాలు చేసి పడుకున్నాక మళ్ళీ చదువుకునేవాణ్ణి. ఇంతలో మా పెదనాన్న భార్యకి ఆరోగ్యం బాగా లేకపోవడం వల్ల ఆవిడ చెల్లెలే ఇంటి పనులన్నీ చూసుకోవడం మొదలుపెట్టింది. మన రుషులూ, మునులూ ఫ్రాయిడ్ కన్నా చాలా ముందే సెక్స్‌కి ఉన్న శక్తి గురించి చెప్పారు. అందుకే యుక్త వయస్కుడైన కొడుకు తల్లితో కూడా ఏకాంతంగా ఉండడాన్ని వాళ్ళు ఒప్పుకోలేదు. ఈ ఇంట్లో నాకు ఆమెతో దొరికిన ఏకాంతం ఒక సమస్యకి దారి తీసింది. ఆమెకీ నాకూ శారీరక సంబంధం ఏర్పడింది. నా చదువుకి భంగం వాటిల్లసాగింది. కానీ కోర్సు అయిపోవస్తోంది. ఎలాగో పరీక్ష రాశాననిపించి ఇంటిదారి

పట్టాను. కానీ కష్టాలు ఒంటరిగా రావు కదా! పెదనాన్న నన్ను మళ్ళీ పట్నానికి రమ్మని కబురంపించాడు. పట్నంలో ఒక ప్రైవేటు కాలేజీలో లెక్చరర్ పని ఇప్పించా డాయన. మనసు నన్ను వెళ్లొద్దని అంటున్నా ఫ్రాయిడ్ మహాశయుడు చెప్పిన ఆ శక్తి నన్ను పట్నం వైపు అయ స్కాంతంలా ఆకర్షించింది. సరిగ్గా అదే సమయంలో నాన్నకి పక్షవాతం వచ్చేసరికి నేను ఉద్యోగంలో చేరక తప్పలేదు. అమ్మనీ, నాన్ననీ వెంటపెట్టుకుని పట్నం చేరుకున్నాను. నాన్నకి అక్కడే వైద్యం చేయించాలన్నది ఒక కారణమైతే, అసలు కారణం వేరే ఉంది. అది మీకూ తెలుసు! పెదనాన్న వాళ్ళ పక్క ఇంట్లోనే మేం అద్దెకి దిగాం. ఆ ఇంట్లో కింద రెండు గదులూ, పైన ఒక గదీ ఉండేవి. రోజులు గడుస్తున్నాయి. నేను పై గదిలో ఉంటూ ఇంటర్వ్యూకి తయారు కాసాగాను. అక్కడ మా వ్యవహారం నిరాటంకంగా సాగుతూనే ఉంది. అమ్మా, నాన్నా చేసుకున్న పుణ్యం వల్లో? ఏమో? నేను ఐ.ఎ.ఎస్. పరీక్ష లోనూ, ఇంటర్వ్యూలోను పాసయాను.

నాన్న ఇంత సంతోషాన్ని భరించలేకపో యారేమో! నేను ఐ.ఎ.ఎస్.కి ఎంపికయా నన్న వార్త తెలిసిన మర్నాడే ఆయన పర లోకానికి వెళ్ళిపోయాడు. అమ్మ ఒకేసారి అంత ఆనందాన్నీ, విషాదాన్నీ తట్టుకోలేక మతిభ్రమించిన దానిలా అయిపోయింది. అమ్మని పెదనాన్న దగ్గర వదిలి నేను ట్రైనింగ్‌కి వెళ్ళవలసి వచ్చింది. అక్కడ అందరికీ శిక్షణ పొందుతున్నామన్న సంతోషం, పార్టీలూ, పిక్‌నిక్‌లతో కాలం గడుస్తూ ఉంటే, నాకు మాత్రం ఆ రోజులు చాలా భారంగా గడిచాయి. శిక్షణ ఎప్పుడు అయిపోతుందా? అని ఎదురు చూస్తూ కూర్చున్నాను. గత కొన్ని నెలలుగా రకర కాల పరిస్థితులు చుట్టుముట్టడం వల్ల నాలో కూడా కాస్త పెద్దరికం వచ్చింది. అందుకే మధ్యలో ఇంటికి వెళ్ళాక ఆమెతో సంబంధం మళ్ళీ కొనసాగించలేదు. ఆమె ఏడ్చింది, మొత్తుకుంది, బతిమాలింది, బెది రించింది. కానీ నేను దేనికీ లొంగలేదు. తరువాత ఆమె తన కోపాన్ని మా అమ్మ మీద చూపించిందని నాకు తెలిసింది.

సరే! మొత్తం మీద నా ట్రైనింగ్ పూర్త యింది. నేనూ అమ్మా ఆ ఊరు వదిలి దూరంగా వెళ్ళిపోయాం. నా పదవి సాయంతో అమ్మకి మంచి వైద్యం చేయిం చాను. కానీ ఎన్ని మందులు వాడినా ఆమె జబ్బు పెరిగిందే తప్ప, తగ్గలేదు. ఆవిడ పరిస్థితి రోజు రోజుకీ దిగజార సాగింది. తను ఇంక ఎక్కువ కాలం బత కననీ, మనవడి ముఖం త్వరగా చూడా లని ఉందనీ ఒకటే గొడవ. నా స్నేహితు లనీ, పరిచయస్తులనీ, చివరికి నౌకర్లని కూ డా ఎవరైనా మంచి అమ్మాయి ఉంటే చెప్పమని అడగడం మొదలు పెట్టింది. మా ఇంట్లో పార్టీలు జరిగినప్పుడు ఎవ రైనా అమ్మాయిలు వస్తే వాళ్ళ గురించి వాకబు చేసేది.

అవును మరి, పార్టీలు మా ఉద్యోగంలో తప్పని సరి! మాకు ఎంత రోత పుట్టినా వదిలించుకోలేం. పార్టీలు ఇవ్వని ఆఫీస ర్లని ఎవరూ పార్టీలకి పిలవరు. అతను మర్యాద తెలీని మనిషని ముద్ర వేస్తారు. ఈ పార్టీల్లో జరిగేవి ఒకరి మీద ఒకరు చాడీలు చెప్పుకోడం, అవతలి వ్యక్తి మీద నిందలు వెయ్యటం, తమ వారికి ఉద్యో గాలు ఇచ్చేందుకు అడ్డదారులు వెతుక్కో వటం, పరాయి స్త్రీలతో చూపులతోనే వ్యభి చరించటానికి ప్రయత్నించటం. వయసు మళ్ళిన ఆఫీసర్లు గారాబం చేసి పాడుచే సిన తమ కూతుళ్ళ కోసం మొగుళ్ళని కొనుక్కోవడం.. అంతకన్నా జరిగేదేమీ లేదు. అయినా ఎప్పుడూ పార్టీలు ఉంటూనే ఉంటాయి. నా కోసం కూడా చాలామంది తల్లిదండ్రులు వల పన్నాలని

ప్రయత్నించారు. వారి అస్త్రాలు నా మీద పనిచెయ్యకపోవటంతో నేను పెళ్ళికి పనికి రానివాణ్ణని ప్రచారం చెయ్యటం మొదలు పెట్టారు. ఈరకంగా ఐదారేళ్ళు గడిచిపో యాయి. ఈ ఉద్యోగంలో బ్రహ్మచారిగా బతకటం కష్టమని నాకు తెలుసు. వాళ్ళని పెళ్ళి చేసుకోవటం నాకిష్టం లేదు. కానీ నాకు నచ్చే అమ్మాయిలు, నేను చాలా పెద్ద పదవిలో ఉన్నానన్న భయంతో నా దరిదాపులకే రారు. చివరికి అమ్మ గోల భరించలేక, "సరే! నువ్వే ఎవరినైనా చూడు! పెళ్ళి చేసేసుకుంటా!" అన్నాను.

తనకి ఉన్న ఒకే ఒక ఆత్మీయ బంధువు, మా పెదనాన్నకి ఫోన్ చేసి రమ్మంది అమ్మ. మూడు నాలుగు రోజులు ఈ విష యమై అమ్మతో చర్చించి ఆయన వెళ్ళిపో యాడు. సాయంత్రం నేను ఇంటికి రాగానే అమ్మ ప్రేమగా, "చూడు! నాకు నచ్చిన అమ్మాయిని నువ్వు కాదనవుగా? " అంది.

నాకు నా పరిస్థితి చాలా విసుగ్గా వుంది. కూర్చుంటూ, "లేదమ్మా! అసలు కాదనను" అన్నాను.

అమ్మ చెప్పిన మాట విని నాకు మూర్ఛ వచ్చినంత పనైంది. ఏమందో తెలుసా?

"మీ పెదనాన్న చిన్న కూతురితో నీ పెళ్ళి కుదిర్చాను" అంది, దాదాపు నా కాళ్ళు పట్టుకుంటూ.

"నా మాట కాదనకురా! పిచ్చిదాన్నే అనుకో! కానీ నా మాట నిలబెట్టు. ఆయన మనకెంతో సాయం చేశాడు!" అంది.

"కానీ మా ఇద్దరి వయసుల్లో ఉన్న తేడా.. పైగా వరసకి ఆ పిల్ల.." నేను నా మాట పూర్తిచేసే లోపలే అమ్మ..

"మగాడికి వయసేమిటిరా? ఆరోగ్యంగా ఉంటే చాలు! ఇక వావివరసలంటావా? మా అక్క చనిపోగానే ఆ సంబంధం తెగి పోయిందిగా! ఇప్పుడీ పిల్లకీ నీకూ రక్తసం బంధం ఏముంది? " అంది.

ఉన్న నాలుగు రోజుల్లో పెదనాన్న మా అమ్మని బాగా బుట్టలో వేసుకున్నాడని

> **కొత్తగాలి...**
>
> **తెల్లకార్డు**
> **తెల్లమొహమేసింది!**
> **రేషన్ పరేషానైంది**
> **ఆధార్లో అడ్రసు గల్లంతు**
> **ఏం బతుకో నాది!!**
>
> – వి.యం. కృష్ణ,
> ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

నాకు అర్థమైంది. అందుకే ఇంకేం మాట్లా డలేదు. మర్నాడు మా పెదనాన్న మళ్ళీ వచ్చాడు. నా మౌనాన్ని.. అమ్మ నా అంగీ కారం అనుకుందేమో? తెలీదు. వస్తూనే ఆయన ముహూర్తం నిశ్చయించే విషయం మాట్లాడాడు. నాకిక తప్పించుకు నేందుకు దారి లేకపోయింది. "ఆయన కూతురు రత్న అభిప్రాయం కూడా తెలు సుకోవాలి కదా!" అంటూ ఏదో గొణిగాను.

అమ్మ ఏదో అనబోతూ ఉంటే పెద నాన్న అడ్డొచ్చి.

"వీడనేది నిజమే..! నువ్వే స్వయంగా అడుగు బాబూ! మా ఇంటికి వచ్చే వారం రా! రత్న హాస్టల్ నుంచి ఇంటికి వస్తుంది" అన్నాడు.

ఇక నాకు ఊపిరి పీల్చుకునేందుకు ఒక పది రోజులే ఉన్నాయి. ఇక్కడ మీకొక విషయం చెప్పాలి. పెదనాన్న మరదలితో నాకు సంబంధం ఉండేదన్న విషయం ఆ ఇంట్లో వాళ్లందరికే కాదు.. స్నేహితులకీ, దగ్గర బంధువులందరికీ తెలుసు. ఈ సంగతి ఎవరో ఒకరు రత్న చెవిన వెయ్య కపోతారా? అనే ఒకే ఒక ఆశ మిగిలింది నాకు. రత్న చిన్నప్పట్నుంచే హాస్టల్లో ఉండి చదువుకునేది. ఎప్పుడోగాని ఇంటికి వచ్చేది కాదు. కానీ విధి రాతని ఎవరు తప్పించగలరు? రత్న ఈ పెళ్లికి ఒప్పు

# పలుభాషల్లో ప్రావీణ్యం!



డా. శ్యామ్ సఖా శ్యామ్

హరియాణా సాహిత్య అకాడమీకి డైరెక్టర్‌గా పని చేసిన డా. శ్యామ్ సఖా శ్యామ్ ప్రసిద్ధ రచయిత. హిందీ, పంజాబీ, ఆంగ్ల, హరియాణా భాషల్లో మంచి ప్రవేశం ఉన్న వీరు కథలూ, నవలలూ, గేయాలూ, గజళ్లూ మొదలైన సాహితీ ప్రక్రియల్లో ఇప్పటివరకూ పాతిక పుస్తకాలు ప్రచురించారు.

వృత్తి రీత్యా పేరొందిన డాక్టర్. ఎం. బి. బి. ఎస్, ఎఫ్. జి. పి. సి డిగ్రీలు ఉన్న వీరు హరియాణా రాష్ట్రంలో ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌కి కొంతకాలం అధ్యక్షులుగా కూడా పనిచేశారు.

జానపద సాహిత్యం, జానపద కళలకూ హరియాణా సాహిత్య అకాడమీ అత్యున్నత పురస్కారం, పండిట్ లక్ష్మీచంద్ సమ్మాన్ అందుకున్నారు. విభిన్న అకాడమీలు వీరి అయిదు పుస్తకాల(కథా సంకలనం, హరియాణా నవల, హిందీ నవల 'కోయీ ఫాయిదా నహీ', పంజాబీ కథా సంకలనం, హిందీ, పంజాబీ భాషల్లో రచించిన పది కథల సంకలనం)కుగానూ రాష్ట్రస్థాయి పురస్కారాలతో సత్కరించాయి.

ఇ–మెయిల్:shyamskha1973@gmail.com

కుంది. నా హోదా, రూపురేఖలూ తనకి నచ్చినట్టున్నాయి.

ఆ తరువాత ఐదేళ్లపాటు నేను జీవితంలో అనుభవించిన సుఖాలు ఎన్నో చెప్పలేను. ఉండేందుకు పెద్ద బంగళా, కారూ, హోదా, ఎప్పుడూ సిద్ధంగా ఉండే నౌకర్లూ చాకర్లూ! ఇంగ్లీషు వాళ్లు కలెక్టర్‌ని జిల్లాకి రాజుచేసి పోయారు. స్వాతంత్ర్యం వచ్చినా ఆ హోదాలో ఎటువంటి మార్పూ రాలేదు. అమ్మ ఆరోగ్యం కూడా కుదుటపడింది. నెమ్మదస్తురాలైన మంచి కోడలు దొరికింది. చిన్నపిల్లకి ఆటబొమ్మ దొరికినట్టు సంబరపడిపోయింది ఆవిడ. ఆమె బాధలన్నీ మాయమయ్యాయి.

అప్పటివరకు హాస్టలు జీవితంతో విసిగిపోయిన రత్నకి కూడా తనకంటూ ఒక ఇల్లు సంసారం ఏర్పడేసరికి ఆమె మనసు పువ్వులా విచ్చుకుంది. రత్న నవ్వితే చిన్న పిల్లలు నవ్వినట్టు ఉండేది. ఆమె నవ్వుల గలగలలతో ఇంట్లో ఎప్పుడూ ఆనందం వెల్లివిరిసేది. నౌకర్లందరూ కూడా చకచకా ఉత్సాహంగా పనులు చేసేవారు. రత్న వాళ్లందరికీ టీలు, టిఫిన్లూ సమయానికి అందేటట్టు చూసుకునేది. రోడ్డు ఊడ్చే వాళ్లూ, బంట్రోతులూ, వంటవాళ్లూ నిజానికి ఆఫీసు పని చెయ్యాలి. కానీ వాళ్లు ఎప్పుడూ ఐ. ఎ. ఎస్. ఆఫీసర్ల ఇళ్లలోనే పనులు చేస్తూ ఉంటారు. ఆ ఆఫీసర్ల పిల్లలకి స్కూళ్ల లంచ్ బాక్సులు తీసుకెళ్లి ఇవ్వడం, అవసరమైతే వాళ్లని బతిమాలి బామాలి తిండి తినిపించడం, లేకపోతే ఆఫీసరు తిడతాడేమోనని భయపడటం! ప్రతి ఆఫీసరుకీ పాడి ఆవునో గేదెనో సమర్పించుకోవడమే కాకుండా వాటికి కావాల్సిన దాణా కూడా పంపుతూ ఉంటారు. పాలు ఎక్కువైతే వాటిని మిఠాయికొట్టు వాళ్లకి మార్కెట్టు ధర కన్నా ఎక్కువకే అమ్ముతారు ఈ ఆఫీసర్లు!

ఆఁ! ఇంతకీ నేను చెప్పాలనుకుంటున్నది మా సామ్రాజ్యానికి మకుటం లేని మహారాణి రత్న అని. అందుకు ఆమెకి ఆనందంగా కూడా ఉండేది. కానీ ఆమెలో మచ్చుకైనా గర్వం నాకెప్పుడూ కనబడలేదు. అనుకోని అదృష్టం నా వశమైందని అనుకున్నాను. అందుకు దేవుడికి కృతజ్ఞ

తలు తెలుపుకుంటూనే ఉన్నాను. అది నా అలవాటు. చిన్నప్పటి నుంచీ మా నాన్న ఎప్పుడూ దేవుణ్ని పూజించడం చూస్తూ ఉండటం వల్ల వచ్చిన అలవాటు. ఏడాది న్నర వ్యవధిలో రత్న ఒక అబ్బాయికి, అమ్మాయికీ తల్లి అయింది. నాకు దేనికీ లోటులేదు. ఇంతలో మా మామగారు చాకచాక్యంగా నన్ను వాడుకోవడం మొదలుపెట్టాడు. ముందు నాకు తెలీలేదు. కానీ ఆయన నా సిబ్బందికి ఏవేవో పనులు చెప్పి చేయించుకోవడం, తన భార్య చేత కూతురికి చెప్పి సిఫార్సు చేయించడం లాంటివి నాకు ఎంతమాత్రం నచ్చలేదు. కానీ ఏంచెయ్యను? రత్న మనసు నొప్పించడం నాకిష్టం లేదు.

అమ్మకి మళ్లీ ఆరోగ్యం పాడయింది. కొన్నినెలలు అన్నీ మంచం మీదే. రత్న అమ్మకి అన్ని సేవలూ చేసేది. అది చూసి నా తోటి ఆఫీసర్లూ, స్నేహితులూ ఆశ్చర్య పోయారు. వాళ్లకి ఆమె మీద గౌరవం పెరిగింది. అమ్మ అనారోగ్యంగా ఉన్నన్నాళ్లూ రత్న పార్టీలకి రాలేదు. ఆవిడకి స్నానం చేయించడం, తల దువ్వడం, తిండి తినిపించడం.. అన్నీ తనే స్వయంగా చేసేది. అసలు నన్ను పట్టించుకోవడమే మానేసింది. పిల్లల పనులు కూడా నౌకర్లే చేసేవారు. ఇంత పనిచేస్తున్నా ఎప్పుడూ ఆమె ముఖాన చిరునవ్వు మాత్రం చెక్కుచెదిరేది కాదు. చివరికి ఓరోజు అమ్మ మమ్మల్నందరినీ వదిలి వెళ్లిపోయింది. రత్న విచారానికి అంతే లేదు. నేనెప్పుడైనా ఎగతాళి చేసేవాణ్ని.

"పోయింది మా అమ్మ. కానీ నువ్వే ఎక్కువ బాధపడుతున్నావే! ఇవి మొసలి కన్నీళ్లు కావు కదా!"

నేనలా అనగానే రత్న పోట్లాటకి దిగేది. తరువాత ఏడుపు లంకించుకునేది. అప్పుడామెని ఊరుకోబెట్టేందుకు నాకు తాతలు దిగివచ్చేవారు. నెమ్మది నెమ్మదిగా జీవితం మళ్లీ మామూలు స్థితికి

## అనువాద శిఖరం



### ఆర్. శాంత సుందరి

నాలుగు దశాబ్దాలకు పైగా సాహిత్యవ్యాసంగంలో అనుభవం. ఇంతవరకూ కవిత, కథ, నవల, నాటకం, సాహిత్యేతర గ్రంథాల అనువాదాలూ, రెండు స్వీయ రచనలూ కలిపి మొత్తం 70 పుస్తకాలు ప్రచురితమయ్యాయి. హిందీ, తెలుగు, ఆంగ్ల భాషల గ్రంథాలే కాక తమిళం నుంచి కూడా కథలు, కవితల అనువాదాలు వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి.

తెలుగు - హిందీ ఇరుభాషల్లోనూ అనువాదాలు ప్రచురించినందుకు ఢిల్లీ అనువాద పరిషత్ పురస్కారంతో సత్కరించింది. ప్రసిద్ధ రచయిత సలీం నవల 'కాలుతున్న పూలతోట' హిందీ అనువాదానికి జాతీయ మానవహక్కుల సంఘం అనువాద పురస్కారం లభించింది. ప్రేమ్‌చంద్ బాలసాహిత్యం-13 కథలు అనువాదానికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం అందుకున్నాను. గత సంవత్సరం 'ఇంట్లో ప్రేమ్ చంద్' అనే గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. 'చతుర'లో ఇది నా రెండో అనువాదనవల.

చిరునామా:
ఆర్. శాంత సుందరి
506, వెస్ట్ అపార్టుమెంట్స్,
మజిద్ బండ, కొండాపూర్,
హైదరాబాద్ - 500084

చేరుకుంది. కానీ రత్న మునుపటి కన్నా సీరియస్‌గా ఉండడం మొదలుపెట్టింది. నాకు మరో ఊరికి బదిలీ అయింది. అదే ఊళ్లో రత్న అక్క సురేఖ భర్త ఇన్‌కమ్ టాక్స్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు. మమ్మల్ని వాళ్లు చాలా సంతోషంగా ఇంటికి ఆహ్వానించారు. కొత్త ఊరికి అల వాటు పడసాగాం. కానీ అమాయకురాలైన రత్నని సురేఖ తప్పుదారి పట్టిస్తోందని అనిపించింది. ఒకటి రెండుసార్లు చూచా యగా ఆ విషయాన్ని చెప్పేందుకు ప్రయ త్నించాను. కానీ రత్న నా మాటల్ని పెద్దగా పట్టించుకోలేదు. ఆ చుట్టుపక్కల నేను చాలా నిజాయితీపరుణ్ణని పేరు తెచ్చుకున్నాను. దీనికి కారణం నా తల్లిదం డ్రుల నుంచి వారసత్వంగా అబ్బిన లక్ష ణాలు, రత్న సహకారం. ఆమె ఎన్నడూ ఖరీదైన వస్తువులు కొనమని నన్ను అడగ లేదు. జీవితం హాయిగా గడిచిపోతోంది.

సురేఖ రత్నని వెంటబెట్టుకుని నా ఆఫీసు కారులో షాపింగ్‌కి వెళ్లేది. రత్న ఎప్పుడూ ఏమీ కొనుక్కోలేదు. కానీ సురేఖ అడపాదడపా రత్నకి ఖరీదైన చీరలు కొని వ్వటం మొదలుపెట్టింది. అక్క మనసు కష్టపెట్టకూడదన్న ఉద్దేశంతో రత్న కూడా వాటిని తీసుకునేది. ఏదీ దాచకుండా నాకా విషయాలు చెప్పేసేది. కానీ ఒకసారి రత్న మెడలో బంగారు గొలుసు చూశాను. ఆ రోజు మా పెళ్లిరోజు. సాధా రణంగా మా పెళ్లిరోజు గురించి ఎవరికీ చెప్పకుండా మేమిద్దరం ఒక మంచి రిసా ర్టులో గడపటం అలవాటు. కానీ ఆ రోజు సురేఖ అన్ని ఏర్పాట్లు చేసేసింది. పొద్దున్నే రత్న అక్కా, బావా ఏవేవో కాను కలు పట్టుకుని వచ్చారు. సురేఖ లోపలికి వెళ్లిపోయింది. ఆమె భర్త నాకు శుభాకాం క్షలు తెలిపి ఒక వజ్రపుటుంగరం ఇచ్చాడు. ఉంగరం పెట్టుకునే అలవాటు నాకు లేదని చెప్పి దాన్ని తిరస్కరించాను. ఇందుకు అతి కష్టం మీద అతన్ని ఒప్పిం చాల్సివచ్చింది.

సాయంత్రం వాళ్లు మమ్మల్నిద్దరినీ డిన్న ర్‌కి పిలిచారు. వాళ్లిద్దరూ వెళ్లిపోయాక నేను ముఖ్యమైన పని మీద బయటికి వెళ్ల వలసి వచ్చింది. ఆ రోజు నేను సెలవు పెట్టాను. కానీ ఈ ఉద్యోగంలో ఎన్ని సౌక ర్యాలున్నాయో అన్ని కష్టాలు కూడా ఉన్నాయి. ఎక్కడో అల్లర్లు జరగబోతున్నా యన్న వార్త వచ్చింది. అక్కడికెళ్లి సాయం కాలం బాగా పొద్దుపోయాక ఇంటికొ చ్చాను. చూస్తే రత్న డిన్నర్‌కి వెళ్లేందుకు తయారై కూర్చునుంది. రాళ్లు పొదిగిన కొత్త బంగారం నెక్లెస్ వేసుకుంది. దీన్ని వాళ్ల అక్క ఇచ్చి ఉంటుందని అర్థమైంది. అది నాకు ఎంతమాత్రం నచ్చలేదు. కానీ ఆ విషయం ఇంకెప్పుడైనా మాట్లాడవచ్చు లెమ్మని ఊరుకున్నాను. డిన్నర్‌కి వాళ్లు చాలామందినే పిలిచారు. భోజనం బాగుంది. కానీ నాకు తినాలనిపించలేదు. ఈ కానుకలు ఇవ్వటం, రత్న మీద సురేఖ కురిపించే అతిప్రేమా నాకు వెగటుగా తోచాయి. ఎలాగో డిన్నర్ కానిచ్చామని పించి ఇంటికి వచ్చేశాం. ఇష్టమైన ఆటవ స్తువు దొరికిన చిన్నపిల్లలా మురిసిపో యింది రత్న. కానీ నెక్లెస్‌ని తిరిగి ఇచ్చె య్యమని చెబుదామా? అని నేను తర్జన భర్జన పడసాగాను.

ఇంటికి వచ్చాక నేను మౌనంగా ఉండటం చూసి రత్న "ఏమైంది?" అని అడిగింది.

"ఏమీ లేదు" అని అన్నాను.

తను నమ్మలేదు. మెడలోని నెక్లెస్ తీసేస్తూ, "ఈ నెక్లెస్ నేను తీసుకోవడం మీకు నచ్చలేదు. వద్దని ఎంత చెప్పినా అక్క వినలేదు. తన మీద ఒట్టే అంది. అయినా మీకంత అయిష్టంగా ఉంటే రేపే ఇచ్చేస్తాను" అంది.

రత్న ఎప్పుడూ నన్ను అర్థం చేసుకుం

టుందని నాకు తెలుసు. ఆమె మాటలతో నా ఒత్తిడి మాయమైంది.

"రేపే ఇచ్చేసి రా! ఇంత విలువైన కానుకలు తీసుకుంటే రేపు మనం కూడా ఇలాంటివే ఇవ్వాలి" అన్నాను.

పొద్దున్న నా పనుల్లో పడి గత రాత్రి విషయం మర్చిపోయాను. ఇంతలో సురేఖ మళ్లీ హడావుడిగా వచ్చి, డల్హౌసీ హిల్ స్టేషన్‌కి వెళ్తున్నామనీ, మా అబ్బాయి ప్రభాస్ పుట్టినరోజుకి ఉండడం లేదనీ, వాడికోసం ఖరీదైన కెమెరాని ఇచ్చింది. వచ్చినంత హడావిడిగానూ వెళ్లిపోయింది. కానీ వెళ్లేముందు నాకేసి ఒక విషపు నవ్వు విసిరి మరీ వెళ్లింది. మావాడి పుట్టినరోజుకి వాడికి కెమెరా సర్‌ప్రైజ్‌గా కొనిద్దామనుకున్న సంగతి సురేఖకి ఎలా తెలిసింది? కోపంగా రత్నని అదే అడిగాను.

ఆమె భయం భయంగా.. "ఏదో మాటల్లో మీరు కెమెరా కొనాలనుకుంటున్నారని చెప్పా..!" అంది నసుగుతూ..

"ఆ నెక్లెస్ ఇచ్చేశావా? " అని అడిగాను.

"లేదు! మా అక్కయ్య అత్తగారు వచ్చారు. అందుకే ఇవ్వలేదు. వాళ్లు ఊరు నుంచి తిరిగి రాగానే తప్పకుండా ఇచ్చేస్తాను" అంది రత్న.

నేనేమీ జవాబు చెప్పకుండా వెళ్లిపోయాను. కానీ నా మనసులో ఎప్పుడూ లేని చిరాకు చోటుచేసుకుంది. సురేఖ ఎప్పుడు వెనక్కి వస్తుందా? అని ఎదురు చూడడం మొదలుపెట్టాను. పది రోజులు పది యుగాల్లా గడిచాయి. చివరికి సురేఖ వచ్చేసింది. ఒకరోజు ఆగి రత్నకి నెక్లెస్ విషయం గుర్తుచేశాను.

"ఈ రోజు వెళ్తాలెండి!" అంది రత్న విసుగ్గా.

రత్న వాళ్ల అక్క ఇంటికి వెళ్లేందుకు మధ్యాహ్నం ఆఫీసు కారు పంపించాను.

కాసేపట్లోనే డ్రైవర్ వచ్చి "అమ్మగారికి ఒంట్లో బాగాలేదట సార్!" అని చెప్పాడు.

## కొత్తగాలి...

**తడి లేని**
**నారుమళ్లు!**
**తడి ఆరని**
**రైతు కళ్లు!!**

– బిక్కునూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

ఇలా నేను రెండు మూడుసార్లు నెక్లెస్ విషయం గుర్తుచేశాక, ఇక తప్పదు అన్నట్లు అయిష్టంగానే రత్న వాళ్ల అక్క ఇంటికి వెళ్లింది. ఇంటికి వచ్చాక కూడా ముభావంగా ఉంది.

"నెక్లెస్ ఇచ్చేశావా? " అని అడగ్గానే వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. మా అమ్మ పోయినప్పుడు తప్ప ఆమె ఇలా ఏడవడం మళ్లీ చూడలేదు. ఊరుకోబెట్టేందుకు ప్రయత్నించేసరికి నా చెయ్యిని విదిల్చి కొట్టింది.

"నేను మీ భార్యనే కాదు. మా అక్కకి చెల్లెల్ని కూడా. తను ఇచ్చిన వస్తువులు తీసుకోకూడదా? " అంది కోపంగా..!

నేను అవాక్కయ్యాను. నాకు తెలిసిన రత్న వేరు. ఎప్పుడూ నవ్వుతూ, సౌమ్యంగా ఉండే రత్నా.. ఈమే.. ఒకరేనా? కానీ నాకీ లోకంలో రత్నా, నా పిల్లలూ తప్ప మరెవరున్నారు? తను ఇలా ఏడుస్తూ ఉంటే చూడలేకపోయాను.

"ఫరవాలేదులే! నెక్లెస్ ఉంచుకో? " అన్నాను ఆమెతో.

రత్న ఏడుపు ఆపి నన్ను గట్టిగా వాటేసుకుంది.

"ఈ ఒక్కసారికి ఊరుకోండి! నెక్లెస్ ఇవ్వపోతే అక్కయ్య ఏడవడం మొదలుపెట్టింది. 'ఈసారికి తీసుకో! మళ్లీ ఇంకె

ప్పుడూ ఇవ్వనులే!' అని అక్క మాటి చ్చింది" అని చెప్పింది.

కానీ నాకెందుకో సురేఖ వక్రబుద్ధితోనే ప్రవర్తిస్తోందని అనిపించింది. అన్నట్టు ఒక విషయం ముందుగా రాయటం మరిచాను! రత్న కంటే ముందు వాళ్ల నాన్న సురేఖని నాకిచ్చి పెళ్ళి చెయ్యాలని అనుకున్నాడు. సురేఖ కూడా నాతో మాట్లాడింది. తన పిన్నికీ నాకూ ఉన్న వ్యవహారం గురించి తనకి తెలుసనీ, మా పెళ్ళి అయాక కూడా నేను ఆమెతో సంబంధం కొనసాగిస్తే తనకి ఎటువంటి అభ్యంతరం ఉండబోదనీ అంది సురేఖ. అది విని నాకు ఆమెపై చాలా అసహ్యం వేసింది. ఆమెని వెళ్ళిపొమ్మనీ, మళ్ళీ ఆ విషయం మాట్లాడవద్దనీ కసిరి పంపించేశాను. ఆ అవమానానికి నాపై పగ తీర్చుకునేందుకే ఆమె ఇలా ప్రవర్తిస్తోందని నాకు అనిపించింది. మా జీవితంలో పెద్ద మార్పు వచ్చింది. రత్న, నేను ఇద్దరం మునుపటిలా ఉండడం లేదు. మా ప్రేమ బీటవారింది. ఏదో తెలియని అడ్డుగోడ మా ఇద్దరి మధ్య లేచింది.

ఉన్నట్టుండి విజిలెన్స్ వాళ్ళు సురేఖ భర్త లంచం తీసుకుంటుండగా పట్టుకున్నారన్న వార్త తెలిసింది. సురేఖ నాకు ఫోన్ చేసి తన భర్త ఏ పాపమూ ఎరగడనీ, కావాలనే ఎవరో అతన్ని ఇరికించారనీ చెప్పింది. ఈ విషయంలో నేనేం చెయ్యలేనని అనేసరికి ఆమె తిన్నగా మా ఆఫీసుకు వచ్చేసింది. ఆమె నా గదిలోకి రాగానే నా పర్సనల్ అసిస్టెంట్ బయటికి జారుకున్నాడు. సురేఖ తలుపు మూసి నా కాళ్ళు పట్టుకుంది. ఎలాగైనా తన భర్తని విడిపించమని బతిమాలసాగింది. ఆమెని లేచి కుర్చీలో కూర్చోమని చెప్పి "ఇది నాకు సాధ్యం కాని పని" అన్నాను.

దెబ్బతిన్న పాములా లేచి బుసలు కొడుతూ.. "అసలు ఇది మీ పనే! అది చేయించింది మీరే అని నాకు తెలుసు" అని అంటూ వెళ్ళిపోయింది.

ఆ రోజు ఆలస్యంగా ఇంటికి చేరుకున్నాను. రత్న ఇంట్లో ఎక్కడా కనిపించలేదు. మధ్యాహ్నం సురేఖ వచ్చిందనీ, రెండు గంటల పాటు అక్కాచెల్లెళ్ళు ఏదో మాట్లాడుకున్నారనీ, సురేఖ అటు వెళ్ళిపోగానే రత్న టాక్సీ పిలిపించుకుని, పిల్లల్ని తీసుకుని రైల్వేస్టేషన్‌కి వెళ్ళిపోయిందనీ ఇంట్లోని నౌకర్లు చెప్పారు. పుట్టింటికి వెళ్తున్నానని వాళ్ళకి చెప్పిందట.

నేను వెంటనే సెలవు పెట్టి రత్న పుట్టింటికి చేరుకున్నాను. రత్నవాళ్ళ నాన్న ఎక్కడికో పనిమీద బయటికి వెళ్ళాడట. మా అత్తగారు నన్ను సరిగ్గా పలకరించలేదు. నేను రత్న గదిలోకి వెళ్ళాను. ఆమె ఏమీ మాట్లాడకుండా కూర్చుంది. నన్ను కూర్చోమని కూడా అనలేదు. కొంతసేపు అలా మౌనంగా నిలబడ్డాక ఇక నాకు నోరు విప్పక తప్పలేదు.

"ఎందుకిలా చెప్పాపెట్టకుండా వచ్చేశావు?" అని అడిగాను.

తను జవాబు ఇవ్వలేదు.

రెండు మూడు సార్లు నేను రెట్టించి అడిగాక విసుగ్గా.. "కారణం మీకు తెలీదా?" అని అంది.

"నాకు తెలీదు" అని ముక్తసరిగా జవాబిచ్చాను.

ఆమె తిరిగి జవాబు చెప్పలేదు. రత్న అలా మౌనంగా ఉండటాన్ని భరించలేకపోయాను. "నోరు విప్పి మాట్లాడవేం?" అని గట్టిగా అరిచాను.

ఆమె విసురుగా లేచి "ఏం మాట్లాడను? ఆఫీసులో మా అక్క సురేఖతో మీరు ప్రవర్తించిన తీరు తెలిశాక ఇంకేం మిగిలుంది మీకు చెప్పేందుకు?" అంది.

'ఓస్! ఆ విషయమా?' అనుకుని కాస్త కుదుటబడ్డాను.

"అలా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్ల మీద

అ
క్ష
రం

అర్థమయ్యే పరాయి భాషలో
మాట్లాడితే మెదడుకు చేరుతుంది
మాతృభాషలో మాట్లాడితే
మనసుకు చేరుతుంది

– నెల్సన్ మండేలా



రైడ్ చెయ్యడం అనేది సెంట్రల్ విజిలెన్స్ వాళ్ళ వ్యవహారం. వాళ్ళు మా మాట విని పించుకోరు. ఇక చేసిన తప్పుడు పనులకి ఎవరైనా ఫలితం అనుభవించాల్సిందే కదా!" అన్నాను నిట్టూరుస్తూ.

చివరి మాటలు అనగానే 'ఎందుక న్నానా?' అని బాధ పడ్డాను. కానీ అప్ప టికే ఆలస్యం అయిపోయింది. జరగాల్సిన అనర్థం జరిగిపోయింది.

"నిజమే! మీరన్న మాట మీకు కూడా వర్తిస్తుంది. నేననేది విజిలెన్స్ వాళ్ళ గురించి కాదు. మా బావగారిని విడిపిం చేందుకు మీరు సురేఖని చెల్లించమని అడి గిన మూల్యం గురించి మాట్లాడుతు న్నాను. ఇప్పుడు చెప్పండి దానికి మీ సమాధానం ఏమిటో?" అంది రత్న, ఓరగా నా వేపు చూస్తూ.

"మూల్యమా? అలాంటిది నేనేమీ అడ గలేదే?" అన్నాను ఆశ్చర్యపోతూ.

"నా దగ్గర నాటకాలొద్దు! బుకాయిం చొద్దు! మీ మగాళ్ళందరూ ఒకటే! ఆడ వాళ్ళ దగ్గర కోరేది ఒకటే. మా అక్క య్యతో అలాంటి మాటనడానికి మీకు కొంచెం కూడా సిగ్గనిపించలేదా?" అంది రత్న కళ్ళెర్రచేసుకుని.

నా మొహంలో కత్తివాటుకి నెత్తురు చుక్క లేదు! కాసేపు నోటంట మాట రాలేదు. అంతలో కోపం తన్నుకొచ్చింది. "ఏమిటి వాగుతున్నావు? ఆలోచించే మాట్లాడుతున్నావా?" అన్నాను గొంతు పెంచి. ఆ తరువాత అసలు జరిగిందే మిటో నేనెంత చెప్పినా రత్న నమ్మలేదు. నా మాటలు పట్టించుకోలేదు. చివరికి మా పిల్లల మీద ఒట్టు వేసి అదంతా అబ ద్ధమని అన్నాను.

దానికీ రత్న పెడసరంగానే జవాబు ఇచ్చింది. "అబద్ధాలు చెప్పేవాళ్ళే అలా ఒట్టు వేస్తారు, నిజం చెప్పే వాళ్ళకి ఆ అవసరం ఉండదు" అని అంది. కాసేపాగి "మా పిన్నితో మీరు నడిపిన వ్యవహారం కూడా నిజం కాదని ఒట్టు వేస్తారేమో!" అంది వెక్కిరింపుగా.

నాకు నీరసం ముంచుకొచ్చింది. చేసేదే మీలేక వెనక్కి వచ్చేశాను.

మా మామగారు మంచి లోకజ్ఞానం ఉన్న మనిషి. ఎవరితో ఎలా వ్యవహరిం చాలో బాగా తెలుసు. రత్నని ఎలా ఒప్పిం చాడో గానీ స్వయంగా తీసుకొచ్చి నా దగ్గర దింపి వెళ్ళాడు. ఒకే ఇంట్లో ఉంటున్నా ఇద్దరి మధ్యా దాటలేని అగాధం ఏర్పడింది. పువ్వులా ఉండే రత్న ఇప్పుడు ముళ్ళకంపగా మారింది. ఎప్పుడు నన్ను చూసినా రుసరుసలాడుతోంది. అన వసరంగా నా మీద అనుమానం పెంచు కుని ఆఫీసులో నాతో పనిచేసే ఆడవాళ్ళ తోనూ, నాతో పని ఉండి వచ్చే ఆడవాళ్ళ తోనూ నాకు అక్రమ సంబంధాలు అంట గడుతోంది. నేను ఎంత చెప్పినా వినిపిం చుకోకుండా ఉండటం ఆమెకి అలవాటుగా మారింది. దీనివల్ల నేను కూడా ఎప్పుడూ చిరాగ్గా ఉండడం మొదలుపెట్టాను. కావా లనే రత్న నాకిష్టంలేని పనులు చెయ్యడం, నాకు సయించని వంటలు చెయ్యడం మొదలుపెట్టి నన్ను బాధపెట్టడమే

ధ్యేయంగా బతుకుతోంది. ఇంట్లో వాతావరణం పూర్తిగా దెబ్బతింది.

ఎప్పుడూ గొంతెత్తి మాట్లాడని ఇద్దరం తరచు అరుచుకోవడం, మాటా మాటా పెరిగి అది వాగ్యుద్ధంలోకి దిగడం మామూలు విషయంగా మారింది.

దీని ప్రభావం పిల్లల మీద కూడా కనిపించడం మొదలుపెట్టింది. చిన్నపిల్లలు సామాన్యంగా ఇలాంటి పరిస్థితుల్లో తండ్రిదే తప్పనుకుంటారు. అందులో తప్పేం లేదు. ఎందుకంటే తండ్రి పగలంతా ఆఫీసులో ఉన్నప్పుడు ఇల్లు ప్రశాంతంగా ఉంటుంది. అతను ఇంటికి రాగానే గొడవలు మొదలవుతాయి. పిల్లలు ఇంకా పాడైపోకముందే వాళ్ళని హాస్టల్‌లో చేర్పించి ఈ వాతావరణం నుంచి తప్పించాలనుకున్నాను.

కానీ రత్న "నాకున్న ఆ కాస్త ఆనందం కూడా చూడలేకపోతున్నారా? " అంటూ అడ్డుపడింది.

ఈ మధ్య మేమిద్దరం ఎప్పుడు పోట్లాడుకున్నా చివరికి రత్న అడిగేది ఒక్కటే! నాకు తన పిన్నికీ మధ్య నడిచిన వ్యవహారం నా నోటంటే వినాలని పట్టుపట్టేది. ఆ సంఘటన నా జీవితంలోని మొట్టమొదటి చేదు అనుభవం. అందుకే ఒకరోజు ఇద్దరం పోట్లాడుకోకుండా మామూలుగా ఉన్నప్పుడు జరిగిన సంగతి పూర్తిగా చెప్పేసి, ఐ.ఎ.ఎస్. ట్రైనింగ్‌కి వెళ్ళాక ఇక ఆమెతో ఎటువంటి సంబంధమూ లేదనీ, పైగా మా ఇద్దరికీ పెళ్ళికాక ముందే వాళ్ళింట్లో అందరికీ ఆ వ్యవహారం గురించి తెలుసనీ చెప్పాను.

"నీకు నిర్ణయించుకునేందుకు నెలరోజులు టైం కూడా ఇచ్చాను. ఆ నెల రోజుల్లో మీ పిన్నికీ నాకూ మధ్య జరిగిన వ్యవహారం గురించి కనీసం మీ అమ్మయినా నీకు చెపుతుందని అనుకున్నాను" అంటూ ముగించాను.

నా మాటలకి ఆ రోజు ఎందుకో రత్న విరుచుకుపడకుండా మామూలుగా జవాబు చెప్పింది. "నాకెవరూ ఆ సంగతి చెప్పలేదు. అక్క మాత్రం 'ఈ మనిషిని చేసుకునే ముందు బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో! నన్ను కాదన్నవాడు ఇతనే కదా!' అని చాలాసార్లు హెచ్చరించింది. 'పైగా నువ్వు పెళ్ళిచేసుకుని ఆ ఇంటికి వెళ్తే నేను నిన్ను వచ్చి కలవాలన్నా నాకు కాస్త ఇబ్బందిగానే ఉంటుంది' అని కూడా అంది. మా పిన్ని మాత్రం నా మీద తెగ ప్రేమ ఒలకబోసింది. అమ్మ దిగులుగా కనిపించింది. అయినా ఆవిడకి ఏనాడూ నాన్న ఇష్టాన్ని వ్యతిరేకించటం సాధ్యం కాని పనే. అమ్మకి మొదటి నుంచీ ఆస్తిలో పిన్ని వాటా ఇచ్చేసి ఆమెని విడిగా ఉంచడమే ఇష్టం. కానీ నాన్నకి పిన్ని ఆస్తి మీద కన్నుండేది, అందుకే ఆవిడ మాతోనే ఉంది. ఆవిడ అందరి మీదా పెత్తనం చెలాయించేది. కానీ నేను మొదట్నుంచీ హాస్టల్లో ఉండడం వల్ల ఆవిడ నన్నేమీ చెయ్యలేకపోయింది. నేను మిమ్మల్ని తప్పుపట్టాను కానీ, తప్పు మీది కాదు, ఆమెదే" అంది రత్న.

ఆమె అలా అనేసరికి నలభై ఐదేళ్ళ ఇంతెత్తు మగాణ్ణీ, ఇంత పెద్ద ఆఫీసర్నీ ఏడవడం మొదలుపెట్టాను. నా కన్నీటిలో మా ఇద్దరి మధ్యా ఇన్నాళ్ళుగా ఉన్న అనుమానాలూ.. అబద్ధాలు.. అన్నీ కడిగేసినట్టు మాయమయ్యాయి.

మర్నాడు పొద్దున్నే నౌకర్ని పంపించకుండా రత్న తనే నాకోసం నాకిష్టమైన ఫలహారం చేసి తీసుకొచ్చింది. చాలా ఏళ్ళ తరువాత పొద్దున్న స్నానం, పూజ చెయ్యకుండా టిఫిన్ చేశాను. కొన్నాళ్ళు హాయిగా గడిచాయి. రత్నలో మళ్ళీ మునుపటి ఉత్సాహం, చురుకుదనం కనిపించసాగాయి. అదే సమయంలో నా బ్యాచ్‌లో చదువుకున్న స్వాతి అనే అమ్మాయికి

రూరల్ డెవలప్‌మెంట్ ఆఫీసులో జాయింట్ కమిషనర్‌గా మా ఊరికి బదిలీ అయి వచ్చింది. మా బ్యాచ్‌లో స్వాతి అందరికన్నా అల్లరి అమ్మాయిగా, దేన్నీ లెక్కచెయ్యని రకంగా పేరు పొందింది. నలభై ఐదేళ్ళ స్వాతిలో ఇప్పటికీ ఎటువంటి మార్పూ లేదు. ఆమె ఇంకా పెళ్ళి కూడా చేసుకోలేదు. మా ఇల్లు వెతుక్కుంటూ వచ్చి, లోపలికి రాగానే నన్ను కావలించుకుని "ఎలా ఉన్నావు ముసలాయనా!" అని పలకరించింది.

రత్న అప్పుడు అక్కడే ఉంది. రత్నకి స్వాతి ధోరణి నచ్చలేదని గ్రహించి నేనామె చేతుల్ని నెమ్మదిగా విడిపించి సోఫాలో కూర్చోబెట్టాను. అప్పుడామె రత్నవైపు చూసి, "ఎలా ఉన్నావు రత్నా? యు ఆర్ ఎ స్వీట్ ఓల్డ్ గర్ల్!" అంది.

నేను కాస్త సర్దుదామని ప్రయత్నించాను. కానీ స్వాతి ఎప్పుడూ మొహమాటం ఎరగదు. కొత్తవాళ్ళతో మర్యాద పాటించాలని తోచదు తనకి. గాలివానలా వచ్చిన స్వాతి తుఫానులా మూడు నెలల్లో మళ్ళీ మరోచోటుకి బదిలీ చేయించుకుని వెళ్ళిపోయింది. కానీ నాకూ రత్నకీ మధ్య మళ్ళీ అగాధాన్ని ఆ కాస్త సమయంలోనే సృష్టించిపోయింది.

రత్న మాటిమాటికి నా మీద విరుచుకు పడడం మళ్ళీ మొదలెట్టింది. నన్ను పూర్తిగా స్త్రీలోలుడి కింద జమకట్టేసి వాళ్ళ పిన్ని గురించి దెప్పి పొడుస్తూ మళ్ళీ నన్ను అనవసరంగా అవమానించసాగింది. నాకూ వాళ్ళ పిన్నికీ ఉన్న సంబంధం గురించి తనకి ముందే చెప్పక పోవడం వాళ్ళు చేసిన తప్పని ఒప్పించేందుకు నేనెంత ప్రయత్నించినా ఫలితం కనబడలేదు. ఇలాంటి అపోహలూ, అపార్థాలూ ఆ దేవుళ్ళకే తప్పలేదు. ఇక నాబోటివాడు ఏం చెయ్యగలడు? కొంత కాలానికి మా పిల్లలు కూడా నాకు దూరం కావడం మొదలుపెట్టారు. చదువుకోవాలన్న సాకు చెప్పి నాతో కలిసి భోంచెయ్యకుండా ముందే తినేస్తున్నారు. రత్న నాతో పాటే భోజనానికి కూర్చున్నా ఆమె మొహంలో అయిష్టం స్పష్టంగా కనిపిస్తూనే ఉండేది.

నేను లేనప్పుడు వాళ్ళు ముగ్గురూ ఆనందంగా ఉండేవాళ్లని ఎప్పుడైనా అనుకోకుండా పెందలాడే ఇంటికి వస్తే తెలిసేది. నేను రాగానే ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లిపోయి ఇల్లు నిశ్శబ్దంగా మారిపోయేది. రత్న నా వెంట స్నేహితుల ఇళ్లకీ, ఆఫీసు పార్టీలకీ రావడం మానేసింది. ముందు వస్తానని చెప్పి సరిగ్గా బయలుదేరే సమయానికి ఒంట్లో నలతగా ఉందనో, తలనొప్పిగా ఉందనో, ఇంకేవేవో సాకులు చెప్పి తప్పించుకునేది.




**పి**ల్లలు పెద్దవాళ్లవుతున్న కొద్దీ నాకూ, వాళ్లకీ మధ్య దూరం పెరగసాగింది. కానీ నేను చేసేదేమీ కనిపించలేదు. పైగా పరిస్థితిని బాగు చేద్దామని ప్రయత్నించిన కొద్దీ అది వికటించేది. "మీ వాళ్లు వచ్చి వెళ్లినప్పుడల్లా మనిద్దరికీ పోట్లాట జరుగుతోంది" అన్నానొకసారి.

వెంటనే రత్న వాళ్లకి రావొద్దనీ, వాళ్లు రావడం నాకిష్టం లేదనీ చెప్పి నా మీద వాళ్లకి దురభిప్రాయం ఏర్పడడానికి కారణమైంది. నాకు ఎవరితోనూ సత్సంబంధాలు

లేకుండా చెయ్యడమే తన ధ్యేయంగా బతుకుతోంది రత్న.

ఎలాగైనా రత్నని ప్రసన్నం చేసుకోవాలనుకుని, ఎప్పుడూ చెయ్యని పని ఒకటి చేశాను. నా ఉద్యోగాన్నీ, పరపతినీ వాడుకుని రత్న బావమీదున్న కేసులో తప్పుడు సాక్ష్యం ఇప్పించి అతడ్ని విడిపించాను. ఈ పని నేను రత్న సమక్షంలోనే చేశాను. అంతేకాదు, రత్న అన్నలకీ, వదినలకీ ఉద్యోగాలు కూడా నా సిఫారసుల వల్లే దొరికాయి. ఎప్పుడైనా నేను తన వాళ్లకి చేసిన సాయం సంగతి రత్న దగ్గర ఎత్తితే "మీకు మాత్రం డెప్యూటీ కలెక్టర్ ఉద్యోగం ఎలా వచ్చిందో నాకు తెలీదా?" అనేది ఎత్తిపొడుపుగా.

ఈ మధ్య పిల్లలు తమ మార్కులూ, ర్యాంకులూ కూడా నాకు చెప్పటం మానేశారు. జిల్లా మొత్తానికి పెద్దనే కానీ ఇంట్లో మాత్రం నాది చాలా దయనీయమైన స్థితి. అంతా విధి లీల! నేను లోలోపల కుమిలిపోసాగాను. దాని ప్రభావం నా ఆఫీసు పనుల మీద కనిపించసాగింది. నాకింద పనిచేసేవారికి సైతం నా ఇంట్లో పరిస్థితి గురించి తెలిసిపోవటం మొదలైంది. యాంత్రికంగా ఆఫీసుకి వెళ్లేవాణ్ని. వీలైనంత ఎక్కువ సేపు అక్కడే గడిపేవాణ్ణి. మధ్యాహ్నం భోజనానికి కూడా ఇంటికి వెళ్లేవాణ్ణికాదు. ఆ రోజుల్లోనే కవిత్వం రాయడం మొదలుపెట్టాను. ఆ అక్షరాలు సిరాలో కాకుండా, నా గుండె కార్చిన రక్తంలో ముంచి రాస్తున్నానని అనిపించేది.



తల్లిదండ్రుల మధ్య సత్సంబంధాలు లేకపోతే దాని ప్రభావం పిల్లల మీద పడుతుంది. ఆవేశంలో ఉన్నప్పుడు తమ పోట్లాటలూ, అహంకారాలూ, పిల్లలని ఎలా దెబ్బతీస్తాయో పట్టించుకోరు తల్లిదండ్రులు. వాదనలు పెరిగిపోయి తుఫాను స్థాయికి చేరుకున్నాక ఇద్దరిలోనూ కాస్త బుద్ధి, వివేకం ఉన్నవారు వాదన నుంచి తప్పుకుంటారు. దాన్ని అవతలి వ్యక్తి తన గెలుపని అనుకుంటాడు. కానీ ఇంటి పోరులో విజేతలెవరూ ఉండరు.

ఆ కుటుంబం మొత్తం ఓటమికి గురవుతుంది. మా విషయంలోనూ అదే జరుగుతోందని గ్రహించినప్పటికీ ఏం చెయ్యాలో



మానించడం మొదలుపెట్టింది.

పెద్దవాడు ప్రభాస్ పన్నెండో క్లాసుకి వచ్చాడు. పదో క్లాసులో వాడు బోర్డు మెరిట్ లిస్ట్‌లో మొదటి పదిలో స్థానం సంపాదించుకున్నాడు. కానీ ఈ ఏడాది వాడిలో మార్పు వచ్చింది. పొగరుబోతులా తయారయాడు. వాడికి నా మాటంటే బొత్తిగా లెక్కలేకుండా పోయింది. నేను ఉద్యోగమే చెయ్యనా?

నాకు తెలీలేదు. నేనిలా మౌనంగా ఉండటం వల్ల రత్న రెచ్చిపోవడం, నన్ను ఖాతరు చెయ్యకపోవడం ఎక్కువయింది. స్నేహితులనీ, మానసిక వైద్యులనీ సంప్రదించాను. రత్నలో మార్పు తీసుకురావడం దాదాపు అసాధ్యమనే అందరూ అన్నారు. అసలు నా తరఫున ఎవరైనా ఒక్కమాట మాట్లాడినా భరించలేకపోయేది రత్న. నాతో పాటు వాళ్ళని కూడా అవ

రత్న ప్రవర్తనని భరించనా? పిల్లల విషయం చూసుకోనా?

పన్నెండో క్లాసు పరీక్షా ఫలితాలు వచ్చిన రోజున వాడు కోపంతో, బాధతో కుంగిపోయాడు. టీచర్లూ, స్నేహితులూ మేమూ అందరం వాడికి తొంభై కన్నా ఎక్కువ మార్కులే వస్తాయని అనుకున్నాం. కానీ వాడికి అరవై ఐదు మార్కులే వచ్చాయి. ఫలితాలు ప్రకటించిన చాలా సేపటికి వాడు ఇంటికి వచ్చాడు. బాగా తాగి తూలుతున్నాడు. అది చూసి నాకు కోపం ఆగలేదు. వాడ్ని కొట్టేటందుకు చెయ్యెత్తేసరికి నా చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ' 'మిస్టర్ డెప్యూటీ కలెక్టర్! నేనిప్పుడు అడల్ట్‌ని! మైనర్‌ని కాను! ఆ విషయం మర్చిపోవద్దు!" అన్నాడు నిర్లక్ష్యంగా!

బడిపంతులు కొడుకుగా పుట్టి సరైన తిండీ, పోషణా లేకుండా పెరిగిన నాకూ, డబ్బున్న కుటుంబంలో పుట్టి బలంగా పెరిగిన ప్రభాస్‌కీ మధ్యనున్న తేడా తెలుస్తోంది. వాడి పట్టు ఉడుం పట్టులా అనిపించింది. వాడు నాకన్నా పొడుగ్గా, బలంగా ఉన్నాడు. పైగా వాడి మొహంలో స్పష్టంగా నా మీద కనిపిస్తున్న ఏహ్యాభావం నన్ను మానసికంగా కూడా బలహీనుణ్ణి చేసింది.

నేను మాట్లాడకుండా ఇంట్లోంచి బయటికెళ్ళిపోయాను. ప్రభాస్ వయసున్న పిల్లలకి మంచీ మర్యాదా, సంస్కారం నేర్పకపోతే ఇలాగే రౌడీల్లా తయారవుతారు. నా భార్య ఎలాగూ నన్ను ఇంటి పెద్దగా గౌరవించదు. ఇక పిల్లలకి నా మీద ఏం గౌరవం ఉంటుంది? అసలు పిల్లలు తండ్రి మీద గౌరవం చూపించకపోవడానికి కారణం వాళ్ల తల్లే! ఇంట్లో వేగంగా పరిస్థితులు మారుతూ వచ్చాయి. వాళ్ల దృష్టిలో నేను మరింత నిస్సహాయుడిలా, పనికిమాలినవాడిలా కనిపించసాగాను.

నేను నోరు మూసుకుని అన్నీ భరిస్తున్న కొద్దీ రత్న రెట్టించిన ఉత్సాహంతో రకరకాలుగా మాటలతోనూ, చేతలతోనూ నన్ను వేధించడం ప్రారంభించింది. నా మీద పగ సాధిస్తున్నట్టు ప్రవర్తించసాగింది. ఆ ధ్యాసలో ఇల్లూ పిల్లలూ అథః పాతాళానికి కుంగిపోతున్నారన్న సంగతి గమనించలేదామె.

ఏ ఎంట్రెన్స్ పరీక్షలోనూ ప్రభాస్ పాస్ కాలేదు. బి.ఎస్‌సి.లో చేరమని నేను సలహా ఇచ్చాను.

వాడు పొగరుగా "నేనేం చెయ్యాలో నేను చూసుకుంటాను. మీ సలహాలు నాకు అవసరం లేదు!" అన్నాడు.

కొన్నాళ్ళ తరువాత వాడు ఇంజినీరింగ్ చదివేందుకు జంషెడ్‌పూర్‌కి వెళ్తున్నాడని తెలిసింది. 'ఎలా వెళ్తున్నాడు? అది డొనేషన్ కాలేజీ కదా? ' అనుకున్నాను.

రత్న రెండుమూడు రోజులు ఊరెళ్లింది. అందుకే వాడితో మాట్లాడటానికి ఇష్టం లేకపోయినా వాడిని అడగాల్సొచ్చింది.

వాడు వ్యంగ్యంగా నవ్వుతూ "అదేమిటి డాడీ! ఇంకొకరి సాయంతో పని జరుపుకోవడం అనేది నాకు వారసత్వంగా అబ్బింది కదా! మీరు మర్చిపోయారేమో? నాకు డబ్బున్న పెదనాన్న ఉన్నాడు! మీ బికారి నాన్నకి వేరే మార్గం లేకపోయుండొచ్చు! ఇక ధర్మరాజులాంటి మా నాన్న ఎన్ని చెడ్డపనులు చేసినా చెయ్యొచ్చు గాక! కానీ పిల్లల కోసం లంచం తీసుకోవాలంటే మాత్రం.. తన పరపతి వాడుకోవాలంటే మాత్రం.." అని ఏదేదో వాగాడు వాడు.

అక్కడ ఉండడం నాకు సాధ్యం కాలేదు. చెవుల్లో సీసం కరిగించి పోసినట్టు బాధించాయి వాడి మాటలు. అక్కణ్ణించి వెళ్లిపోయాను. ఒక వారం రోజులు సెలవు పెట్టి జిమ్ కార్బెట్ నేషనల్ పార్క్‌కి వెళ్ళాను. అంతరించిపోతున్న బెంగాల్ టైగర్లని రక్షించడం కోసం ఏర్పాటు చేసిన పార్క్ అది. అక్కడ

నాతో స్కూల్లో చదువుకున్న నా క్లాస్‌మేట్‌కి రిసార్ట్ ఉంది. ఆ అడవిలో నాకు చాలా ప్రశాంతత చిక్కింది. అక్కడి స్వచ్ఛమైన ప్రాణవాయువు నాలోని విషాదాన్ని చాలా మట్టుకు తగ్గించింది. కానీ మనకి ఇల్లే స్వర్గం! అందుకే వారం ఉండి వెనక్కి వచ్చేశాను. ప్రభాస్ జంషెడ్‌పూర్‌కి వెళ్లిపోయాడు. చెప్పాపెట్టకుండా వారం రోజులు నేను ఇంట్లోంచి మాయం అయేసరికి రత్న బెదిరిపోయింది లాగుంది. కొన్నాళ్లు నన్ను సతాయించడం మానేసింది. మనిషి స్వభావం ఎంతో చిత్రమైంది! చెడు జరుగుతుందేమోనని ఎవరి గురించి బెంగ పెట్టుకుంటామో, వారిని మానసికంగా హింసించేందుకు ఎంత మాత్రం వెనకాడం సరికదా అలా చెయ్యడంలో ఒక అలౌకికమైన ఆనందాన్ని కూడా అనుభవిస్తాం!

వక్రగతిలో ఉన్న గ్రహాలు దారిలోకి వచ్చినట్టున్నాయి. నేను ఆదాయం పన్ను తగ్గించుకునేందుకు పదివేల రూపాయలకి ఎన్.ఎస్.సి.లు కొన్నాను. అలా కొన్న వాటిలో సర్కారు లాటరీలో నాకు మొదటి బహుమతి కింద కోటి రూపాయలు వచ్చాయి. అన్ని కోతలూ పోగా అరవై ఆరు లక్షల దాకా చేతికొచ్చింది. ముందుగా పదిహేను లక్షలు తోడల్లుడికి ఇచ్చేందుకు వాళ్లింటికి వెళ్లాను. ప్రభాస్ డొనేషన్ కోసం ఆయన ఇచ్చిన డబ్బు అది. తీసుకోనంటాడేమోనని భయపడ్డాను. ఇది తనకీ ప్రభాస్‌కీ సంబంధించిన విషయమని అంటాడనుకున్నాను. రత్నకి ఆ డబ్బు సంగతి ఏమీ చెప్పకపోయినా ఆమెని వెంటపెట్టుకునే వెళ్లాను. కానీ నా తోడల్లుడు డబ్బు విషయం క్షుణ్ణంగా తెలిసిన మనిషి. బురదలో ఉండే మొసలిలా, ఎప్పుడు ఇతరుల మీద బురద జల్లాలో, ఎప్పుడు అందులో దాక్కుని వేటాడాలో అతనికి బాగా తెలుసు.

ముందు మొహమాటపడ్డట్టు నటించి "నా కూతుళ్లకీ, ప్రభాస్‌కీ తేడా ఏముంది? నా పిల్లలకైతే ఖర్చు పెట్టనా? " అన్నాడు.

ఆ తరువాత "ఎంతైనా మీరు వాడికి తండ్రి! నా దగ్గర డబ్బు తీసుకోవడం మీ అహాన్ని దెబ్బతీస్తుందేమో? సరే ఇవ్వండి! కానీ ఇంత త్వరగా మీకు ఇంత డబ్బెక్కడి నుంచి వచ్చింది? మీ మంచి కోసమే అడుగుతున్నాను. మీరు అనుభవంలేని అమాయకులు. చిక్కుల్లో పడతారేమో..? ఎప్పుడైనా తాపీగా వస్తే డబ్బు సంపాదించే మార్గాలు చెపుతాను" అన్నాడు.

'నాకు పాఠం చెప్పేంత జ్ఞానం ఉన్న మీరు మరి ఎలా విజిలెన్స్ వారికి చిక్కారు? ' అని అడగాలనిపించింది. కానీ అడగలేదు. అతను డబ్బు తీసుకున్నాడు. అదే పదివేలు అనుకుని వచ్చేశాను.

కొన్నాళ్లుగా నాకూ రత్నకీ మధ్య మళ్లీ ఘర్షణ మొదలైంది. మాటిమాటికీ నాతో కలిసి ఉండడం తప్ప తనకి వేరే దారి లేదని నన్ను ఎత్తిపొడవడం ప్రారంభించింది. బహుశా తను మళ్లీ ఉద్యోగంలో చేరాలని అనుకుంటున్నట్టుంది. పెళ్లయిన రెండేళ్లకి ఆమెకి లెక్చరర్ ఉద్యోగం వచ్చింది. కానీ అప్పుడు ఉద్యోగం చెయ్యాలన్న ఆసక్తి లేక చేరలేదు. దాన్ని గురించే ఇప్పుడు పశ్చాత్తాప పడుతోంది. నాకు లాటరీలో వచ్చిన డబ్బులో మిగిలిన యాభై లక్షలూ రత్నపేర గిఫ్ట్‌చెక్ రాసి

## కొత్తగాలి... 

**కార్పొరేట్
ఆసుపత్రులకి
పేషంటు
ఏటీఎం కార్డు**

– కృష్ణ మాధవరపు,
కాకినాడ

ఫిక్సెడ్ డిపాజిట్లో వేసేశాను. మిగిలిన డబ్బుతో నా కోసం ఒక కారు కొన్నాను.

మళ్లీ జంషెడ్‌పూర్‌కి వెళ్లి ప్రభాస్‌కి ఒక మోటార్‌బైక్ కొనివ్వాలని అనిపించింది. వాడు తనకి నచ్చిన బైక్ కొనుక్కున్నాడు. వాళ్ల పెదనాన్న అప్పు తీర్చేశానని చెప్పినప్పుడు మాత్రం "ఇప్పుడిస్తే మాత్రం ఏం లాభం? కోర్సులో చేరేందుకు డబ్బిచ్చింది ఆయనే కదా! నేను అందుకు జీవితాంతం ఆయనకి రుణపడి ఉంటాను" అన్నాడు.

సమయానికి ఆయన డబ్బివ్వకపోతే తనకి ఈ అవకాశం చిక్కేది కాదని నన్ను దెప్పి పొడవడం అది! వాళ్లమ్మలాగే వీడు కూడా నా మనసుకి కష్టం కలిగించే అవకాశం చిక్కితే వదులుకోడు. స్టేషన్‌కి నన్ను దింపేందుకు వచ్చినప్పుడు గబుక్కున నా పాదాలు తాకి వెంటనే వెళ్లిపోయాడు. యాభైవేలు ఖరీదు చేసే బైకూ, పదివేల రూపాయల నగదూ వాడి మీద చూపిన క్షణికమైన ప్రభావం అనుకున్నాను. వాడి కళ్లల్లో నీళ్లు తిరగడం కూడా గమనించాను. చాలాకాలం తరువాత నా కాళ్లకి దణ్ణం పెట్టాడు. ఎంతోకాలం తరువాత మనసు తేలికైనట్టనిపించింది

ఇంటికొచ్చాను. రత్న మామూలుగానే "ప్రభాస్ ఎలా ఉన్నాడు" అని అడిగింది.

బాధించే విషయాలని ప్రస్తావించకుండా మిగతాదంతా చెప్పాను. ఇబ్బంది కలిగించే సంగతులు ఎప్పుడూ చెప్పను. నా ఉద్యోగంలో పై ఆఫీసర్లతోనూ, రాజకీయవేత్తలతోనూ అనుక్షణం ఇబ్బంది ఉంటూనే ఉంటుంది. ఈ మధ్య రాజకీయాల్లో అసాంఘిక శక్తుల జోక్యం ఎక్కువగా ఉంటోంది. వాళ్లే స్వయంగా చట్టవిరుద్ధమైన పనులు చెయ్యడం వల్ల వాళ్ల కింది అధికారులు కూడా అలాగే ఉండాలని ఒత్తిడి చేస్తారు. ఆఫీసర్లలోనూ చిన్నకారు రౌడీల నుంచీ మహామహా గూండాల దాకా ఉన్నారు. ఇలాంటి వాళ్ల గురించి రత్నకి తెలీకుండా ఉండాలనే నేనెప్పుడూ ప్రయత్నించేవాణ్ణి. చాలాసార్లు రాజకీయనాయకులు నన్ను అవమానించిన సంగతి ఆమెకి మీడియా - టీవీ-పత్రికల ద్వారానే తెలిసేది. అప్పుడామె ఎంతో ఆందోళనకి గురయ్యేది.

లక్ష్మీదేవి మా ఇంట్లోకి ప్రవేశించడం మంచి శకునమనీ, మళ్ళీ మంచి రోజులు మాకు వస్తాయనీ అనిపించింది నాకు. కానీ ఈసారి కూడా నా ఆశ నిరాశే అయింది. నాకు చెప్పకుండా రత్న బ్యాంకు లోంచి డబ్బు తీసి వాళ్ళ అక్క ఉండే ప్రాంతంలోనే ఓ ఫ్లాట్ కొంది. ఆ విషయం మా తోడల్లుడు ద్వారానే తెలిసింది.

"పోన్లెండి! మా ఇంటికి దగ్గర్లోనే మీరు ఫ్లాట్ కొనుక్కున్నారు. ముసలితనంలో ఒకరికొకరం తోడుంటాం!" అన్నాడతను.

నేను అవాక్కయాను. లంచగొండి ఆఫీసర్లు తమ పెళ్ళాం, పిల్లల పేరనో, బంధువుల పేరనో.. చివరకి కొందరు తమ పెంపుడు జంతువుల పేరనో ఆస్తులు కొంటారని నాకు బాగా తెలుసు. నా బాధ రత్న ఫ్లాట్ కొన్నందుకు కాదు! ఆమెకి డబ్బు ఇచ్చింది నేనే! దాన్ని ఆమె తన ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టుకోవచ్చు! కానీ నేను చేసే ఉద్యోగం కత్తి మీద సాములాంటిది. నా భార్య పేరగాని, పిల్లల పేరగాని ఖరీదైన ఆస్తిపాస్తులు కొనేముందు ఆఫీసులోనూ, గవర్నమెంటు వారికీ చెప్పి అనుమతి తీసుకోవాలి. రత్నకి ఆ సంగతి తెలుసు. మారుతీ కారు కొన్నప్పుడు అనుమతి కోసం నేను ఎన్నోసార్లు హెడ్ ఆఫీసుకి వెళ్ళాల్సి వచ్చింది.

అప్పుడు రత్న విసుక్కుంది. "మనం అప్పు తీసుకుంటున్నప్పుడు ఇంకా ఈ అనుమతులూ అవీ ఏమిటి? " అంది.

అలాంటప్పుడు ఇంత ఖరీదైన ఫ్లాట్ కొనేముందు నన్ను అడగలేదు సరికదా కనీసం తను కొంటున్న సంగతి కూడా

# ఇవి డబ్బున్న వారికి మాత్రమే!

చతుర సమాచారం

ప్రపంచంలోని అత్యంత ఖరీదైన అనుభవాలు ఏమిటో మీకు తెలుసా?

★ పదిలక్షల పౌండ్ల ప్యాకేజితో 'యునెస్కో వరల్డ్ హెరిటేజ్ సైట్స్'ని సందర్శించవచ్చు. 150 దేశాలలోని వీటన్నిటినీ చూడడానికి రెండేళ్ళు పడుతుంది. 'వెరీ ఫస్ట్ టూ' ట్రావెల్ ఏజెన్సీ దీన్ని నిర్వహిస్తోంది.

★ స్విట్జర్లాండ్‌లో జెనీవాలోని ప్రెసిడెంట్ విల్సన్ హోటల్‌లోని రాయల్ పెంట్‌హౌస్ సూట్‌లో ఓ రాత్రి గడపడానికి 83,200 డాలర్లు చెల్లించాలి. ప్రైవేట్ లిఫ్ట్, బుల్లెట్ ప్రూఫ్‌గ్లాస్, బట్లర్, ప్రైవేట్ అసిస్టెంట్, వంటవాడు లాంటి సౌకర్యాలు లభిస్తాయి.



★ దుబాయ్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టులో టెర్మినల్ త్రీలోని లీక్లాస్ అనే వైన్‌షాప్‌లో ప్రపంచంలోనే అతి ఖరీదైన వైన్ లభిస్తుంది. షటావ్ మార్గాష్ 2009 బ్రాండ్ 12 లీటర్ల బాటిల్ ఖరీదు 1,95,000 డాలర్లు. దీన్ని కొన్నవారికి ఫ్రాన్స్‌కి ఫస్ట్ క్లాస్ విమానం టిక్కెట్, అక్కడి ద్రాక్షతోటలు, వైనరీలని చూసే సదుపాయాలు కూడా లభిస్తాయి.

★ ఫిజీలోని తేకలా ఐలండ్‌లో పార్టీ ఇవ్వడానికి ఓ రాత్రికి లక్షా 50 వేల డాలర్లు చెల్లించాలి. కనీసం ఐదు రాత్రులు బుక్ చేసుకోవాలి. అక్కడి ఫైవ్‌స్టార్ హోటల్‌లో భోజనం ఉచితం.

★ సింగపూర్ ఎయిర్‌లైన్స్ 23,077 సింగపూర్ డాలర్లకి సింగపూర్ నుంచి న్యూయార్క్‌కి విమానంలో ప్రైవేట్ సూట్‌ని ఇస్తోంది. ఫస్ట్ క్లాస్ కన్నా చాలా ఎక్కువ ధర గల ఇది ప్రపంచంలోని అధిక ధర గల విమానం టిక్కెట్!

★ మొనాకోలోని 'ఓడియన్ టవర్'లోని స్కై పెంట్‌హౌస్ ధర 40 కోట్ల అమెరికన్ డాలర్లు! 38 వేల చదరపు అడుగుల విస్తీర్ణంలోని ఇది ప్రపంచంలో అత్యంత ఖరీదైన పెంట్‌హౌస్.

★ లాస్‌ఏంజెలెస్ నుంచి బయలుదేరి 115 రోజుల్లో, 49 నౌకాశ్రయాల్లో ఆగే 'సిల్వర్ సీస్ వరల్డ్ క్రూజ్' టిక్కెట్ ధర 3,46,500 అమెరికన్ డాలర్లు! తహితి, ఆస్ట్రేలియా, బాలి, హాంకాంగ్, వియత్నాం, థాయ్‌లాండ్, మలేషియా, మాల్దీవులు, జాంజిబార్, మడగాస్కర్, సౌతాఫ్రికా వంటి దేశాల్లో ఇది ఆగుతుంది.

నాకు చెప్పలేదు.

ఇంట్లో రోజూ గొడవలు. వాటి ప్రభావం మా అమ్మాయి మీద పడకూడదన్న ఆలోచనతో దాన్ని హాస్టల్‌లో ఉంచి చదివించాలని అనుకున్నాను. కానీ రత్న అడ్డుపడింది.

"అమ్మాయి కూడా దగ్గర లేకపోతే నాకు ఇంట్లో జైల్లో ఖైదీలా ఉంటుంది" అంది.

నాకు తీరిక దొరికినప్పుడల్లా పిల్లలకి పాఠాలు చెప్పడంవల్ల, మా అబ్బాయీ, అమ్మాయీ లెక్కల్లోనూ, ఇంగ్లీషులోనూ ఎప్పుడూ ఫస్ట్ మార్కులు తెచ్చుకునేవారు. కానీ ఈ మధ్య మా అమ్మాయి నాకు చిక్కకుండా తప్పించుకు తిరుగుతోంది. ఆ విషయం రత్నకి చెప్పాలనుకున్నాను. కానీ ఏమీ లాభం లేదనుకుని ఊరుకున్నాను. నేనేదైనా చెప్పేందుకు ప్రయత్నిస్తే, రత్న వెంటనే అప్రమత్తమయేది. నాకు తల ఒగ్గకూడదన్న నిర్ణయం తీసుకుని మరీ నా మాటలు వినేది. అలాంటి మనిషితో మాట్లాడి మాత్రం ఏం లాభం?

ఎంతైనా నా కూతురే కదా అని ఎప్పుడైనా జోక్యం చేసుకోవాలని అనిపించేది నాకు. 'కానీ, ఏం లాభం లేదు' అంటూ నా మనసే నన్ను వెనక్కి లాగేది. ప్రభాస్ కన్నా స్వప్న ఏడాదిన్నర చిన్న. ప్రస్తుతం

స్కూల్లోనే చదువుతున్నప్పటికీ పొడుగ్గా, ఏపుగా పెరిగింది. ప్రభాస్ నాకన్నా ఒడ్డూ పొడుగూ ఉన్నాడనుకుంటే స్వప్న వాణ్ణి మించిపోయింది. పద్నాలుగేళ్ళకే పద్దెని మిది, పందొమ్మిదేళ్ళు ఉన్నట్టు కనిపించేది. ఏడో క్లాసులోనే పెద్దమనిషి అయిందని రత్న దిగులుపడేది. ఈ రోజుల్లో ఆడపిల్ల లందరిదీ ఇదే తంతు అని లేడీ డాక్టర్ నచ్చ చెప్పేవరకూ ఆమె ఆదుర్దా తగ్గలేదు. మెడికల్ జర్నల్స్‌లో కూడా దీనికి కారణం న్యూక్లియస్ ఫ్యామిలీలూ, టీవీలాంటి మీడియా ప్రభావమేననీ, పిల్లలకి మంచి పౌష్టికాహారం దొరకడం కూడా ఒక కార ణమనీ చెప్పడం వలన మాకు విషయం అర్థమైంది.

స్వప్న ఎప్పుడూ తన పేరుకు తగ్గట్టు కలల లోకంలో విహరిస్తూ ఉండేది. చదువు మీద శ్రద్ధ ఉండేది కాదు. నాలాగే అది కూడా డైరీ రాసేది. ఏడో క్లాసు వరకూ దాని డైరీ తన బల్లమీదే ఉండేది. కానీ ఇప్పుడు దాన్ని ఎక్కడో దాచిపెడు తోంది. రెండు మూడేళ్ళ క్రితం దాని డైరీ తిరగేసి చూశాను. డైరీ తన స్నేహితురా లని స్వప్న అనేది. ఒకసారి ఒక పేజీలో ఇలా రాసుకుంది.

'ప్రతి ఇంట్లోనూ అమ్మానాన్న మా ఇంట్లోలాగే ఎప్పుడూ పోట్లాడుకుంటూనే ఉంటారా? అయినా నువ్వు కూడా నాలాగే ఈ నాలుగు గోడల మధ్యా ఖైదీలా ఉంటున్నావు. నీకు మాత్రం ఎలా తెలుస్తుందిలే? '

ఇది చదివి నాకు ఎంతో బాధ వేసింది. రాత్రి రత్నకి దాన్ని చూపించాను.

"పోట్లాడేది మీరే కదా? మానెయ్యండి" అని అటు తిరిగి పడుకుంది.

స్వప్న ధోరణి రోజురోజుకి ఇంకా ఘోరంగా తయారవుతోంది. చదవటం పూర్తిగా మానేసింది. స్కూలు నుంచి రాగానే పూర్తి వాల్యూమ్‌లో స్టీరియో పెట్టే యడం. నా ఆఫీసు కారుని స్నేహితురాళ్ళ ఇళ్ళకి పంపి, వాళ్ళని ఇంటికి పిలిపించుకో వడం.. అందరూకలిసి తలుపులు మూసు కుని డ్యాన్సులూ, అల్లరీ చెయ్యడం.. ఇదీ తంతు! నా అనుమతి లేకుండా నా ఆఫీసు కారు ఎలా వాడుతోందని మీకు అను మానం రావచ్చు. భార్య గౌరవించని మగాణ్ణి పిల్లలు కూడా లెక్కచెయ్యరు. అంతేకాదు, అతనికి ఆత్మగౌరవం అనేది మిగలకుండా పోతుంది. నా స్థితి అలాం టిదే. నా భార్య, పిల్లలే కాదు, ఆఫీసులో నా సిబ్బందికి కూడా మా ఇంట్లో నా స్థానం ఏమిటో తెలిసినట్లుంది. వాళ్ళు కూడా నన్ను లెక్కచెయ్యడం మానేశారు. రెండేళ్ళ క్రితం ఈ ఊళ్ళో ఉద్యోగంలో చేరి నప్పుడు నేను సిగరెట్ తాగేవాణ్ణి కాను, మద్యం ముట్టేవాణ్ణి కాను. కానీ కొన్ని నెల లుగా రత్నా, ప్రభాస్ నా పట్ల ప్రవర్తించే తీరు నన్ను మనోవ్యాధికి గురిచేసింది. దాన్ని మరిచిపోయేందుకు ఈ చెడు అల వాట్లను ఆశ్రయించక తప్పలేదు. అది పలాయనవాదం కాక మరేమిటి?

పార్టీల్లో ఒక గ్లాసు బీరు తాగడం, ఒకటి రెండు సిగరెట్లు కాల్చడంతో ప్రారంభమైన ఈ అలవాటు ఇప్పుడు ఒక వ్యసనంగా మారింది. మూడేళ్ళుగా ఒకే గదిలో పడు కుంటున్నప్పటికీ, నాకూ, రత్నకీ మధ్య ఎటువంటి శారీరక సంబంధమూ లేదు. పేరుకే మేమిద్దరం భార్యాభర్తలం. పుట్టిన రోజులకి, పెళ్ళిరోజులకీ ఒకళ్ళకి ఒకళ్ళం కానుకలు ఇచ్చిపుచ్చుకునే వాళ్ళం. ఏడా దిలో ఏ ఒక్కసారో శారీరకంగా దగ్గర యినా అది రత్న చొరవ తీసుకున్నప్పుడే!

ఒకరోజు నాకు ఎంతకీ నిద్ర పట్టలేదు. ఏదో కాలుతున్న వాసన వస్తున్నట్టు అని పించి ముందు వంటింట్లోకి వెళ్ళి చూశాను. అక్కడ ఏమీ కనిపించకపోయే సరికి స్వప్న గదిలోకి వెళ్ళాను. స్వప్న రగ్గులో దూరి పడుకుని ఉంది. రగ్గు మీద

కాలుతున్న సిగరెట్ పీక కనిపించింది. తలుపు తీసిన చప్పుడుకి రత్నకి కూడా మెలకువ వచ్చింది. స్వప్న గదిలోకి ఆమె రాగానే సిగరెట్టు చూపించాను.

"కూతురికి తండ్రి పోలిక రాక ఏం వస్తుంది?" అని వెటకారంగా అంటూ బయటికి వెళ్ళిపోయింది.

రగ్గుని తీసి కింద పడేసి కాలితో మంట ఆర్పాను. ఆ అలికిడికి స్వప్న మేలుకుంది. వెంటనే ఏం జరిగిందో గ్రహించి మంచం మీంచి దిగింది. మరుక్షణం నన్ను చుట్టేసుని, "సారీ డాడీ! ఐ యామ్ రియల్లీ సారీ!" అంటూ ఏడవడం మొదలుపెట్టింది. తరువాత ఏడుపు ఆపి "ఇక నుంచీ బుద్ధిగా చదువుకుంటాను డాడీ! ఇలాంటి పని ఇంకెప్పుడూ చెయ్యను, ప్రామిస్!" అంటూ మళ్ళీ ఏడుపు లంకించుకుంది. దాన్ని సముదాయించి మంచం మీద పడుకోబెట్టి మరో రగ్గు తెచ్చి కప్పి, తల నిమురుతూ కూర్చున్నాను. ఎందుకో నాకు తెలీదు, నా కళ్ళు ధారగా వర్షించసాగాయి. స్వప్న కాసేపటికి నిద్రపోయింది. నేను తెల్లారేదాకా అలా ఏడుస్తూనే ఉండిపోయాను. లేచి నా గదిలోకి వెళ్ళాను. రత్న హాయిగా గురకపెట్టి నిద్రపోతుండడాన్ని గమనించాను.

ఆ రాత్రి తరువాత స్వప్నలో మార్పు వస్తుందని అనుకున్నాను. కానీ అలాంటిదేమీ కనిపించలేదు. కొన్నాళ్ళు నన్ను తప్పించుకు తిరిగింది. ఆ తరువాత పరిస్థితి మళ్ళీ మొదటికే వచ్చింది. నేను అవసరం ఉన్నా లేకపోయినా స్వప్న గదిలోకి వెళ్ళడం మొదలుపెట్టాను. తన స్నేహితురాళ్ళు వచ్చినప్పుడు కూడా అలా వెళ్ళడం మానలేదు. అది దానికి నచ్చలేదు. నిజానికి పిల్లల్ని సరైన దారిలో పెట్టడం ఎలాగో తల్లికి సహజంగానే తెలుస్తుంది. తండ్రి ఆ పని అంత బాగా చెయ్యలేడు. ఎందుకంటే ఒక వయసు వచ్చే వరకు పిల్లలు తల్లితోనే ఎక్కువ సన్నిహితంగా

## కొత్తగాలి...

**నాయకులు కట్టిన**
**గాలిమేడలు!**
**పేదలపై పడిన**
**నీలినీడలు!**

– వి. శ్రీనివాసరావు,
అలికాం, శ్రీకాకుళం జిల్లా

ఉంటారు. పిల్లల్ని ఎప్పుడు మందలించాలో? ఎలా మందలించాలో? ఎప్పుడు ప్రేమగా చెపితే మాట వింటారో? ఎప్పుడు కోప్పడి, బెదిరించి మాట వినేటట్టు చెయ్యాలో? తల్లికే తెలుస్తుంది. కానీ మా ఇంట్లో తల్లికి ఏమీ పట్టినట్టు లేదు. పైగా పిల్లల మనసులని నాపట్ల విరిచేసి నా మనసుని బాధపెట్టి ఆనందించడమే ఆమె ధ్యేయంగా కనబడుతోంది.

నేను అదేపనిగా తనని గమనించటం చూసి ఒకరోజు స్వప్న నా మీద ఒంటికాలి మీద లేచింది. "డాడీ! ఈ ఇంట్లో నేనింక ఒక్కక్షణం కూడా బతకలేను. నన్ను ఏదైనా రెసిడెన్షియల్ స్కూల్‌కి పంపెయ్యండి" అని అరిచింది.

"మీ అమ్మని అడుగు!" అని జవాబు చెప్పాను.

అది విని దాని కోపం తారస్థాయికి చేరుకుంది. "వాట్ సార్ట్ ఆఫ్ మ్యాన్ ఆర్ యూ? ఏ విషయంలోనూ సొంత నిర్ణయం తీసుకోలేవా? మీ కమిషనర్, సి.ఎం. దగ్గర సరే! చివరికి నీ పెళ్ళాం దగ్గర కూడా పర్మిషన్ తీసుకుంటే గానీ ఏమీ చెయ్యలేవా? ఐ హేట్ యూ.. ఐ హేట్ సచ్ ఎ ఫాదర్!" అని విసురుగా గది లోంచి వెళ్ళిపోయింది.

అలా మాట్లాడుతున్నప్పుడు అచ్చం

వాళ్ళమ్మకి ఫోటోకాపీలా కనిపించింది.

నా మీద నాకు పట్టారాని కోపం వచ్చింది. నా పిరికితనం వల్లే సమస్య ఇంత జటిలంగా మారింది. పిరికి మగాడు చేసే పని ఒకటే! అది పెళ్ళాం మీద చెయ్యెత్తడం! వెంటనే మా పడక గదిలోకి వెళ్ళాను. రత్న అక్కడ టీ తాగుతోంది. నేను పిచ్చికోపంతో ఊగిపోతూ ఆమె మొహం మీద చాచి లెంపకాయ కొట్టాను. టీ కప్పు దూరంగా వెళ్ళి భళ్ళుమని పడింది. రత్న తల గోడకి బలంగా కొట్టుకుంది. తల చిట్లి రత్న మంచం మీద ఒరిగిపోయింది. కోపంలో నాకు ఒళ్లు తెలీదు. కావాలనే పెద్ద దెబ్బ తగిలినట్టు నటిస్తోందని నాకు అనిపించింది. కానీ చాలా సేపటి వరకూ అలాగే కదలక మెదలక ఉండిపోయేసరికి, దగ్గరకెళ్ళి కుదిపాను. ఆమెలో చలనం లేదు. స్పృహ కోల్పోయి ఉంది. తల నుంచి రక్తం కారుతోంది. ఇక నాకు మూర్ఛ వచ్చినంత పనైంది. మొహం మీద నీళ్ళు జల్లేసరికి రత్నకి స్పృహ వచ్చింది. నేను మళ్ళీ కొడతానని భయపడ్డట్టుంది. రెండు చేతులతోనూ తలని కాపాడుకునేందుకు ప్రయత్నించసాగింది.

రత్నకి అంత పెద్ద దెబ్బ తగిలేసరికి నా కోపం కాస్తా చల్లారిపోయింది. చేసిన మూర్ఖపు పనికి సిగ్గుపడ్డాను. దీనికి రత్న ఎలా రియాక్ట్ అవుతోందోనన్న భయం మరోవైపు నన్ను పీడించసాగింది. వెంటనే మా డాక్టర్‌కి ఫోన్ చేశాను. అతను రత్నని చెకప్ చేశాక ఆస్పత్రిలో చేర్పించమని సలహా ఇచ్చాడు. ఆ డాక్టర్ నా స్నేహితుడే కాబట్టి పెద్దగా ప్రశ్నలేవీ అడగలేదు. ఎక్స్‌రే, సిటి స్కాన్ చేసి కుట్లువేశారు. కళ్ళు తిరిగి కింద పడిపోయానని రత్నే డాక్టర్‌కి చెప్పింది. అది విని డాక్టర్ నా వైపు చూశాడు. అతనికి అసలు విషయం తెలిసిపోయిందని నాకు అనిపించింది. రోజుకి కొన్ని వందల మందిని చూసే డాక్టర్ అతను. అతనికి నిజంగానే అసలు విషయం తెలిసిపోయిందా? లేక తప్పు చేసినందువల్ల నాకలా అనిపిస్తోందా? అనేది ఆ దేవుడికే తెలియాలి.

ఆ ప్రమాదం జరిగాక రత్నకి క్షమాపణ చెప్పాను. ఆమె ముభావంగా ఉండడం మొదలుపెట్టింది. "నువ్వంటే నాకు చాలా ఇష్టం! కానీ నువ్వు నన్ను ఎప్పుడూ ఎందుకిలా బాధ పెడుతూ ఉంటావు? చిన్న విషయాల దగ్గర్నించి పెద్ద విషయాల దాకా నాకు అన్నిటికీ ఎదురు చెబుతావు..!" అంటూ నేనలా మాట్లాడుతూనే ఉన్నాను. తను మౌనంగా వింటూ ఉండిపోయింది. మళ్ళీ వాళ్ళ పిన్ని విషయం ప్రస్తావిస్తూ.. "మీ పిన్నితో నేనా వ్యవహారం నడిపినప్పుడు నువ్వు పిక్చర్‌లో లేవు! నువ్వు నాకు, నేను నీకు తెలీదు. ఏదో వ్యామోహంలో నేను చేసిన కుప్రచేష్ట అది. నాదెంత తప్పు ఉందో మీ ఇంట్లో మీ పెద్ద వాళ్ళ తప్పు కూడా అంతే ఉంది! కానీ వాళ్ళని నువ్వేమీ అనవు. వాళ్ళని బాధ పెట్టవు. పైగా వాళ్ళు చెప్పినట్టు వింటావు. నేను జీవితంలో తప్పు చేసింది ఒక్కసారే! మళ్ళీ మళ్ళీ చెయ్యలేదు కదా! చూడు, మొదటిసారి ఒక పెద్ద మొత్తం నా చేతికొచ్చిన వెంటనే అంతా (యాభైలక్షలు అనే మాట నాలిక చివరిదాకా వచ్చింది. కానీ రత్న బాధపడుతుందని దాన్ని తొక్కిపెట్టాను) నీ పేర పెట్టేశాను. అవునా? " అన్నాను.

చివరి వాక్యం విని రత్న నన్ను కళ్ళెర్ర చేసి చూసింది. "అంటే అది మీరు నాకు చేసిన అన్యాయానికి పరిహారంగా ఇచ్చానంటున్నారా? అయితే మీరు నేరం చేసినట్టు ఒప్పుకున్నట్టే కదా!" అంది.

ఆమె మాటలు ఈటెల్లా గుండెలో గుచ్చుకున్నాయి. కోపం ముంచుకొచ్చింది. మళ్ళీ నా చెయ్యి లేస్తుందేమోనని భయ

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# ఆసాంతం అనుభూతిసాంద్రం!




అక్కినపల్లి సుబ్బారావు నవల 'ఆవలి అంచు' ఓ ఆణిముత్యం! వాస్తవికతకు, జీవితానుభవాలకు దగ్గరగా ఉండి సహజత్వాన్ని ప్రతిబింబిస్తోంది. ఎన్నారైల జీవితాలకు అద్దంపట్టే ఈ నవల చదువుతున్నంతసేపూ నిజజీవితంలో జరిగిన సంఘటనలను రచయిత మనకు చెబుతున్నట్టే ఉంటుంది. ఈ నవలలో ప్రధానపాత్రలైన కృష్ణారావు, అతని తమ్ముడు రామారావుల జీవితపు భిన్న పార్శ్వాలను హృద్యంగా ఆవిష్కరించారు. అమెరికాలో యాంత్రిక జీవితానికి విసుగు చెంది ఇండియాకు వచ్చిన కృష్ణారావూ, కొడుకు దగ్గర తమ శేష జీవితాన్ని గడపాలని అమెరికా వెళ్లిన రామారావు దంపతులూ ఆయా దేశాల్లో ఇమడలేక మళ్లీ వెనక్కి వెళ్లిపోవడానికి గల కారణాలను రచయిత నవలలో గుదిగుచ్చిన తీరు శ్లాఘనీయం.

నేడు ఎంతో మంది ప్రవాసాంధ్రులు అక్కడి యాంత్రిక జీవనవిధాన చట్రంలో చిక్కుకుని విలువైన అనుబంధాలకు దూరం అవుతున్నారనేది నగ్నసత్యం. ఉన్నత చదువులు, ఉద్యోగాల కోసం అమెరికా వెళ్లి అక్కడ స్థిరపడిపోయేవారే ఎక్కువగా ఇలాంటి సమస్యల్ని ఎదుర్కొంటున్నారు.

ముఖ్యంగా పిల్లల పెళ్లిళ్లు వారికి పెద్ద సమస్యగా మారుతోంది. కొడుకు, కోడలితో మనసు విప్పి మాట్లాడుకోలేని రామారావు దంపతుల పరిస్థితుల్ని, వాళ్ల మనవడు అనంత్ ప్రవర్తనని, ఒంటరితనంతో బాధపడే కృష్ణారావు, లాయర్ కవితలు ఒకేగూటి పక్షుల్లా ఒక చోటుకు చేరడానికి దారితీసిన పరిస్థితుల్ని అక్షరీకరించిన తీరు ఆలోచింపచేసేదిగా ఉంది. ఆసాంతం అనుభూతిసాంద్రంగా సాగే ఈ నవల పాఠకుల హృదయాల్లో చిరస్మరణీయంగా ఉంటుందనడంలో అతిశయోక్తి లేదు.

పెద్దకథ 'గాజుసీసా' ఉత్కంఠభరితంగా సాగింది. చతురకత 'నాగమ్మ ఆంగ్లం' మన సారా నవ్వుకునేట్లు చేసింది. 'నవలావలోకనం, కాలాతీతం' శీర్షికల్లోని నవలలపై విశ్లేషణలు ఆకట్టుకున్నాయి. ఇంకా 'కొత్తగాలి, చతుర 'సమ్'గతులు, అక్షరం, చమత్'కారం' భామనే.. సత్యభామనే..!' శీర్షికలు పసందుగా ఉన్నాయి. 'టెక్ గురూ!' విజ్ఞానదాయకం.



'చతుర ప్ర.జ.' ఆధ్యాత్మికాభిమానులకు విలువైన శీర్షిక. వీటన్నిటితో పాటు నీహారిక ముఖచిత్రంతో ముస్తాబైన 'చతుర' సర్వాంగ సుందరంగా ఉంది.

– పి.వి. ప్రసాద్,
విజయవాడ

పడి ఇంట్లోంచి బయటికెళ్ళిపోయాను.

రత్న కోలుకునేందుకు దాదాపు నెలరోజులు పట్టింది. ఆమెకి తగిలింది చిన్న దెబ్బ అనను. కానీ అన్ని సౌకర్యాలూ ఉన్న ధనవంతులకి ఎక్కువ కాలం జబ్బు పడే వెసులుబాటు.. ఎంతో కాలం విశ్రాంతి తీసుకునే అవకాశం ఉంటుంది. రత్న స్థానంలో ఒక పేద కూలీమనిషి ఉండి ఉంటే మర్నాడే ఆమె పనిలోకి వెళ్ళక తప్పేది కాదేమో!

ఆ సంఘటన జరిగిన తరువాత రత్నకి నా పట్ల ఉన్న అసహ్యం, నిర్లక్ష్య భావం బాగా పెరిగిపోయాయి. నాతో హద్దుమీరి ప్రవర్తించసాగింది. డాక్టర్ వేసుకోమన్న మందులు చేతికిచ్చినా వెంటనే వేసుకోకుండా గంటలు గంటలు తాత్సారం చెయ్యడం, ఏదైనా అడిగితే వెంటనే సమాధానం ఇవ్వకపోవడం.. నేను తన చుట్టుపక్కల ఉండడమే తను భరించలేనట్టు తెలియజేయడానికేనని నాకు అనిపించేది. ప్రభాస్ సెలవులకి ఇంటికొచ్చాడు. కానీ వాడు కూడా నాతో ఎడమొహం పెడమొహంగానే ఉండసాగాడు. ఆ తల్లీకొడుకులతో ఏమైనా మాట్లాడటం శుద్ధదండగ వ్యవహారం అనిపించింది.

నాకు టైంకి భోజనం చేసే అలవాటు ఎప్పటి నుంచో ఉంది. భోజనాల బల్ల దగ్గర కూర్చుని తినకుండా ఇంకొకరి కోసం వేచి ఉండటం నాకు సుతరామూ నచ్చదు. కానీ పిల్లల్ని ఎన్నిసార్లు భోజనానికి రమ్మని పిలిచినా వెంటనే రారు. అరగంటసేపు ఏదో పనున్నట్టు నటిస్తారు. బల్ల మీద అన్నీ సర్దే సమయానికి ప్రభాస్ బయటికి వెళ్ళిపోతాడు. స్వప్న బాత్‌రూమ్‌లో దూరుతుంది. ఇక వాళ్ళతో కాదని నా భోజనం నేను కానిచ్చెయ్యడం మొదలెట్టాను. అసలు వాళ్ళు బయటే తింటారో? పిజ్జాలూ అవీ తెప్పించుకుంటారో? ఏపూట ఏం చేస్తారో? ఎవరికీ తెలీదు. రత్న నాతోబాటు భోజనానికి కూర్చుని రెండు ముద్దలు తిని నా భోజనం అయ్యేదాకా దిక్కులు చూస్తూ కూర్చుంటుందే తప్ప నోరు తెరిచి ఒక్కమాట మాట్లాడదు. నా ఇంట్లోనే నేను పరాయివాడిలా బతకసాగాను.

ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోతలాగ తయారైంది నా బతుకు. ఇక దీన్ని భరించడం నావల్ల కాదనిపించింది. రత్నకీ, పిల్లలకీ నేను తీర్చవలసిన బాకీ ఏమైనా మిగిలి ఉంటే అది పై జన్మలో తీర్చుకుంటానని మనసులో అనుకున్నాను. నాన్న నాకు 'నరోత్తమ్' అనే పేరు ఎందుకు పెట్టాడోగానీ ఇంట్లోవాళ్ళకి ఉత్తముడిని కాదు కదా! అసలు మనిషిలాగే కనిపించడం లేదు నేను! బహుశా నేను వాళ్ళకి వానరుడిలా కనిపిస్తున్నానేమో తెలీదు. కోతుల్ని ఆడించేవాడు అవి పారిపోకుండా వాటి మెడలో ఉచ్చువేసి వాటిని ఆడిస్తాడు. నన్ను కూడా కర్తవ్యం, బాధ్యత అనే తాళ్ళతో కట్టేసి ఇష్టం వచ్చినట్టు ఆడిస్తున్నారు వీళ్ళు. బతికుండి ఏం లాభం లేదు. అందుకే ఆత్మహత్య చేసుకోబోతున్నాను. నాకు వేరే దారి లేదు. జీవితంపై విసుగుపుట్టింది. ఇక జీవించాలని లేదు.

- నరోత్తమ్

***14 జనవరి 1992***

రాత్రి పన్నెండు గంటల ముప్పై నిమిషాలు

★ ★ ★

డైరీ చదివి మూసేశాక నా ముందు జవాబులేని ఎన్నో ప్రశ్నలు నిలిచాయి. అప్పటికి తెల్లవారుజామున నాలుగయింది. వ్యాస్ వాళ్ళంతా ఉదయం ఏడు గంటల కల్లా విమానం దిగుతారు. అక్కణ్ణించి కారులో ఇంటికి చేరుకునేందుకు మరో రెండు గంటలు పట్టొచ్చు. గిరిధారి నా పక్కనే నేల మీదికి ఒరిగిపోయి నిద్రపోతున్నాడు. వ్యాస్ కుటుంబం ఇంటికి

## ప్రపంచంలో ఆఖరివి..!

చతుర సమగతుల

మొదలు ఎలా ఉంటుందో అలాగే ప్రతీదానికి తుది కూడా ఉంటుంది. ప్రపంచంలోని కొన్ని సంఘటనలకి చెందిన ఆఖరి విషయాలకి సంబంధించినవి ఇవి.

★ ఫ్రాన్స్‌లో గిలెటెన్ ద్వారా మరణశిక్ష పొందిన ఆఖరి వ్యక్తి హమీదా జాన్‌డుబీ. టునీషియా నుంచి వలస వచ్చిన ఇతను తన గర్ల్ ఫ్రెండ్‌ని చంపినందుకు 1977లో మార్సెయిల్స్‌లో ఈ శిక్షని అమలు పరిచారు.



★ మొదటి ప్రపంచయుద్ధంలో 4లక్షల 70 వేలమంది అమెరికన్ సైనికులు పాల్గొన్నారు. వారిలో 2011 వరకు జీవించి ఉన్న ఆఖరి వ్యక్తి ఫ్రాంక్ ఉడ్‌రఫ్ బకిల్స్. ఇతను 2011 ఫిబ్రవరి 27న మరణించాడు.

★ చంద్రుడి మీద కాలు పెట్టిన ఆఖరివ్యక్తి ఆమెరికన్ కమాండర్ హేరిసన్ స్మిత్. డిసెంబర్ 1972 తర్వాత మరో మనిషి చంద్రుడి మీద కాలు పెట్టలేదు.

★ ప్రపంచంలో చేతిరాతతో నడిచే ఆఖరి దినపత్రిక 'ది ముసల్మాన్'- ఉర్దూ భాషలోని నాలుగు పేజీల ఈ పత్రిక సర్క్యులేషన్ 22 వేలు. ఇది చెన్నై నుంచి వెలువడుతుంది.

★ అండమాన్‌లోని అకాబో అనే ప్రాంతీయ భాష మరణించింది. 85 ఏళ్ళ జావా అనే ఆవిడ దీన్ని ఆఖరిసారిగా మాట్లాడింది. ఆవిడ మరణంతో ఈ భాష కూడా మరణించింది.

★ మశూచికి వేక్సిన్ కనుక్కోవడంతో 1979నుంచి ఇది అంతరించింది. మశూచి ఆఖరి రోగి బంగ్లాదేశ్‌కి చెందిన రహీమబానో అనే బాలుడు. 1975లో మశూచి సోకిన ఇతనికి వేక్సిన్ ఇవ్వడం వల్ల ప్రాణాలతో బయటపడ్డాడు.

★ ఆఖరి అటామిక్ బాంబ్‌ని ఆగష్టు 9, 1945లో అమెరికా, జపాన్‌లోని నాగసాకి మీద వేసింది.

★ అమెరికాలో బానిసత్వాన్ని నిషేధించిన ఆఖరి రాష్ట్రం మిసిసిపీ. 1995లో దీన్ని అధికారికంగా నిషేధించారు.

★ చేతులతో నడిపే ఆఖరి నౌక నేటికీ ఇంగ్లండ్- స్కాట్లండ్‌ల మధ్య తిరుగుతోంది. 1947లో తయారైన దీని పేరు పియస్ వేవర్లీ. పర్యాటకుల కోసం ఇది నడుస్తోంది.

---

వచ్చాక నాకు చెపుతాడో? లేదో? అని వాడిని లేపి "ఈ డైరీ నీకెక్కడ దొరికింది? ఈయన నీకెలా తెలుసు? ఇందులో తను ఆత్మహత్య చేసుకోబోతున్నానని రాశాడే? మరి ఆ తరువాత ఏమైంది? వ్యాస్‌గారు ఈయనకి ఏమవుతారు? " అని ప్రశ్నల వర్షం కురిపించాను.

అన్ని ప్రశ్నలు ఒకేసారి అడగటంతో అసలే నిద్రమత్తు ఇంకా వదలని గిరిధారి అయోమయంగా నా వైపు చూడసాగాడు.

కాసేపటికి తేరుకుని గిరిధారి నాతో తనకు తెలిసింది చెప్పసాగాడు.

"బాబూ! నేను కలెక్టర్‌గారి దగ్గర డ్రైవర్‌గా పనిచేసేవాణ్ణి. ఆ అర్ధరాత్రి మాత్రం ఆయన కారు తనే నడుపుకుంటూ నా క్వార్టర్స్‌కి వచ్చి, ఈ డైరీని నాకు ఇచ్చారు. దానిని తన ప్రాణస్నేహితుడు గజేంద్రబాబు గారికి ఇమ్మని చెప్పారు. కారులో ఒక్కరే అంత రాత్రివేళ ఎక్కడికి వెళ్తున్నారో? నన్ను కారు నడపమని ఎందుకు అడగలేదో? అప్పుడు నాకేమీ అర్థం కాలేదు. ఒక డ్రైవర్‌గా బాబుగారిని అవన్నీ అడిగేందుకు జంకాను. డైరీని మాత్రం జాగ్రత్తగా మా ఇంట్లో దాచిపెట్టాను. ఉదయం కలెక్టర్‌గారింట్లో ఏదో హడావిడి జరుగుతోంది. ఏమిటా? అని చూసేం

దుకు పరిగెత్తాను. అమ్మగారికి అయ్యగారు రాసిన చీటీ దొరికింది. ముందు ఆవిడ దాన్ని నమ్మలేదు. కానీ పది గంటల ప్రాంతంలో అయ్యగారి కారు నర్మదా నది వంతెన మీద కనిపించిందన్న వార్త తెలిసి ఆవిడ వెంటనే ఆ చీటీని పోలీసులకిచ్చి దర్యాప్తు చెయ్యమని చెప్పింది. కొన్నిరోజులు గడిచిపోయాయి. కానీ బాబుగారి ఆచూకీ తెలీలేదు. పదిరోజుల తరువాత ఒక చిన్నపల్లెలో నది ఒడ్డున అయ్యగారు గాయాలతో పడి ఉండటం ఆ ఊళ్ళో వాళ్ళు చూసి పోలీసులకి తెలిపారు. ఆయన అపస్మారక స్థితిలో ఉన్నారు. ఆస్పత్రికి తీసుకెళ్ళి వైద్యం చేశాక స్పృహ వచ్చింది. కానీ ఆయన నోటివెంట 'ఏం లాభం లేదు' అనే మాట తప్ప మరో మాట రాలేదు. డాక్టర్లు ఆ యన్ని పరీక్షించారు. కానీ వాళ్ళకి ఏమీ అంతుపట్టలేదు.

ఆయన ప్రాణానికి ఇంక ముప్పులేదని తెలిశాక అమ్మగారు పిల్లల్ని తీసుకుని ఎవరికీ ఏమీ చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోయారు. మళ్ళీ మాకెవరికీ కనిపించలేదామె. ఆయనకి తోడుగా నేను ఇక్కడే ఉండిపోయాను.

బాబుగారి ఉద్యోగం పోయింది. ఇంట్లో మేమిద్దరమే! ఆయన పరిస్థితి రోజురోజుకీ అధ్వానంగా తయారవసాగింది. నేనా చదువుసంధ్యలు లేనివాణ్ణి. ఏం చెయ్యాలో పాలుపోక గజేంద్రగారికి ఫోన్ చేశాను. బాబుగారూ.. గజేంద్రగారూ రామలక్ష్మణుల్లా ఉండటం నాకు తెలుసు. ప్రస్తుతం ఆయన వేరే చోట దూరంగా ఉంటున్నా, నేను ఫోన్ చెయ్యగానే ఆయన పరిగెత్తుకుని వచ్చారు. బాబుగారి పరిస్థితి చూసి చలించిపోయారు. బాబుగారి ఉద్యోగం హఠాత్తుగా పోయినా, ప్రభుత్వం ఆయనకి పెన్షన్ ఇవ్వాల్సి ఉందని చెప్పి దాని విషయం చూశారు. ఆఫీసుల చుట్టూ తిరిగి బాబుగారి డబ్బుని రాబట్టారు.



బాబుగారితో పాటు నన్ను కూడా తీసు కెళ్ళి వాళ్ళింట్లో ఉంచుకున్నారు. బాబు గారు ఆయనకి అందజేయమన్న డైరీ విషయం ఆ గొడవల్లో పూర్తిగా మరచిపో యాను. అది నా దగ్గరే ఉండిపోయింది. ఈలోగా గజేంద్రగారు ప్రమాదంలో మర ణించారు! ఎందుకో ఆ దేవుడు మంచివా ళ్ళనే తన వద్దకు ముందుగా పిలిపించు కుంటాడు. లేదా వాళ్ళకే అన్ని కష్టాలనీ కలగచేస్తుంటాడు. మా కలెక్టర్‌బాబుగారు ఎంత మంచిమనిషి! ఎంత నిజాయితీప రుడు! ఎప్పుడూ పేదవారికి సాయం చేసే వారు. అటువంటి వ్యక్తి మతిస్థిమితం కోల్పోయేటట్టు చేశాడు ఆ దేవుడు!" అని చెప్పాక గిరిధారి ఆగాడు.

"మరి ఈ వ్యాస్‌గారు కలెక్టర్‌గారికి ఏమవుతారు? " అని అడిగాను.

"వ్యాస్ బాబుగారు అయ్యగారికి ఏమీ కారు! గతంలో అయ్యగారు కొంతకాలం టీచర్‌గా పనిచేశారు. అప్పుడీయన అయ్య గారి స్టూడెంట్. అయ్యగారు ఈయన చదువుకునేందుకు డబ్బు సాయం కూడా చేశారు. అందుకే వ్యాస్‌గారికి అయ్యగా రంటే చాలా గౌరవం. గజేంద్రగారు పోయాక ఈయన అయ్యగారిని తన ఇంటికి తీసుకొచ్చారు. కన్నకొడుకు కన్నా ఎక్కువగా ఈయనకి



సేవ చేశారు. మీరూ చూస్తూనే ఉన్నా రుగా!" అని ముగించాడు.

ఇంతలో వ్యాస్‌గారు కుటుంబ సమేతంగా వచ్చేశాడు. వస్తూనే నరోత్తమ్ గారి కాళ్లమీద పడి వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టాడు.

నేను అతన్ని తనివితీరా ఏకాంతంగా ఏడవనివ్వడమే మంచిదనుకుని బయటికి వెళ్ళిపోయాను.

కలెక్టర్‌గారు పోయాక ఇక ఆయన కథ ముగిసిపోయిందనే అనుకున్నాను. కానీ నేను విన్నదీ, తెలుసుకున్నదీ ఏకపక్ష ఉదంతం మాత్రమే! రత్నగారు చెప్పే కథేమిటో? ఆమె ఎందుకలా ప్రవర్తించవలసి వచ్చిందో? తెలుసుకోవాలన్న కుతూహలం నా మనసుని సహజంగానే పురుగులా తొలచివెయ్యడం మొదలుపెట్టింది.

అప్పుడు ఉద్యోగరీత్యా నేను మరోచోటుకి వెళ్ళవలసి వచ్చింది. కానీ ఎక్కడా ఒకచోట స్థిరంగా ఉండే మనస్తత్వం కాదు కదా నాది! అందుకే కొన్నాళ్ళు అక్కడ పని చేశాక ఉద్యోగం మానేశాను. మళ్ళీ నా నిరుద్యోగపర్వం ప్రారంభమైంది. ఏ పనీ లేక, తోచక ఒకనాటి సాయంకాలం అల్మారాలోంచి నరోత్తమ్‌గారి డైరీ తీసి మళ్ళీ చదవసాగాను. దాన్ని చదువుతున్న కొద్దీ వారి శ్రీమతి రత్నగారి గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవాలన్న ఉబలాటం పెరిగిపోయింది. కానీ రత్నగారి పుట్టింటి చిరునామా డైరీలో ఎక్కడా లేదు. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తుండగా, వ్యాస్‌గారు గుర్తొచ్చారు. ఆయనకి తప్పక తెలిసే వుంటుంది. అనుకోవడమే తరువాయి.. 'లేడికి లేచిందే పరుగు'అన్నట్లు, తత్కాల్‌లో టికెట్ బుక్‌చేసుకుని జబల్‌పూర్‌కి బయలుదేరాను.

తీరా అక్కడికి వెళ్ళాక వ్యాస్‌గారికి ఢిల్లీ బదిలీ అయిందని తెలిసింది. ఆయన ఢిల్లీ ఆఫీసు చిరునామా సంపాదించేందుకు రెండు మూడు రోజులు పట్టింది. మరో మజిలీ వైపు ప్రయాణం మొదలైంది.

'పని లేని మంగలి పిల్లి తలగొరిగాడు' అన్నట్టు వెంటనే బయలుదేరాను. ఢిల్లీ చేరుకున్నాక రత్నా వాళ్ళిల్లు కనుక్కునేసరికి నా తల ప్రాణం తోకకొచ్చింది. అయితే రత్నగారి కుటుంబం అక్కడ ఉండటం లేదు. రత్నగారి తండ్రి పోయాక, వాళ్లింట్లో అద్దెకున్నవాళ్లు తప్పుడు డాక్యుమెంట్లు సృష్టించి వాటి ఆధారంతో ఇల్లంతా ఆక్రమించుకున్నారనీ, రత్నావాళ్ళ అమ్మ కోర్టుల చుట్టూ తిరుగుతోందనీ చాలా కష్టపడి సమాచారం రాబట్టాను. వాళ్ళ లాయర్ ఆచూకీ తెలుసుకుని ఆయన్ని కలిశాను. ఫలానా రోజున కేసు విచారణకొస్తుందనీ, కోర్టుకొస్తే రత్నావాళ్ళమ్మని కలుసుకోవచ్చనీ అతను చెపితే, ఆ సమయానికి కోర్టు చేరుకున్నాను. రత్నావాళ్ళమ్మ తన పని అయిపోయాక బయటికి వచ్చింది. నన్ను పరిచయం చేసుకుని రత్నగారిని కలుసుకునేందుకు వచ్చాననీ, నరోత్తమ్, వ్యాస్‌గార్లు నాకు బాగా తెలుసుననీ చెప్పేసరికి, ఆవిడ కళ్ళు చెమర్చాయి.

"కనీసం ఎవరో ఒకరు నా కూతుర్ని పట్టించుకుని, దాన్ని వెతుక్కుంటూ ఇంత దూరం వచ్చినందుకు సంతోషంగా ఉంది నాయనా!" అందావిడ గద్గద స్వరంతో.

చేతులు జోడించి నేనామెకి నమస్కరిస్తూ "అమ్మా! రత్నగారిని కలుసుకోవాలి! మీరు సాయం చేస్తారా? " అని వినమ్రంగా అడిగాను.

"అలాగే! కానీ రత్న ఇక్కడ లేదు. మధురలో ఉంది. మరి నువ్వు నాతో అక్కడికి రాగలవా? " అందామె.

నాకు వేరే పనేముంది? అసలు నేను అక్కడికి వచ్చింది ఆ పని మీదే కదా! "సరే" అన్నాను.

వాళ్ళ కారులోనే ఇద్దరం మధుర చేరుకున్నాం. ఇల్లు చేరేసరికి బాగా పొద్దుపో

యింది. రాత్రికి ఏ హోటల్లో ఉండాలా అని నేను ఆలోచిస్తూండగానే, పెద్దావిడ తన పనిమనిషిని పిలిచి, "మన గెస్ట్‌రూమ్ వీరి కోసం సిద్ధం చెయ్యి" అని పురమాయించింది.

కొంతసేపటికి పనిమనిషి వచ్చి గదిలో అన్నీ సర్దేశానని చెప్పింది. పెద్దావిడ వెంట ఆ గదిలోకి వెళ్ళాను. గది చాలా శుభ్రంగా, అందంగా అలంకరించి ఉంది. చూడగానే ఇంటి యజమాని అభిరుచి తెలిసేటట్టు అందంగా ఉండటంతోపాటు, గదిలో అన్ని సౌకర్యాలూ ఉన్నాయి.

"నాయనా! ముందు కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కో! బాగా ఆలస్యం అయింది. భోజనం చేశాక రత్న దగ్గరికి వెళ్దాం!" అందామె.

నాకర్థం కాలేదు. రత్నగారు మాతో బాటు భోజనం చెయ్యదా? ఇంతకీ ఆమె ఎక్కడున్నట్టు? అడిగితే అతి చనువు తీసుకుంటున్నానని పెద్దావిడ అనుకుంటుందేమోనని ఊరుకున్నాను.

భోజనాలయాక ఇక రత్నగారిని చూడకుండా ఉండడం నావల్ల కాదనిపించింది. పెద్దావిడ నా మనసు గ్రహించిన దానిలా "ఇన్నేళ్ళకి నరోత్తమ్ పరిచయస్తుడినని చెప్పుకుంటూ మా రత్నని కలిసేందుకు వచ్చావు! నాకు ఎంత సంతోషంగా ఉందో మాటల్లో చెప్పలేను" అంటూ ఆమె నన్ను మరో గదిలోకి తీసుకెళ్ళింది.

"ఇదే రత్న గది. రత్న ఇక్కడే వుంది" అంటూ ఆవిడ ఆ గదిలో అద్దాల తలుపు లున్న ఒక అల్మారా తెరిచి అందమైన, ఒక పెద్ద డైరీని తీసి నా చేతిలో పెట్టింది. "ఇదిగో! ఇదే రత్న! మాకు మిగిలింది ఇదే!" అంటూ గొంతు పూడుకుపోవడంతో ఆవిడ ఆగిపోయింది. ఆమె కళ్ళు మళ్ళీ కన్నీళ్లతో నిండాయి. గిరుక్కున వెనక్కి తిరిగి, నన్ను నా మానాన ఆ గదిలో వదిలేసి, ఆమె బయటికి వెళ్ళిపోయింది.

నేను దిగ్భ్రాంతికి గురయ్యాను. నోరు పెగల్లేదు. నిలబడేందుకు కూడా శక్తి లేనట్టు అక్కడున్న కుర్చీలో కూలబడ్డాను. మొదటి పేజీ తెరవగానే పెళ్ళికూతురి డ్రస్సులో ఒకమ్మాయి ఫొటో ఉంది. పేజీలు తిప్పసాగాను. ప్రతి పేజీలోనూ అదే ఫొటో చిన్నసైజులో ఒక మూలగా అతికించి ఉంది. ముత్యాల్లాంటి అక్షరాలతో డైరీ నిండిపోయి ఉంది. ఇవి ఒక పరాయి స్త్రీ రాసుకున్న సొంత విషయాలు. వీటిని చదవడం భావ్యం కాదు అని ఒక పక్క నా మనసు హెచ్చరిస్తున్నా - స్వయంగా ఆమె తల్లే దీన్ని నాకివ్వడం, నాలోని విపరీతమైన కుతూహలం ఆ సంకోచాన్ని జయించాయి.




మార్చి 01, 1975

ఇప్పుడే ఆలిండియా టూర్ నుంచి వెనక్కి వచ్చాం. ఇరవై రోజులు ఎంత ఆనందంగా గడిచాయో స్నేహితురాళ్ళతో! పెద్దల అదుపాజ్ఞలు ఏవీ అడ్డుపడకుండా స్వేచ్ఛగా హాస్టల్ నిబంధనల నుంచి విముక్తులై కాలేజీ పాఠాలూ.. హోమ్ వర్క్‌లనేవీ ఏవీ లేకుండా కాలం గడిచిపోవడం ఎంత హాయి! మా వెంట ఇద్దరు లెక్చరర్లు వచ్చారు. కానీ మా ఉత్సాహాన్ని వాళ్ళు ఆపలేకపోయారు. మేం మొత్తం ముప్ఫైమంది అల్లరి పిల్లలం, వాళ్ళు ఇద్దరు. మా బాధ్యతంతా వాళ్ళదే!

అందుకే వాళ్ళకి అంత భయం. వాళ్ళని చూస్తే మాకు జాలి వేసింది. మా అందర్లోకి ఎక్కువ అల్లరి చేసేది మాలతి. తను ఎవర్నీ లెక్కచేసేది కాదు. ఆమె తల్లిదండ్రులు పెద్ద పదవుల్లో ఉన్నారు. అదీ తన గర్వానికి కారణం! కమలాపళ్ళు కొంటానని నాగపూర్ స్టేషన్‌లో రైలు దిగింది. రూపాయికి ఒక పండు చొప్పున బేరం చేసింది. ముప్పై పళ్ళు తీసుకుని అమ్మిన తనికి వంద నోటిచ్చింది. వాడు దాన్ని తీసుకుని, చిల్లర తెస్తానని అదే పోక పోయాడు. తన పళ్ళ బుట్ట అక్కడే వది లేశాడు. చూస్తే అందులో మొత్తం యాభై పళ్ళకన్నా లేవు. అప్పుడు మిగతా ఇరవై పళ్ళనీ మాలతి తెలివిగా మా బోగిలో వాళ్ళకి ఎనభై రూపాయలకి అమ్మేసింది. ఆ సంగతి ఇంట్లో వాళ్ళకి చెపుతూ ఉంటే వాళ్ళు పడీపడీ నవ్వసాగారు. ఇంతలో అమ్మ నన్ను లోపలికి పిలిచింది.

అయిష్టంగానే లేచి వెళ్ళాను. లోపల మా మేనత్త కూతురు ఊర్మిళ ఉంది. ఆమెని కొంచెం బయటికి వెళ్ళమని చెప్పి, నన్ను తన పక్కన కూర్చోపెట్టుకుని నా తల నిమురుతూ కూర్చుంది. అమ్మ నా మీద ఇంత ప్రేమ ఎప్పుడూ చూపించ లేదు. అసలు మా విషయాలన్నీ మా పిన్నే చూసుకునేది. నేను తప్ప మిగతా అందరూ పిన్నికి ఎప్పుడూ మస్కా కొడుతూ ఉండేవాళ్ళు. ఎందుకో నాకు మాత్రం పిన్ని అంత నచ్చేది కాదు. ఆమెకి దూరంగా ఉండేదాన్ని. బహుశా అందుకే పిన్ని కూడా నన్ను మాత్రమే హాస్టల్లో ఉంచి చదివిస్తోంది.

"రత్నా! నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంది అమ్మ. ఆమె మొహం గంభీరంగా ఉంది. అసలు అమ్మ ఎప్పుడూ సీరియస్‌గానే ఉంటుంది. ఎప్పుడైనా చిరునవ్వు నవ్వుతుందే తప్ప హాయిగా ఆమె నవ్వడం నేనెప్పుడూ చూడలేదు. అమ్మ మాతో మాట్లాడడం కూడా తక్కువే. ఇప్పుడు ఆవిడ ఏం చెప్పబోతోందో అని అనుకున్నాను.

"రత్నా! మీ నాన్న నీ పెళ్ళి నిశ్చయం చెయ్యబోతున్నారు" అంది.

ఒక్కసారిగా మిన్ను విరిగి మీద పడ్డట్టనిపించింది నాకు. "అదేమిటి? ఇంకా నా గ్రాడ్యుయేషన్ కూడా పూర్తి కాలేదే? అదీ కాక బి.ఎ. పూర్తి చేశాక, ఇంకా చదవాలని కూడా అనుకున్నాను" అన్నాను.

"నాకు మాత్రం ఇప్పుడే నీకు పెళ్ళి చేయాలని ఉందనుకుంటున్నావా? కానీ మీ నాన్న నీ పెళ్ళి నరోత్తమ్‌తో దాదాపు నిశ్చయించేశారు. వీలైతే నిశ్చితార్థం కూడా చేసేసే వారే! కానీ నరోత్తమ్ స్వయంగా నీ ఇష్టాయిష్టాలు తెలుసుకోమనీ, నీకు ఇష్టమైతేనే తనీ పెళ్ళి చేసుకుంటాననీ అన్నాడట! చూడు రత్నా! నువ్వీ పెళ్ళికి ఎంత మాత్రం ఒప్పుకోవద్దు. అతను ఐ.ఎ.ఎస్. అయితే అవుగాక! అతనితో నీకు పెళ్ళి జరగడం నాకేమాత్రం ఇష్టం లేదు!" అంది అమ్మ. మరుక్షణం ఆవిడ అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయింది.

చాటుగా అమ్మ కళ్ళు తుడుచుకోవటం గమనించాను. నాకు ఎటూ తోచలేదు. నరోత్తమ్ మాకు దూరపు చుట్టమని తెలుసు. కొన్నేళ్ళ క్రితం మా ఇంట్లోనే ఉంటూ చదువుకున్నాడనీ తెలుసు. అప్పుడు నేను చాలా చిన్నదాన్ని. ఎనిమిదో తరగతి చదువుతున్నాను. మరుసటి రోజు నేను హాస్టల్‌కి వెళ్ళిపోయాను. వయసులో నరోత్తమ్ నాకన్నా పెద్దవాడు!

నాలుగు రోజుల నుంచీ మా ఇంట్లో భూకంపం వచ్చినట్టుంది పరిస్థితి. అక్కయ్య, అన్నయ్య, పిన్నీ.. అందరూ నా అభిప్రాయం అడిగి తెగ వేధిస్తున్నారు.

అన్నయ్య అయితే నాన్న తరఫు వకాల్తా పుచ్చుకున్నట్టే మాట్లాడుతున్నాడు. "యాభై లక్షలిచ్చినా ఐ.ఎ.ఎస్. అబ్బాయి దొర

కడు. నీకు అప్పనంగా దొరుకుతున్నాడు. పైగా అతని పర్సనాలిటీ చూశావా? ఎంత అందంగా ఉన్నాడో? మా బావగారు!" నరోత్తమ్ అప్పుడే నన్ను పెళ్ళి చేసేసుకున్నట్టు అన్నాడు.

మా బాబాయి భార్య, ఇద్దరు మేనత్తలూ మా ఊళ్ళోనే ఉంటారు. వాళ్ళంతా 'ఇద్దరికీ పదేళ్ళు తేడా ఉందమ్మా!' అంటూ చెవులు కొరుక్కుంటున్నారు. అయితే మరుక్షణం వాళ్ళ నోటంటే.."అయినా నరోత్తమ్ అంత వయసున్న వాడిలా కనిపించడు. పైగా మంచి రూపురేఖలు, వినయ విధేయతలూ ఉన్న యోగ్యుడు" అనే మాటలు వినవస్తున్నాయి.

ఇవాళ అక్కయ్య సురేఖ కూడా వచ్చింది. చాలా కోపంగా ఉంది. అక్కకి కోపం రావడం సమంజసమే! మూడేళ్ళ క్రితం తన కోసం నరోత్తమ్ సంబంధం గురించి ప్రయత్నించారు. కానీ అతనే తనకి ఇష్టం లేదని స్పష్టంగా చెప్పాడు.

సురేఖ అమ్మతో "అప్పుడు మీ కూతురు ఆయనగారికి పనికిరాలేదు. మరి ఇప్పుడు మాత్రం మన రత్నని ఎలా చేసుకుంటాడట? తనకన్నా పదేళ్ళు చిన్నదైనందుకా? లేక దానికేమైనా కొమ్ములు మొలిచాయా? " వెటకారంగా అంటూ నా వైపు చూసి, "రత్నా! నాకున్నది నువ్వొక్కత్తివే! ఇంక అక్కచెల్లెళ్ళవరూ నాకు లేరు కదా! ఆ నరోత్తమ్‌ని నువ్వు చేసుకుంటే ఇక మీ ఇంటికి రావడం, నిన్ను కలవడం వీలు కాదు. అతన్ని చేసుకోనని చెప్పెయ్యి. అలా నిరాకరిస్తే ఎంత బాధ కలుగుతుందో తెలియాలి అతనికి" అంది మొహం ఎర్రగా చేసుకుని.

సురేఖ భర్త ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్. వాళ్ళకి ఒక కూతురు కూడా ఉంది. అయినా ఎప్పుడో జరిగిన అవమానాన్ని తనింకా మర్చిపోలేదు. సురేఖ ఇంకా అలా

## చతుర ప్రవేశిక

**మార్చి చతుర చదివారా?**

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. నరోత్తమ్ భార్య? | 6. రత్నకు విమానంలో సాయం చేసింది? |
| జ. | జ. |
| 2. రత్న అక్క? | 7. ప్రభాస్ భార్య? |
| జ. | జ. |
| 3. రూబీ అసలు పేరు? | 8. సంజయ్ పెళ్లి చేసుకోవాలనుకున్నది? |
| జ. | జ. |
| 4. వ్యాస్ ఉద్యోగం? | 9. 'ముక్తి' నవలా రచయిత? |
| జ. | జ. |
| 5. రత్న ప్రాణ స్నేహితురాలు? | 10. పేపర్‌వేగ్ యంత్రాన్ని కనుగొన్నది? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (    )

చిరునామా: ----------------------------------------------------

-------------------------- పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

ఏదో గొణుగుతూ ఉండగానే నాన్న అక్కడికి వచ్చాడు. సురేఖ కోపానికి కారణం ఆయనకి తెలిసిపోయింది.

"రత్నా! నువ్వు ఎవరి మాటా వినొద్దు. నీకిష్టమైతేనే ఈ పెళ్ళి జరుగుతుంది. నరోత్తమ్ ఎంత సంస్కారవంతుడో చూడు! నీకు ఈ పెళ్ళి ఇష్టమా? కాదా? అని కనుక్కోమన్నాడు. అతనలా అడగమనక పోతే ఈ పాటికి నీ నిశ్చితార్థం కూడా జరిపించేసి ఉండేవాడిని. సురేఖ పిచ్చిది. ఎవరి పెళ్ళి ఎవరితో రాసిపెట్టాలో ఆ దేవుడే నిర్ణయిస్తాడు. దానికి కూడా మంచి మొగుడే దొరికాడుగా! అతనూ పెద్ద పదవిలోనే ఉన్నాడు! ఇక నీ మీద దానికి అసూయ ఎందుకు?" అన్నాడు నాన్న.

నేను జవాబు చెప్పలేదు.

నాన్న అన్నయ్యను పిలిచి "సునీల్! ఒక పావుగంటలో రత్న నిర్ణయం ఏమిటో తెలుసుకుని నువ్వు నాకు చెప్పాలి" అంటూ హాల్లోకి వెళ్ళిపోయాడు.

సునీల్ తనకి అయాచితంగా దొరికిన పెద్దరికానికి మిడిసిపడుతూ "రత్నా! చెప్పు నీ ఉద్దేశం ఏమిటి? నువ్వేం అనుకుంటున్నావు?" అని అడిగాడు.

నా తల తిరిగిపోతోంది. ఏం చెప్పాలో పాలుపోలేదు. పైగా నాన్నంటే మొదటి నుంచీ భయం. వద్దు అని చెప్పి ఆయన మాట కాదని, అవమానించే ధైర్యం లేదు. అయనంటే ఉన్న భయం వల్ల అమ్మ దిగులు మొహం ఆ సమయంలో నాకు గుర్తు రాలేదు. ఒకపక్క సునీల్ అదే పనిగా నన్ను ఒకటే ప్రశ్న అడుగుతూ ఊదరకొట్టేస్తున్నాడు. చివరికి నోటంట అప్రయత్నంగా.. "నేనేం చెప్పను? నాన్న ఏం చేసినా నా మంచి గురించే ఆలోచించి చేస్తారు కదా!" అనే మాటలు వచ్చాయి.

సునీల్ వెళ్ళి నేనన్న మాటల్ని అలాగే నాన్నకి చెప్పేశాడు.

నాన్న గట్టిగా అందరికీ వినబడేటట్టు "రత్న గురించి నాకు తెలీదా? అణకువగా పెరిగిన పిల్లలు 'చేసుకుంటాను' అని ఎలా అంటారు? తన ఇష్టాన్ని ఎంత సున్నితంగా చెప్పిందో చూశారా? " అన్నాడు.

సురేఖ తప్ప మిగతా అందరూ ఆనందించారు. పిన్ని కూడా సంతోషంగానే కనిపించింది. ఒక్క అమ్మ ముఖంలో మాత్రం మచ్చుకైనా సంతోషం, ఆనందం కనిపించలేదు నాకు.

**మార్చి 09, 1975**

నిన్న కాలేజీలు తెరిచారు. హాస్టల్‌కి వచ్చేశాను. ఇంకొక ఆరు వారాల్లో మా ఫైనల్ పరీక్షలున్నాయి. ముందు పెళ్ళి విషయం ఎవరికీ చెప్పకూడదనే అనుకున్నాను. కానీ మాది చిన్న ఊరు, చిన్న కాలేజీ. ఏదైనా దాచటం ఎలా సాధ్యమవుతుంది? సాయంత్రం నా ప్రాణస్నేహితురాలు మధుకి చెప్పేశాను. అంతే! నరోత్తమ్ ఫొటోని హాస్టల్లో అందరికీ చూపించేసింది మధు. రాత్రి భోజనానికి డైనింగ్ రూమ్‌లోకి వెళ్ళగానే జూనియర్లూ, సీనియర్లూ అందరూ నన్ను చుట్టుముట్టారు. అందరూ అభినందించేవారే. జూనియర్ల కళ్ళలో సంతోషంతో పాటు రవంత ఈర్ష్యా కనిపించింది. కానీ ఒకరిద్దరు సీనియర్లు మాత్రం ఎందుకో దిగులు మొహం పెట్టారు. మధు నన్ను ఆటపట్టించడం మొదలుపెట్టింది, "కలెక్టర్‌గారి భార్యవై పోయాక మమ్మల్ని మర్చిపోవద్దు రత్నా! సరేనా? " అంటూ పడిపడీ నవ్వసాగింది.

ఇంట్లో ఉన్నప్పుడు ఎందుకోగాని భయం భయంగా, దిగులుగా అనిపించింది. కానీ ఇక్కడ వీళ్ళ కవ్వింపులూ, రొమాంటిక్ మాటలూ నాకు ఆహ్లాదాన్ని కలిగించాయి.

మా హాస్టల్ అమ్మాయిలు నరోత్తమ్ ఫొటోని ఒకరి చేతుల్లోంచి ఒకరు లాక్కుంటూ, "అబ్బ..! ఎంత బావున్నాడో! ఎంత ముద్దొస్తున్నాడో! రత్న ఎంతైనా అదృష్టవంతురాలే! అందం, చదువు, మంచి హోదా.. అన్నీ ఉన్న మొగుడు దొరికాడు.." అంటూ నిట్టూర్పులు వదలసాగారు. రాత్రి చాలాసేపు నిద్ర పట్టలేదు. తీయటి కలలు వచ్చే ఉంటాయి. కానీ గుర్తు లేదు నాకు.

**మార్చి 10, 1975**

"రత్నా! నీ పెళ్ళిచూపులూ అవీ ఇంత హఠాత్తుగా ఎలా జరిగాయి? సెలవులకి ముందు అసలు ఇంట్లో నీ పెళ్ళి గురించి అనుకుంటున్నారనే చెప్పలేదే నువ్వు? నువ్వు చేసుకోబోయే అతను నీకు ముందే తెలుసా? " అని మధు అడిగింది.

తన మొహం చూస్తే మనసులో ఇంకా చాలా ప్రశ్నలే ఉన్నాయని అనిపించి దాని నోరు మూశాను. దాని అవస్థ చూసి నవ్వు ఆగలేదు. నవ్వుతూనే "ఆగవే ఆగు..! నేనే అంతా చెప్తాగా? " అన్నాను. లేచి వెళ్ళి మంచి నీళ్ళు తాగివచ్చి "ఈయనగారు.. అంటే నాకు కాబోయే శ్రీవారు.. ఆ మనిషి మా నాన్న తోడల్లుడి కొడుకు.." అని నేను అంటూండగా, నన్నా వాక్యం పూర్తి చెయ్యనివ్వకుండా, "అయితే ఆయన నీకు పెద్దమ్మ కొడుకా! అన్నయ్యా! అదేమిటి? " అంటూ అడ్డుపడింది మధు.

"నీ ప్రశ్నకి సమాధానం అవును, కాదు అని చెప్పాల్సి ఉంటుంది. మా నాన్న రెండుసార్లు పెళ్ళి చేసుకున్నాడు. మొదటి భార్యకి పిల్లలు లేరు, ఆవిడ పోయారు. ఆవిడ అక్క కొడుకే ఈయన, పేరు నరోత్తమ్. నేను మా నాన్న రెండో భార్య కూతుర్ని. అంటే నాకు ఈ నరోత్తమ్‌గారికీ రక్తసంబంధం లేదన్న మాట. నరోత్తమ్ ఇంతవరకూ మా నాన్నని చిన్నాన్న అనే పిలుస్తుంటారు. మా రెండు కుటుంబాల మధ్య సంబంధం తెగిపోలేదు. అసలు

నరోత్తమ్ మా ఇంట్లో ఉండే చదువుకున్నారు" అన్నాను.

"అలా చెప్పు! అయితే మీది ప్రేమ వివాహం అన్నమాట!" అంది మధు కళ్ళు పెద్దవి చేసి.

మళ్ళీ నాకు నవ్వు వచ్చింది. "అసలు నేను ఆయన్ని చూసిందే పదిపన్నెండు సార్లు. ఎప్పుడూ హాస్టల్లోనే కదా మన జీవితం! ఇక సెలవులకి నేను ఇంటికి వెళ్ళి నప్పుడు ఆయనగారు కూడా తన సెలవులకని వాళ్ళ అమ్మ దగ్గరికి వెళ్ళిపోయేవాడు. వాళ్ళమ్మకి ఆయన ఒక్కగానొక్క కొడుకాయె. ఇక ప్రేమంటావా? పెళ్ళయితే ప్రేమ అదే పుట్టుకొస్తుంది!" అన్నాను కొంటెగా!

అలా అనేశానేగానీ ఆ మనిషిని ప్రేమించగలనా? ఊహకే అందడం లేదు అనుకున్నాను. "నాకన్నా తొమ్మిది పదేళ్ళు పెద్దవాడాయన. ఆయన్ని ప్రేమించగలనంటావా? చెప్పు? " అని అడిగాను.

మధుకి నా మీద ప్రేమ పొంగుకొచ్చినట్టుంది. చటుక్కున నా నుదురు ముద్దుపెట్టుకుని "నువ్వు చాలా అదృష్టవంతురాలివే రత్నా! లేకపోతే ఈ రోజుల్లో అంత మంచి సంబంధం పైసా కట్నం ఇవ్వకుండా దొరకటం అంటే మాటలా? ఐ.ఎ.ఎస్.ల తల్లిదండ్రులు కొడుకులని లక్షలకీ, కోట్లకీ వేలం వేసే రోజులివి. అయినా నువ్వు మాత్రం తక్కువా ఏమిటి? మా రత్న నిజంగానే రత్నం కదూ!" అంది.

మధు కళ్ళు చెమర్చాయి. అవి ఆనంద బాష్పాలనీ, ఆమెలో అసూయ ఏ మాత్రం లేదనీ నాకు తెలుసు. తనని గట్టిగా గుండెలకు హత్తుకున్నాను.

*మార్చి 21, 1975*

ఇప్పటి వరకూ నరోత్తమ్ దగ్గర్నించి మూడు ఉత్తరాలు వచ్చాయి. ఉత్తరాలు చాలా అందంగా రాస్తారు ఆయన. వాటికి ఏమని జవాబు రాయాలో కూడా నాకు తెలీడం లేదు. మధు అదేపనిగా జవాబు రాయమని వెంటపడుతుంటే ఒక చిన్న ఉత్తరం రాశాను. ఆయన ఉత్తరాలు రాసే కాయితాలు సువాసనతో నిండి ఉండేవి. ఇక పదాల పరిమళం గురించి చెప్పేదేముంది? నేను వద్దంటున్నా వినకుండా మధు ఒక ఉత్తరాన్ని చదివి "ఈ కలెక్టర్ గారిది కవి హృదయం, రత్నా!" అంది.

ఇక నా మనసు చదువు మీద నిలవడం లేదు. ఇలాగే కొనసాగితే తప్పకుండా నా పరీక్ష పోతుంది! నాన్న ముహూర్తాలూ గట్రా అంటూ పరీక్షకి పదిరోజుల ముందే పెళ్ళికి తేదీ నిశ్చయించేశాడు. మళ్ళీ నెల రోజులు దాటితే గానీ ముహూర్తం లేదని పంతులుగారు చెప్పారట.

*ఏప్రిల్ 04, 1975*

ఈ రోజు నాకు నిశ్చితార్థం. పెళ్ళికొడుకువాళ్ళు నాకు పెద్ద జరీచీర పెట్టారు. అసలే చీరలు కట్టుకోవడం అలవాటులేని నేను ఆ చీరలో మునిగిపోయాను. పెళ్ళికొడుకు తల్లీ, అక్క వరస అయిన ఒక దూరపు బంధువూ వచ్చారు. ఆ అక్క పిల్లలు కూడా వెంట వచ్చారు. ఉన్నమాట చెపుతున్నాను, ఆ రోజు నాకు ఆ నిశ్చితార్థం తంతు బలే సరదాగా అనిపించింది. కానీ అంతలోనే ఇదంతా త్వరగా అయిపోతే నేను హాస్టల్‌కి వెళ్ళిపోవచ్చు కదా అనుకున్నాను. వచ్చేవారమే నా పెళ్ళి! మరి నిశ్చితార్థం అయాక పెళ్ళికూతుర్ని గడప దాటనిస్తారా? అది అసాధ్యం? ఆయన నాకు ప్రధానం ఉంగరం పెడుతున్నప్పుడు ఆ వేళ్ళు చాలా అందంగా ఉండడం గమనించాను. తలెత్తి మొహంవైపు చూద్దామంటే సిగ్గేసింది. మధు వెనక నుంచి పొడుస్తూ తలెత్తమని ఎంత చెప్పినా వినలేదు నేను.

*ఏప్రిల్ 14, 1975*

ఇవాళ పొద్దున్నించీ జ్వరం వచ్చినట్టు ఒళ్ళంతా నొప్పులు. మనసులో ఏదో అర్థం

అ
క్ష
రం

అక్రమ సంపాదనతో చేసే
విందు భోజనం కన్నా
కష్టార్జితంతో తాగే
గంజినీరు సంతృప్తినిస్తుంది
– మోక్షగుండం విశ్వేశ్వరయ్య



కాని భయం. ఐదు రోజులుగా ఏవేవో పెళ్ళికి సంబంధించిన ఆచారాలు నడుస్తున్నాయి. నలుగులూ, తలంట్లూ, చేతులకి గోరింటాకు పెట్టడం లాంటి వాటి కోసం నా శరీరాన్ని వాళ్ళకి అప్పగించి కూర్చున్నాను. సురేఖ కూడా తన కోపాన్నీ, అసూయనీ మర్చిపోయి, నాకు సేవలు చేస్తోంది. అది సంతోషంగా ఉన్నట్టే కనిపిస్తోంది. అసలు ఎక్కువగా పని చేస్తున్నది మా పిన్ని, కానీ ఆవిడ ఎందుకో బాధ పడుతున్నట్టు కనిపించింది. నా ముందు చాలా ఆప్యాయంగా ఉండేందుకు ప్రయత్నించినప్పటికీ, సందు దొరికితే చాలు పిన్నీ, సురేఖా ఒకచోట చేరి చాలా సేపు సీరియస్‌గా ఏదో చర్చించుకోవడం కనిపించింది. నన్ను చూడగానే మాట మారుస్తూండడాన్ని కూడా గమనించాను. ఇవాళ నా పక్కటెముక్కల్లో నొప్పిగా ఉంది. కానీ ఎవరికీ చెప్పలేదు. లోలోపల నన్ను పట్టి పీడించే భయాన్ని కూడా బయటికి చెప్పకుండా భరించాను.

*ఏప్రిల్ 19, 1975*

పెళ్ళి ఎలా జరిగిందో? అన్ని తంతులూ ఎప్పుడు ముగిశాయో? నాకేం తెలీలేదు. జ్వరంతో నా ఒళ్ళు కాలిపోతోంది. పురోహితుడు మా చేత పాణిగ్రహణం చేయించినపుడు నరోత్తమ్ ఉలిక్కిపడ్డాడు. "ఏమిటిది? నీకు బాగా జ్వరంగా ఉన్నట్టుందే? " అని అడిగారు. కానీ పెళ్ళి మండపంలో ఉన్న గోలలోనూ, పురోహితుడు గట్టిగా మంత్రాలు చదువుతూండడం వల్లనూ ఆ మాటలు ఎవరికీ వినిపించి వుండవు. మర్నాడు కారులో ఆయన పక్కన కూర్చున్నప్పుడు కూడా నా జ్వరం తీవ్రత తగ్గలేదు. ఇల్లు చేరుకోగానే ఆయన డాక్టర్ని పిలిపించారు. డాక్టర్ నాకు న్యుమోనియా అని తేల్చాడు. నాలుగు రోజులుగా రోజూ వచ్చి ఇంజెక్షన్ ఇస్తున్నాడు. ఇక మందులైతే చెప్పనే అక్కరలేదు. రోజూ ఎన్నో మాత్రలు మింగాల్సి వస్తోంది. మా అత్తగారు ఉత్త సత్తెకాలపు మనిషి. ఆవిడ మనసు వెన్నపూస. నా పరిస్థితి చూసి చాలా గాభరా పడింది. మా అమ్మ కూడా అంత గాభరాపడి ఉండేది కాదేమో! రోజుకి పదిసార్లు నా గదిలోకి వచ్చి ఒళ్ళు ముట్టుకుని చూస్తోంది. రోజూ దిష్టి తీస్తోంది. ఇవాళ నా జ్వరం తగ్గింది. అప్పటికిగానీ ఆవిడ మొహంలో ఆందోళన తగ్గలేదు.

నేను కాస్త కోలుకున్నాక రిసెప్షన్ ఏర్పాటు చేశారు. కానీ నీరసం వల్ల రిసెప్షన్‌లో కూడా ఆయన పక్కన ఎక్కువ సేపు కూర్చోలేకపోయాను. లోపలికి వెళ్ళి పడుకున్నాను. అవతల పార్టీ జరుగుతున్నా, పెద్ద పదవుల్లో ఉన్న వాళ్ళు చాలా మంది రిసెప్షన్‌కి వచ్చినా ఆయన మనసంతా నా మీదే. మధ్య మధ్యలో వచ్చి చూసిపోతూనే ఉన్నారు.

*ఏప్రిల్ 23, 1975*

రేపు పరీక్ష ఉంది. ఇవాళ మధ్యాహ్నం ఆయన నన్ను హాస్టల్లో దింపి వెళ్ళారు. హాస్టల్లో అమ్మాయిలందరూ నా చుట్టూ మూగి మా ఆయన గురించి ప్రశ్నల వర్షం కురిపించారు. హనీమూన్ ఎలా

జరిగింది? ఎక్కడికెళ్ళారు? ఆయన ఎలాంటి వాడు?

నాకేం చెప్పాలో తెలీలేదు. మేమసలు హనీమూన్‌కి వెళ్ళనే లేదు. మా అత్తగారికి ఒంట్లో బాగా లేదు. ఆమెని ఒంటరిగా వదిలి వెళ్ళడం మా ఇద్దరికీ ఇష్టం లేకపోయింది. అయినా కలెక్టర్‌గారి బంగళా మాత్రం తక్కువదా? అంత పెద్ద బంగళాలో, ఇంటిముందున్న తోటలో సరదాగానే గడిచిపోయింది హనీమూన్‌లాగే. అదేమిటో ఇప్పుడు నాకు పరీక్షలూ, చదువుకోవడం లాంటి వాటి మీద మనసు నిలవడమే లేదు. రెక్కలు కట్టుకుని ఆయన ముందు వాలిపోవాలని మనసు తహతహలాడుతోంది. అత్తగారు కూడా, "రత్న పరీక్ష రాసి పాసయి ఏం చెయ్యాలని? తను ఉద్యోగం చెయ్యాలా? ఏమైనానా? " అంది. ఆమె నిజంగా చాలా మంచిది. నేనలా హాస్టల్‌కి వెళ్తూ ఉంటే చాలా బాధపడింది. నిజానికి నాకూ వెళ్ళాలని అనిపించలేదు. కానీ మా ఆయన చదువు మధ్యలో ఆపడానికి వీల్లేదని పట్టుబట్టారు. ఆయన మాటకి ఎదురు చెప్పే ధైర్యం నాకెక్కడిది? ప్రేమగా చెపితే ఎవరికైనా మాట వినాలనే అనిపిస్తుంది కదా?

***మే 25, 1975***

ఆఖరి పరీక్ష రాసి బయటకి వచ్చేసరికి మా ఆయన అక్కడ నిలబడి ఉన్నారు. పరిగెత్తుకెళ్ళి ఆయన్ని వాటేసుకోవాలనిపించింది. కానీ అంతమంది అక్కడ ఉండగా అది ఎలా సాధ్యం? హాస్టల్ నుంచి ఆయన నన్ను తిన్నగా హోటల్‌కి తీసుకెళ్ళారు. అక్కడ ముందే రూమ్ బుక్ చేశారు. ఇద్దరం చాలాసేపు రూమ్‌లో ఏకాంతంగా గడిపాక భోజనం చేశాం. రాత్రికి కూడా అక్కడే ఉండిపోవాలని అనిపించింది నాకు.

కానీ ఆయన "అమ్మ నీ కోసం చాలా ఆత్రుతగా ఎదురుచూస్తోంది. పద ఇంటికెళ్దాం! అన్నట్లు ముందు హాస్టల్‌కి వెళ్ళి నీ సామానూ అదీ తెచ్చుకుందాం!" అన్నారు.

ఆ రోజు కారు ఆయనే నడిపారు. డ్రైవర్‌ని తీసుకురాలేదు. హాస్టల్‌కి వెళ్ళి నా సామాన్లన్నీ ఎలాగో బ్యాగుల్లో కుక్కి, హాస్టల్ చౌకీదార్ సాయంతో కారులో పెట్టించాను. నేను వెళ్తూంటే మధు ఏడవడం మొదలెట్టింది. కానీ నేను మాత్రం చాలా సంతోషంగా ఉన్నాను. ఇన్నాళ్ళ ఎడబాటు తరువాత మళ్ళీ ఆయన దగ్గరకి వెళ్తున్నాను! ఎనిమిది గంటలు ప్రయాణం చేసి అర్ధరాత్రి పన్నెండుకి ఇల్లు చేరాం. కారులో ఆయన భుజం మీద తలవాల్చి, మెడ చుట్టూ చెయ్యివేసి కూర్చున్న నాకు అన్ని గంటలు ప్రయాణం చేసినట్టే అనిపించలేదు. అత్తయ్య మేలుకునే ఉన్నారు. ఆవిడ అప్పటికప్పుడు వంట చేయించి హాట్‌కేస్‌లో పెట్టి మా పడకగదిలో ఉంచింది. నరోత్తమ్ స్నానం చేసేందుకు వెళ్ళగానే ఆవిడ నా పక్కన కూర్చుని తల నిమరసాగింది.

ఆయన స్నానం చేసి రాగానే ఆవిడ లేచి, "నువ్వు కూడా స్నానం చేసెయ్యి, బడలిక తీరుతుంది. నిద్రపోయేముందు ఇద్దరూ భోజనం చెయ్యడం మర్చిపోవద్దు!" అని తన గదిలోకి వెళ్ళిపోయింది.

కానీ మాకు ఆకలి ఎక్కడిది? అలసటా, నిద్రా ఆమడ దూరం వెళ్ళిపోయాయి. రాత్రంతా మేలుకునే ఉన్నాం. హాట్‌కేస్‌లో భోజనం అలాగే ఉండిపోయింది.

ఆ తరువాత ఐదేళ్ళపాటు డైరీ నిండా సంతోషం, ఆనందంతో నిండిన వివరాలే ఉన్నాయి. అవన్నీ ఇక్కడ చెప్పి మీ కాలాన్ని వ్యర్థం చెయ్యడం అనవసరం. కొన్ని ముఖ్యమైన పేజీలనీ, తేదీలనీ మాత్రం ఇక్కడ ప్రస్తావిస్తాను.

***జూన్ 11, 1976***

నాకసలు చదువుకోవాలనే లేదు, కానీ ఆయన నన్ను ఎం.ఎ.లో చేరమన్నారు.

# ముఖ్యమైన ఉత్తరాలు

చతుర సంగతులు

చరిత్రలో అత్యంత ప్రాముఖ్యత సంతరించుకున్న కొన్ని ఉత్తరాల విశేషాల గురించి..

★ ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ 2-8-1939న నాటి అమెరికా అధ్యక్షుడు ఎఫ్.డి. రూజ్‌వెల్ట్‌కి రాసిన ఉత్తరంలో 'నాజీ జర్మనీ అటామిక్ బాంబ్ తయారు చేయబోతోంది, అమెరికన్ శాస్త్రజ్ఞులు అందుకు ప్రతిగా ఆయుధాలు తయారు చేయాలి' అని ఉంది. దాంతో మన్‌హెటన్ ప్రాజెక్ట్‌ని ఆరంభించి అమెరికా హిట్లర్ కన్నా ముందే అటామిక్ బాంబ్‌ని తయారు చేసింది. కొసమెరుపు శాంతిని కోరే ఐన్‌స్టీన్ ఆ ఉత్తరం రాసినందుకు తర్వాత చింతించాడు.

★ అబ్రహామ్ లింకన్‌కి 15-10-1860న గ్రేస్ డెబల్(11) అనే అమ్మాయి ఆయన్ని గడ్డం పెంచమని, ఆడవాళ్ళకి గడ్డం ఇష్టం కాబట్టి తమ భర్తలకి చెప్పి ఓటు వేయిస్తారని ఉత్తరం రాసింది. లింకన్ దాన్ని పాటించాడు.

★ మార్టిన్ లూథర్‌కింగ్ జూనియర్ 16-4-1963న ప్రజలకి రాసిన ఓపెన్ లెటర్‌లో 'నేను కొన్ని చట్టాలని పాటించి, మరికొన్నింటిని ఎందుకు అతిక్రమిస్తున్నాను? సమాధానం రెండు రకాల చట్టాలున్నాయి. కొన్ని న్యాయమైన చట్టాలు. మరికొన్ని అన్యాయమైన చట్టాలు. అన్యాయమైన చట్టం అసలు చట్టమే కాదు' ఉంది. అనేక దిన పత్రికల్లో ప్రచురితమైన ఈ ఉత్తరం వల్ల సివిల్ రైట్స్ ఉద్యమం ఊపందుకుంది.

THE WHITE HOUSE
WASHINGTON

August 9, 1974

Dear Mr. Secretary:

I hereby resign the Office of President of the United States.

Sincerely,

★ 9-8-1974న అమెరికా అధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ నాటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ హెన్నీ కిసింజర్‌కి ఒకే ఒక వాక్యం గల ఉత్తరం రాశాడు. అది 'ఐ హియర్ బై రిజైన్ ది ఆఫీస్ ఆఫ్ ప్రెసిడెంట్ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్'. చరిత్రలో పదవిలో ఉండగా రాజీనామా చేసిన ఏకైక అధ్యక్షుడు నిక్సనే!

★ 26-10-1943న మహాత్మాగాంధీ, న్యూఢిల్లీలోని ఎడిషనల్ సెక్రటరీ ఆఫ్ ది గవర్నమెంట్ ఆఫ్ ఇండియాకి రాసిన ఉత్తరంలో, తనని హౌస్ అరెస్ట్ చేసి, కాపలాకోసం ఖర్చు చేస్తుండడం, ప్రజాధనాన్ని వృథా చేయడమే అని, జైల్లో ఉంచితే చాలని కోరారు. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఇది ముఖ్యమైన ఉత్తరం. ఈ ఉత్తరం తర్వాతే స్వతంత్రం ఇచ్చే ఆలోచన బ్రిటిష్‌వారిలో కలిగింది!

ఆయన మాటంటే మాటే! ఎదురు చెప్పే ధైర్యం నాకు లేదు. అయిష్టంగానే కాలేజీకి వెళ్తున్నాను. అయినా కాలేజీలో ప్రొఫెసర్లూ, క్లాస్‌మేట్లూ నన్ను ఒక విద్యార్థినిగా చూస్తే కదా! అందరికీ నేను 'మేడమ్'నే! డిప్యూటి కలెక్టర్ భార్యని కదా మరి! నాకు వాళ్ళు అలా పిలవడం ఎబ్బెట్టుగా ఉండేది. ఇరవయ్యేళ్ళ దానికి అంత గౌరవమా? కానీ నూటయాభై ఏళ్ళు బ్రిటిష్‌వారి అధీనంలో ఉండడం వల్ల సంక్రమించిన రోగం ఇది. పబ్లిక్ సర్వెంట్‌ని 'సార్!' అని పిలవక తప్పదు.

రోజురోజుకీ నా పొట్ట పెరిగిపోతోంది. అంత పెద్ద పొట్టతో కాలేజీకి వెళ్ళలేక మానేశాను. పెళ్ళికాని పిల్లలతో పాటు కడుపుతో వున్న నాకు క్లాసులో కూర్చోడం ఇబ్బంది అనిపించింది. ఆయనా, అత్తగారూ నన్ను కాలు కింద పెట్టనివ్వడం లేదు. నా పరీక్షలు ఇరవయ్యేడు మేకి ముగిశాయి.

ఇరవై ఎనిమిదిన అబ్బాయి పుట్టాడు. మా అత్తగారి ఆనందానికి అంతులేదు. గుడిలోనూ, గురుద్వారాలోనూ పూజలు చేసి, డబ్బులిచ్చి, అన్నదానం చేసి వచ్చింది. మా ఆయన కూడా చాలా సంతోషంగా ఉన్నారు. నా పుట్టింటి

నుంచి అన్నయ్య సునీల్ మేనల్లుడికి కాను కలు పట్టుకొచ్చాడు. అదేరోజు వెళ్ళిపో యాడు. మా అత్తగారు ఉండమని ఎంత బలవంతం చేసినా వినిపించుకోలేదు. నేను ఆ విషయం పట్టించుకోలేదు.

*జూన్ 24, 1976*

సురేఖ రెండు రోజులు మా ఇంట్లో ఉండి వెళ్ళింది. బావగారు రాలేదు. తన కూతుర్ని వెంటపెట్టుకుని సురేఖ మాత్రం వచ్చింది. మా అబ్బాయి కోసం బోలెడన్ని కానుకలు తెచ్చింది. తనున్న రెండు రోజులూ మా ఇంటి పనులన్నీ తనే చేసింది. తను అంత చొరవ తీసుకోవడం నాకు నచ్చలేదు. అసలు నాకు ఎక్కువ ఇబ్బంది కలిగించినవి అక్క నాతో అన్న రెండు విషయాలు..

"నీకు కొడుకు పుట్టడానికి కారణం ఏంటో తెలుసా రత్నా? మీ ఆయన సెక్సీగా ఉండటమే. సెక్సీగా ఉండే మగా ళ్ళకే అబ్బాయిలు పుడతారట" అంది.

తనకి కొడుకు పుట్టాలని సురేఖ చాలా అనుకుంది. కానీ అమ్మాయి పుట్టడానికి కారణం తన భర్త అర్భకంగా ఉండడం, అందంగా లేకపోవడమేనని, అసలు నాన్నంటే అంత భయం లేకపోతే బావని తను పెళ్ళి చేసుకునేదాన్నే కాననీ అంది.

రెండో విషయం నాకస్సలు నచ్చ లేదు. "రత్నా! బాలింతరాలివని నరోత్తమ్‌ని దూరంగా పెట్టకు. ఇలాంటి సమ యంలోనే మగాళ్ళు ఇతర స్త్రీలతో సంబం ధాలు పెట్టుకుంటారు!" అని హెచ్చరిం చింది.

నరోత్తమ్ అలాంటివాడు కాదనీ, నేను కడుపుతో ఉండగా కూడా ఏడో నెల తరు వాత డాక్టరు సలహా మేరకు నాకు దూరం గానే ఉన్నారనీ, అయినా ఎప్పటిలాగే నా మీద ప్రేమ ఏమాత్రం తగ్గకుండా నన్ను చూసుకుంటున్నారనీ అక్కకి చెప్పాను.

అది విని అక్క వంకర నవ్వు నవ్వుతూ "అవసరమైన దానికన్నా ఎక్కువ ప్రేమ చూపించినా, అడపాదడపా కానుకలు తెచ్చిచ్చినా భర్త తప్పుదారి పడుతున్నాడనే అర్థం పిచ్చిదానా! తన గిల్టీకాన్షన్స్‌ని కప్పి పుచ్చుకునేందుకే ఆ పాట్లన్నీ! మరింక నరో త్తమ్‌ని చూసి అతని వెంటబడని ఆడవా ళ్ళెవరుంటారు? అందగాడు, అధికార హో దాలో ఉన్నాడు. నువ్వే కాస్త జాగ్రత్తగా ఉండాలి సుమా!" అంది.

ఇవన్నీ నా చెవిన వేసి సురేఖ వెళ్ళిపో



యింది. కానీ దాని వంకర మాటలు నా మనసుని ఆరుద్ర పురుగులా తొలవసాగాయి. ఈ రోజు సాయంత్రం నరోత్తమ్ దగ్గర పనిచేస్తున్న స్టెనో ఫోన్ చేసింది. అప్పుడు ఆయన స్నానాల గదిలో ఉన్నారు. నేనే ఆమెతో మాట్లాడాను.

"రేపు ఆఫీసుకి రాలేనని వారితో చెప్పండి. ఒక ముఖ్యమైన పని మీద బయటికి వెళ్ళాల్సి ఉంది" అంది.

ఆమె సంస్కారవంతురాలనీ, మంచి మర్యాదా తెలిసిన మనిషని నాకు తెలుసు.



కానీ నా మీద సురేఖ మాటల ప్రభావం ఇంకా తగ్గలేదు. "చూడండి! ఆఫీసు విషయాలు ఆఫీసులోనే మాట్లాడండి! మా ఇంట్లోకి, మా పడక గది దాకా తీసుకురావద్దు! తెలిసిందా!" అన్నాను కోపంగా.

నేను గట్టిగా ఆమెతో మాట్లాడుతూ, నరోత్తమ్ బాత్‌రూమ్‌లోంచి బయటికి రావడం గమనించలేదు.

నా చేతిలోంచి ఫోన్ తీసుకుంటూ "ఆc! చెప్పు ముదితా! .... అలాగే! సెలవు చీటి రాసి ఆఫీసులో ఇచ్చి వెళ్ళు!" అని ఆమెకి చెప్పి, నావైపు తిరిగి "ఏమైంది డార్లింగ్? ఎందుకంత కోపం వచ్చింది ఆమె మీద? డిప్యూటి కలెక్టర్ ఇల్లు కూడా ఆఫీసు క్యాంపే అని తెలుసు కదా! కలెక్టర్, కమిషనర్, చివరికి మామూలు జనం కూడా నా ఇంటికి ఫోన్ చేసి మాట్లాడే వెసులుబాటు ఉన్నప్పుడు నా స్టెనో ఫోన్ చేస్తే తప్పేంటి? పాపం! వాళ్ళ నాన్నకి ఆరోగ్యం బాగా లేదని సెలవు అడిగింది. నువ్వంత కటువుగా మాట్లాడి ఉండకూడదు" అన్నారాయన.

నాకు మళ్ళీ సురేఖ మాటలు గుర్తుకొచ్చాయి. నరోత్తమ్‌కి నామీద కోపం రాలేదు. ముదితతో కూడా చాలా అప్యాయంగా మాట్లాడారు. 'భగవంతుడా! ఏమిటీ ఆలోచనలు నాకు? తప్పుకదూ! నరోత్తమ్ ఎంత మంచివారు! ఛీ, ఎంత అన్యాయంగా ప్రవర్తించాను! అయినా త్వరగా కోలు

కుని నరోత్తమ్‌ని మళ్ళీ మా పెళ్ళయిన కొత్తలోలా సంతోషపెట్టాలి' అనుకున్నాను.

*డిసెంబరు 28, 1976*

మొన్న నా పుట్టినరోజు. నరోత్తమ్‌కి పుట్టినరోజు పండగల్ని చాలా మామూలుగా, ఏ ఆర్భాటాలూ లేకుండా జరుపుకోవడమంటే ఇష్టం. పొద్దున్న నిద్ర లేవగానే అమ్మ కాళ్ళకి నమస్కారం చెయ్యడం, హోమం ఏర్పాటు చెయ్యడం, ఆ తరువాత వాళ్ళమ్మ కోరిక మేరకు దానధర్మాలు చెయ్యడం. కానీ ఈసారి సురేఖ వచ్చి అంతా తలకిందులు చేసేసింది. ఉదయం పూట నరోత్తమ్ కోరిక ప్రకారమే అంతా జరిగినా సాయంత్రం తను వచ్చి నా చేత కేక్ కట్ చేయించింది. అసలు చిన్న పార్టీ లాంటిది ఇద్దామనే అనుకుంది. కానీ నరోత్తమ్ ససేమిరా అంటూ అడ్డుపడ్డారు. సురేఖ భర్త సాయంకాలం తన కూతుర్ని వెంటపెట్టుకుని వచ్చాడు. ఆయన మమ్మల్ని బలవంతపెట్టి రాత్రి డిన్నర్‌కి ఊళ్ళో ఉండే హోటళ్ళన్నిట్లోకి ఖరీదైన హోటల్‌కి తీసుకెళ్ళాడు. ఈ వ్యవహారాన్ని నరోత్తమ్ భరించలేకపోయారు. కానీ దేవుడి దయవల్ల ఆయన తన కోపాన్ని బయటికి కనబడనీయలేదు.

నేను మళ్ళీ కడుపుతో ఉన్నానన్న విషయం అప్రయత్నంగా సురేఖకి చెప్పేశాను.

వెంటనే తను నామీద విరుచుకుపడింది. "ఇంకా ఏడాదైనా కాలేదు! మళ్ళీ కడుపా? నీకేమైనా బుద్ధుందా? ఎందుకు జాగ్రత్తలు తీసుకోలేదు. త్వరగా ముసలిదానివై పోవాలని ఉందా? మొగుడు పెడదారి పడతాడన్న భయం లేదా? మళ్ళీ అతనికి శారీరకంగా దూరమవుతావు. ఇంకెవరో వగలాడి అతన్ని ఎత్తుకుపోతే అప్పుడు ఎంత ఏడ్చినా ప్రయోజనం ఉండదు" అంటూ చీవాట్లు పెట్టింది.

మంథరలా అది చెప్పిన మాటలు విని ఇవాళ లేడీ డాక్టర్ దగ్గరకి వెళ్ళాను. ఆమె నన్ను పరీక్ష చేసి నేను గర్భవతినని నిర్ధారణ చేసింది. నాకు అబార్షన్ చేయించుకోవాలని ఉందని అన్నాను. ఆవిడ దానికి ఒప్పుకోలేదు. పైగా మా ఆయన్ని వెంటబెట్టుకుని రమ్మని నన్ను పంపేసింది. నరోత్తమ్ కూడా అలాంటి పని చెయ్యొద్దని నాతో మరీమరీ చెప్పారు. నేను మొండిగా వాదించేసరికి ఆయనకి కోపం వచ్చింది.

"అది హత్యతో సమానం రత్నా! అలాంటి పాపపు పని ఎందుకు చేస్తానంటున్నావు? " అని అన్నారు.

కానీ నేను ఏడ్చి, అలిగి ఎలాగో ఆయన్ని ఒప్పించాను. ఇప్పుడు ఏదో తప్పు చేశానన్న భావం కలుగుతోంది. నన్ను ఇంట్లో దింపి వెళ్ళిన మనిషి ఎంత రాత్రయినా ఇంటికి రాలేదు. నేను అత్తగారికి ఈ విషయాలేవీ చెప్పలేదు. కడుపు నొప్పిగా ఉందని వెళ్ళి పడుకున్నాను. ఆవిడ చాలాసేపు నా మంచం పక్కనే కూర్చుని, ఇప్పుడే వెళ్ళి పడుకుంది.

'సురేఖని దూరంగా ఉంచాలి. ఎప్పుడు ఇంటికి వచ్చినా నాకు ఏదో ఒక సమస్య సృష్టించి కానీ వెళ్ళదు' అని అనుకున్నాను.

*జనవరి 21, 1977*

చాలా రోజుల వరకూ ఆయనకి నా మీద కోపం తగ్గలేదు. చాలా కష్టపడి కాళ్ళావేళ్ళా పడి బతిమాలుకుంటే ఇవాళ ఆయన కోపం పోయింది. కానీ ఆయన స్పర్శలో మునుపటి మార్దవం నాకు కనిపించడంలేదు. ఎక్కడో ఏదో తేడా వచ్చింది. ప్రభుత్వం సైతం అబార్షన్‌ని చట్టబద్ధం చేసినప్పుడు ఈయనకి మాత్రం ఎందుకింత బాధ? నేను చేసిన పనిని ఎందుకింకా మర్చిపోలేకపోతున్నారు? 'కొన్నాళ్ళుపోతే అంతా సర్దుకుంటుందిలే!' అని మనసుకి నచ్చచెప్పుకున్నాను.

ప్రభాస్ నడుస్తున్నాడు. బుడిబుడి అడుగులతో ఇల్లంతా తిరుగుతాడు. నౌకర్లు

వాడి వెనకాలే పరుగెత్తుతూ ఉంటారు. అందరూ ఎంతో ముద్దు చేస్తారు వాణ్ణి. నర్త్తోతమ్‌కి ఊళ్ళో రోజురోజుకి పరపతి పెరిగిపోతోంది. ఒక ఆఫీసర్‌గానే కాక వ్యక్తిగా కూడా ఆయన పొందే గౌరవాన్ని చూసి ఆయన పై ఆఫీసర్లు అసూయప డుతూ ఉంటారు.

*జులై 05, 1979*

నేను మళ్ళీ గర్భవతిని. కానీ ఈసారి దాన్ని తీయించుకోవాలన్న ఆలోచన చేసే ధైర్యం లేకపోయింది నాకు. పోయినసారి నరోత్తమ్ ఎంత బాధపడ్డారో నేను మర్చి పోలేదు. అత్తగారు ఈసారి మనవరాలు కావాలని కోరుకుంది. నాకూ ఆడపిల్లే కావాలని అనిపిస్తోంది. నరోత్తమ్‌కి ఎవ రైనా ఫరవాలేదు. పుట్టేది పిల్లో పిల్లాడో, ఆరోగ్యంగా ఉంటే చాలు. ఈసారి సురే ఖకి నేనేమీ చెప్పలేదు. నాలుగు నెలల క్రితం తనకి మళ్ళీ ఆడపిల్ల పుట్టింది. నేను తనని చూసేందుకు వెళ్ళాను. నన్ను చూడ గానే భోరుమంది. ఎలా ఓదార్చాలో నాకు తెలీలేదు. నాకు ఆడపిల్లే పుట్టేట్టు చెయ్యా మని దేవుణ్ణి ప్రార్థించాను. మళ్ళీ నాకు మగపిల్లాడు పుడితే సురేఖ అసూయతో రగిలిపోతుందని నాకు తెలుసు. మా అత్త గారి ఆరోగ్యం పాడయింది. ఆవిడ కోసం నరోత్తమ్ ఒక నర్స్‌ని పెట్టారు. కానీ ఆవిడ నామీద చూపించే అపారమైన ప్రేమకి బదులుగా ఆవిడకి సేవ చేసుకో వాలని నాకు అనిపించేది. ఆవిడకి సేవ చేస్తే నాకు ఆనందంగా ఉంటుంది. ఆవి డకి ఏమైనా అవుతుందేమోనని నాకు భయం పట్టుకుంది. ఆవిడ నాకు పెద్ద దిక్కులా అనిపిస్తుంది. నా మనసులో మాటలన్నీ ఆవిడకి చెప్పుకుంటాను. ఇక నరోత్తమ్ అయితే ఆవిణ్ణి పసిపిల్లలాగే చూసుకుంటారు. ఆ తల్లీకొడుకుల మధ్య ఉన్న ప్రేమ అరుదైంది.

*జులై 13, 1979*

జులై పదోతేదీన మా అమ్మాయి పుట్టింది. ఆగస్టు ఒకటో తేదీన మా అత్త గారు ఈలోకం విడిచి వెళ్ళిపోయారు. ఆవిడ లేని ఇల్లు బోసిపోయినట్టుంది. నాకు ఏ పనీ చెయ్యాలనిపించటం లేదు. ఆవిడ నాకు పెద్ద ఆసరాగా ఉండేది. తల్లి మాట జవదాటని కొడుకు నరోత్తమ్. నాకు కావలసినవన్నీ ఆవిడతో చెప్పి ఆయన చేత చేయించేదాన్ని. నాలో ఒక భాగం ఎక్కడికో వెళ్ళిపోయినట్టు ఉంది నాకు. ఆవిడ ఉన్నంత కాలం ఇంట్లో

## ఫిబ్రవరి - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఎస్.వి.ఎస్. భగవానులు**
   - రాజీవ్‌నగర్, ఒంగోలు
2. **ఎ.వి. రమణ**
   - అమలాపురం, తూ. గో. జిల్లా
3. **ఎం. లలిత**
   - తిరుపతి
4. **పరుచూరి భవానీదేవి**
   - ఎస్. వి. ఎస్. కాలనీ, గుంటూరు
5. **ఎస్.ఆర్.కె. మూర్తి**
   - ఎస్. ఎన్. పురం, విజయవాడ

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. కృష్ణారావు | 6. అనంత్ |
| 2. పరమేశ్వరరావు | 7. కవిత |
| 3. రెండు డాలర్లు | 8. శారద |
| 4. వైదేహి | 9. ఆదివిష్ణు |
| 5. వినయ్, ఉత్తమ్ | 10. వర్ధని |

## కొత్తగాలి...

**పూర్వం పెరట్లో**
**మల్లె పందిరి**
**ఇప్పుడు ముంగిట్లో**
**మనీ ప్లాంటు!!**

– *గుడిమెట్ల గోపాలకృష్ణ,*
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

నేనొక రాకుమార్తెలా అన్నీ అనుభవించాను. అన్ని విషయాలూ ఆవిడే చూసుకునేది. ఇప్పుడు హఠాత్తుగా అందరి బాధ్యతా నా మీద వచ్చి పడింది. ప్రభాస్ ఎప్పుడు పెరిగి పెద్దవాడయాడో? ఎలా పెరిగాడో? నేను పట్టించుకోలేదు. వాడి బాగోగులూ, మంచి చెడ్డలూ అన్నీ అత్తగారే చూసుకున్నారు. చివరికి వాడికి జబ్బు చేసినప్పుడు కూడా ఆవిడే దగ్గరుండి శుశ్రూష చేశారు. పెద్దవాళ్ళ నీడన ఎంత హాయిగా, చీకూచింతా లేకుండా బతకొచ్చో నాకు ఆవిడ వల్లే అనుభవంలోకి వచ్చింది.

***డిసెంబరు 8, 1979***

ఈమధ్య నరోత్తమ్ నాతో కలవడానికి అంత ఉత్సాహం చూపటంలేదు. స్వప్న పుట్టినప్పుడు నాకు చిన్న ఆపరేషన్ లాంటిది జరిగింది. శిశువు తల మరీ పెద్దదిగా ఉండడం వల్ల యోని ద్వారాన్ని కొద్దిగా కత్తిరించి పిల్లని బయటికి తియ్యవలసి వచ్చింది. ఆ తరువాత మళ్ళీ కుట్లు వేశాక నా శరీరం మామూలు స్థితికి వచ్చింది కానీ నరోత్తమ్‌కి మునుపటిలా అంత దాంపత్య సుఖాన్ని అందించలేకపోతున్నానని అనుమానం కలిగేలా ఉంది ఆయన ప్రవర్తన. డాక్టర్ని అడిగితే పరీక్ష చేసి చెపుతానని అంది. కానీ ఇంతలో నరోత్తమ్‌కి మరో ఊరికి బదిలీ అవడం వల్ల డాక్టరు దగ్గరకి వెళ్ళడం కుదరలేదు.

***జూన్ 6, 1981***

మేం గ్వాలియర్‌కి వచ్చి దాదాపు రెండేళ్ళవుతోంది. మా అత్తగారు పోయి కూడా అంతే కాలం అయింది. అప్పటి నుంచీ మా ఇద్దరి మధ్యా గొడవలు జరుగుతూనే ఉన్నాయి. మా వదినని వెంటబెట్టుకుని సురేఖ మా ఇంటికి వచ్చాక ఈ గొడవలు పరాకాష్ఠకి చేరుకున్నాయి. అన్నయ్యకి మొదట ఆడపిల్ల పుట్టింది. వదిన మళ్ళీ కడుపుతో ఉందని తీసుకువచ్చింది. ఆగ్రాలో ఉండే వదిన ఇంతదూరం ఎందుకు వచ్చిందో తరువాతగానీ నాకు అర్థం కాలేదు.

ఈసారి ఆడపిల్ల పుడుతుందా? మగపిల్లాడా? అని స్కాన్ చేయించి తెలుసుకునేందుకు వదినని ఒప్పించి సురేఖ గ్వాలియర్‌కి తీసుకువచ్చింది. స్కానింగ్‌లో ఆడపిల్లే అని తేలాక సురేఖ వదినని అబార్షన్ చేయించుకోమంది. నాకు తెలిసిన లేడీ డాక్టర్ చిరునామా అడిగి సురేఖ వదినని ఆవిడ దగ్గరకి తీసుకెళ్ళింది. నరోత్తమ్ అప్పుడు ఊళ్ళో లేడు. స్కానింగ్‌కీ, ఆపరేషన్‌కీ వాళ్ళు డబ్బులు తీసుకోలేదు. నరోత్తమ్ బంధువులమని సురేఖ చెప్పి ఉంటుంది. ఆయన పని ముగించుకుని వెనక్కి వచ్చాక సురేఖనీ, వదిననీ చూసి ముందు ఆశ్చర్యపోయారు. ఆ తరువాత జరిగిన విషయం విని కోపంగా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయారు. నేను ఆయన వెనకాలే వెళ్ళాను. వెంటనే తలుపులు మూసి నా మీద అరవడం మొదలెట్టారు. తన పలుకుబడిని ఉపయోగించుకుని ఇలాంటి పనులు చెయ్యడం తనకి ఎంతమాత్రం ఇష్టంలేదని స్పష్టంగా చెపుతూ ఉండగా తలుపు తోసుకుని సురేఖ లోపలికి వచ్చింది. మా మాటలు బయటికి వినిపించినట్లున్నాయి. తలుపు తట్టాలన్న ఇంగిత జ్ఞానం కూడా లేదు తనకి.

లోపలికి వస్తూనే.. "నరోత్తమ్! రత్నని ఎందుకు కోప్పడుతున్నారు? మీ పదవి వల్ల మాకు పనులు సమకూరితే అందులో తప్పేముంది? మేమేం పరాయి వాళ్ళమా? డబ్బులిచ్చి ఈ పని చేయించుకోవాలంటే ఇంతదూరం రావడమెందుకు? ఆగ్రాలో డాక్టర్లు లేరా? మీకంత బాధగా ఉంటే ఆ డాక్టర్లకి ఏవైనా కానుకలు పంపిస్తాంలెండి!" అనేసి వెళ్ళిపోయింది.

ఆ సంఘటన మా ఇద్దరి మధ్యా చాలా రోజులవరకూ సయోధ్య లేకుండా చేసింది.

***జూన్ 21, 1981***

ఆ గొడవ తాలూకు ప్రభావం నుంచి ఇంకా బయటపడక ముందే ఇంకో సమస్య ఎదురైంది. దాదాపు రెండేళ్ళ క్రితం నాన్న ఆగ్రా హౌసింగ్ బోర్డు వారి ప్లాట్ ఒకటి నరోత్తమ్ చేత కొనిపించారు. మా ఆయనకి ప్లాట్ కొనడం మొదట్లో ఇష్టంలేదు. కానీ నేనూ, నాన్నా అదేపనిగా పోరేసరికి తన ప్రావిడెంట్ ఫండ్ లోంచి డబ్బు తీసి కొన్నారు. ఆ ప్లాట్ నా పేరే ఉంది. నా ప్లాట్ పక్కనే నాన్న కూడా ప్లాట్ కొనుక్కున్నాడు. మాది మంచి స్థలం. తొంభై అడుగుల రోడ్డు పక్క కార్నర్ ప్లాట్ అది. ఆ ప్లాట్‌ని అమ్మెయ్యమని నరోత్తమ్ మా నాన్నకి చెప్పారు. కానీ నాన్న తన ప్లాట్ అమ్మి ఆ డబ్బు మాకిచ్చి నా పేర్న ఉన్న ప్లాట్‌ని మా తమ్ముడి పేర రాయించాడు. ప్లాట్‌కి సంబంధించిన కాయితాలూ అవీ సంతకం చేసేందుకు నేనూ, మా ఆయనా ప్రాపర్టీ డీలర్ దగ్గరకి వెళ్ళినప్పుడు, మా ప్లాట్ మా నాన్న ప్లాట్‌కన్నా రెండు లక్షలు ఎక్కువని చెప్పాడు. నరోత్తమ్‌కి నాన్న చేసిన పని ఏమాత్రం నచ్చలేదు.

ఆయనతో ఏమీ అనకుండా నాతో "మీ నాన్న ఇంత మోసం చేస్తాడని నేను అనుకోలేదు" అన్నారు.

నాన్న చేసిన పని తప్పని నాకు తెలుసు. అయినా "మా నాన్నని అంత మాట అంటారా?" అంటూ మా ఆయనతో పోట్లాట పెట్టుకున్నాను. ఇద్దరం చాలాసేపు మాటా మాటా అనుకున్నాం. అది చిలికి చిలికి గాలివాన అయింది. దాంతో నాతో నరోత్తమ్ చాలారోజులు మాట్లాడలేదు. నేను కూడా మూతి ముడుచుకుని కూర్చున్నాను. ఇద్దరం మొండి వాళ్ళమే! ఇంతలో ఈయన ఆఫీసులోని పై అధికారికి బదిలీ అయింది. పార్టీ ఇవ్వాలి. అందుకని నాతో మాట్లాడక తప్పలేదు మా ఆయనకి.

***నవంబరు 08, 1982***

ఈమధ్య నరోత్తమ్ ప్రతి చిన్న విషయానికీ పోట్లాడుతున్నారు.

"మీరందరూ సుఖంగా ఉండేందుకు నేను పగలనక రాత్రనక ఒళ్ళు హూనం చేసుకుంటున్నాను. నీకేం హాయిగా నీడపట్టున ఇంట్లో ఉంటున్నావు! అయినా నువ్వు నా ఇష్టాయిష్టాలు పట్టించుకోవడం బొత్తిగా మానేశావు" అనడం ఆయనకి పరిపాటి అయింది.

అలా అంటున్నప్పుడు నేనూ ఊరుకోను! మాటకి మాట జవాబు చెపుతాను.

"మీరు మహా ఘనకార్యమేం చెయ్యడం లేదు లెండి. చౌకీదార్ అయినా కలెక్టర్ అయినా ఒకటే! వాళ్ళ వాళ్ళ పనులు చేస్తున్నారు, అంతేగా! ఎంత చిన్న నౌకరీ చేసే వాడైనా పెళ్ళాం పిల్లల్ని పోషించవల

## కొత్తగాలి... 

**కలుపును తొలగిస్తేనే**
**పైరు బాగా పండేది**
**అవినీతిని అంతమొందిస్తేనే**
**అందరం బాగుపడేది!**

*– అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

## కొత్తగాలి...

**గెలిచేవాళ్లు ముందుంటారు**
**ఓడేవాళ్లు వెనకున్కంటారు**
**అవినీతి నాయకులను గెలిపిస్తే**
**మనం ఎప్పటికీ వెనకే ఉంటాం!**

– నల్లపాటి సురేంద్ర,
పెదగంట్యాడ, విశాఖ జిల్లా

సిందే! ఇందులో మీరు మాకు చేస్తున్న ఉపకారమేమీ లేదు. నేను కలెక్టర్ పెళ్ళాం అవడం యాదృచ్ఛికం!" అంటాను.

ఎన్నోసార్లు 'ఇంతకన్నా ఏ క్లర్కుకో చౌకీదార్‌కో నేను పెళ్ళాన్నయినా బావుండేది' అనే మాటలు నాలిక చివరిదాకా వచ్చేవి. నాకు జరిగిన ఆపరేషన్ వల్ల, మా ఇద్దరి మధ్యా ఏర్పడిన సమస్య వల్ల కూడా ఈ గొడవలు ఎక్కువ కాసాగాయి. గ్వాలియర్ నుంచి బదిలీ అయితేగానీ మా పరిస్థితి బాగుపడదన్న నమ్మకం ఎందుకో కలిగింది నాకు.

***జనవరి 06, 1990***

నరోత్తమ్‌కి ప్రమోషన్ వచ్చింది. మళ్ళీ మా ఊరికే వేశారు. మళ్ళీ అక్కా, బావా మా జీవితంలో ప్రవేశించారు. బావ ఇన్‌కమ్‌టాక్స్ విభాగంలో పెద్ద హోదాలో ఉన్నారు. నాకు మొదటి నుంచీ నగల మీద మోజు లేదు. కానీ సురేఖ తన వెంట నన్ను కూడా నగల షాపింగ్‌కి రమ్మంటుంది. నేనలా అక్క వెంట వెళ్ళడం నరోత్తమ్‌కి ఇష్టం లేదు. వెళ్లొద్దని నాతో చాలాసార్లు అన్నారు. కానీ రానని ఎలా చెప్పాలో తెలీలేదు. సురేఖ ఎప్పుడూ నాకు జీవితాన్ని ఆనందంగా అనుభవించమనీ, అలా సన్యాసినిలాగ ఉండొద్దనీ చెపుతూనే వుంటుంది. కానీ నరోత్తమ్‌కి నేను సింపుల్‌గా ఉంటేనే ఇష్టం. సురేఖ మాత్రం నన్ను ఫ్యాషన్‌గా ఉండమని నా బుర్ర తినేస్తూ ఉంటుంది. వాళ్ళిద్దరి మధ్యా చిక్కుకున్నాను!

***ఫిబ్రవరి 02, 1990***

ప్రసవం తరువాత నాకు జరిగిన ఆపరేషన్ వల్ల మా ఇద్దరి మధ్యా ఏర్పడిన లైంగిక సమస్య గురించీ, మావారు నా పట్ల కనబరుస్తున్న అయిష్టత గురించీ సురేఖకి చెప్పుకున్నాను.

"అది అంతేలే! పెళ్ళాం పాతబడిపోయాక, మగాళ్ళ చూపులు యవ్వనంలో ఉన్న అమ్మాయిలవైపు మళ్ళుతుంటాయి. 'కొత్త ఒక వింత, పాత ఒక రోత' అన్న సామెత వినలేదా నువ్వు? ఎందుకైనా మంచిది! మీ ఆయన మీద ఒక కన్ను వేసి వుంచు!" అని ఒక వంకర నవ్వు నవ్వుతూ సలహా పారేసింది.

తను అలా అన్నాక 'దాంతో ఎందుకు నా సమస్య చెప్పానా?' అనుకున్నాను. తనకి అన్నిటిలోనూ మైనస్ పాయింట్లూ, ప్రతికూలతలే కనిపిస్తాయి. పైగా స్త్రీ పురుషుల మధ్య ఎక్కడెక్కడ అక్రమ సంబంధాలు ఉన్నాయో? ఆ చిట్టా అంతా తన దగ్గర రెడీగా ఉంటుంది. తన ఎదురింట్లో ఉండే మేజిస్ట్రేట్ నపుంసకుడనీ, అతని భార్యకీ తమ ఇంట్లో పనిచేసే తోటమాలికీ సంబంధం ఉందనీ చెప్పింది ఆ మధ్య!

***ఏప్రిల్ 17, 1991***

సురేఖ ఇచ్చిన గొలుసు నాకో పెద్ద తలనొప్పిగా తయారైంది. నేను ఉంచుకుంటానంటే నరోత్తమ్ మండిపడ్డారు. నాకొద్దు తీసుకోమని సురేఖతో అంటే అది కన్నీళ్ళు పెట్టుకుంది.

"మనిద్దరం ఒక తల్లి బిడ్డలం! నీకు ఒక చిన్న గొలుసు కొనిచ్చే తాహతు, హక్కు కూడా నాకు లేదా?" అంది బాధగా.

నా పుట్టినరోజని కూడా చూడకుండా నరోత్తమ్ నాతో ముభావంగా ప్రవర్తించారు. అయినా ఈ మధ్య నేనేం చేసినా

ఆయనకి అందులో ఏదో ఒక తప్పు కనిపిస్తోంది. సురేఖ నా పుట్టినరోజు పార్టీ ఏర్పాటు చేసిందని ఆయనకి కోపం వచ్చింది. ఆఫీసర్లందరికీ ఇలా తమ కుటుంబ సభ్యుల పుట్టినరోజు అనో, తమ పెళ్ళిరోజు అనో పార్టీలు ఇవ్వడం అలవాటే! ఎంతోమందిని పిలుస్తారు. కానుకలు అందుకుంటారు. కానీ నరోత్తమ్‌కి ఇలాంటివి మా ఇంట్లో జరపడం సుసేమిరా నచ్చదు. కలెక్టర్‌గిరీ చేస్తున్నప్పుడు కలెక్టర్ హోదాకి తగినట్టు ఉండొద్దా? పిల్లలు కూడా నిరాశపడతారు. నాకు ఊపిరాడనట్టు ఉంటోంది ఈ మధ్య.

*ఏప్రిల్ 21, 1991*

సురేఖ నాకిచ్చిన బంగారు గొలుసు గురించిన గొడవ నిన్ననే ఒక కొలిక్కి వచ్చి ఇద్దరం సమాధానపడ్డాం. ఇంతలో ఇవాళ ఆయన పాత స్నేహితురాలు - ఎవరో స్వాతి అట - వచ్చీ రాగానే నేనక్కడ ఉన్నానని కూడా పట్టించుకోకుండా మా ఆయన్ని గట్టిగా వాటేసుకుంది. ఇంత సిగ్గుమాలిన ఆడ స్నేహితులు ఈయనకు ఉన్నారని తెలీదు నాకు! ఆవిడగారు పదిహేనేళ్ళ క్రితం ఈయన ఐ.ఎ.ఎస్. బ్యాచ్ మేట్ అట! మెడికోలు తమకు తగిన మెడికోల కోసం చూస్తుంటారనీ, ఐ.ఎ.ఎస్. శిక్షణ క్యాంప్‌లలో అలాగే ఆఫీసర్లూ మ్యాచ్‌ల కోసం వల వేసే క్రమంలో ప్రేమ వ్యవహారాలు నడుపుతారనీ విన్నాను.

"ఈవిడ వ్యవహారం చూస్తూంటే మీరిద్దరూ ఒకప్పటి ప్రేమికులనిపిస్తోంది! అంత ప్రేమే ఉంటే మీ ఇద్దరూ పెళ్ళిచేసుకోకపోయారా? ఇంకా ఆవిడగారు పెళ్ళి చేసుకోలేదట! చూడటానికి బాగానే వుంది. మంచి పదవిలో ఉంది.. కలెక్టర్‌గానే! ఇక ఎవడో ఒక మగాడితో కాలం గడుపుతోందేమో! అడిగే వాళ్లెవరున్నారు? కానీ మీకలా కాదు, పెళ్ళాం పిల్లలున్నారు. ఇలాంటి వాళ్ళని చూసే కాబోలు మీకు నా మీద మోజు పూర్తిగా తగ్గిపోతోంది. ఇద్దరు పిల్లల తల్లిని, స్వాతిలా ఒంపు సొంపులూ, బిగువూ నాకెలా ఉంటాయి?" అన్నాను కసిగా!

నా మాటలకి ఆయన కోపంతో రెచ్చిపోయారు. రాత్రి రెండు పెగ్గులు తాగి, కాంపోజ్ మాత్ర వేసుకుని పడుకున్నారు.

నాకేం పట్టింది. ఏమైనా చేసుకోనీ! కానీ నేను మాత్రం మళ్ళీ లేడీ డాక్టరుకి చూపించుకోవడం లేదు. ఈయనగారి సుఖం కోసం నా శరీరాన్ని బాధకి గురిచెయ్యలేను. మళ్ళీ ఆపరేషన్ అదీ అంటే నా వల్ల కాదు భరించడం.

*మే 27, 1991*

ఈ రోజు నరోత్తమ్ చేసిన పని నమ్మశక్యం అనిపించలేదు. అలాంటి పని ఆయన చేస్తారని నేను ఊహించను కూడా లేదు. లంచం తీసుకుంటున్నాడన్న అబద్ధపు కేసులో మా బావగారిని ఎవరో ఇరికించారు. పాపం సురేఖ మా ఆయన దగ్గరికి ఆఫీసుకి పరిగెత్తుకెళ్ళిందట. కష్టాలొచ్చినప్పుడు మనం సాయం కోరేది మనవాళ్ళనే కదా? కానీ సాయం చేసేందుకు నరోత్తమ్ సురేఖని అలాంటి కోరిక కోరతారని ఏనాడూ అనుకోలేదు నేను. కానీ సురేఖ తన పిల్లల మీద ఒట్టేసి అలా అన్నాడని చెప్తే నమ్మక తప్పలేదు. అంతే కాదు, మా పిన్నికీ ఈయనగారికీ గతంలో ఉన్న సంబంధం గురించి కూడా చెప్పింది. మా పిన్నితో తనకున్న సంబంధం నిజమేనని మా ఆయన కూడా అంగీకరించారు.

నేను వెంటనే పుట్టింటికి వచ్చేశాను. నేను వచ్చేసరికి నాన్న ఇంట్లో లేడు. మా పిన్ని పోయి రెండేళ్ళవుతోంది. బతికుంటే ఆవిడని నిలదీసేదాన్నే! ఆ విషయం చెప్పకుండా దాచి నా సొంతవాళ్ళే ఇంత అన్యాయం చేస్తారా? నా బతుకు గంగలో కలిపి, నన్నా నరక కూపంలోకి తోసేం

దుకు నన్ను కన్నవారికి మనసెలా ఒప్పింది? నేను శోకాలు పెట్టి అమ్మని సంజాయిషీ అడిగాను. ఆమె ఏమీ సమాధానం ఇవ్వకుండా ఏడవడం మొదలుపెట్టింది. ఇక చస్తే నరాధముడిలాంటి నరోత్తమ్ దగ్గరకి వెళ్ళకూడదనీ, ఏదో ఒక ఉద్యోగం చేసి పిల్లల్ని నేనే పెంచి పెద్ద చెయ్యాలనీ నిర్ణయించుకున్నాను.

*మే 29, 1991*

నిన్న ఆయనగారు వచ్చారు. ఆయన్ని నానా మాటలూ అన్నాను. "మీ బావ చేసిన తప్పుకి ఫలితం అనుభవించక తప్పదు" అన్నారాయన.

వెంటనే "మీరు మా అక్కయ్యని కోరిన కోరిక మాటేమిటి? మా పిన్నితో మీరు నడిపిన వ్యవహారం తప్పు కాదా? ఆ నేరానికి మీరు శిక్ష అనుభవించారా?" అని నిలదీసేసరికి జవాబు చెప్పేందుకు మొహం చెల్లక గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

ఇక నేనా నరకంలో అడుగుపెట్టడం కల్ల! ఏం? ఒక ఆడది ఒంటరిగా బతకలేదా? ఆయనకి సులభంగా విడాకులు మాత్రం ఇవ్వను. ఇస్తే వెంటనే తన స్వేచ్ఛని దుర్వినియోగం చేసుకోరూ? విడాకుల కేసు ఎంత కాలం కొనసాగితే అంత లాభం నాకు. అంత సులభంగా వదుల్తానా ఆయన్ని?

*మే 30, 1991*

మగాళ్ళందరూ ఒకేరకం. నాన్న ఇవాళ వెనక్కి వచ్చాడు. అమ్మ ఆయనకి ఏం చెప్పిందో తెలీదు.

నా దగ్గరకి వచ్చి "చూడమ్మా! పెళ్లయాక ఆడదానికి భర్త ఇల్లే సర్వస్వం! లే! లేచి సామాను సర్దుకో! నిన్ను నీ ఇంట్లో దింపివస్తాను" అన్నాడు.

నేను ఎదురు చెప్పలేకపోయాను. ఆయన మాటకి ఎదురు చెప్పే ధైర్యం అసలు ఇంట్లో ఎవరికీ లేదు. అన్నయ్య ఇక్కడ ఉంటే ఏమైనా కల్పించుకునేవాడేమో! అయినా వాడూ మగాడేగా! ఇక ఇష్టం లేకపోయినా నాన్న మాట వినాల్సి వచ్చింది. మళ్ళీ ఆ నరకంలోకి..!

ఇరవై ఒకటో శతాబ్దంలోకి అడుగుపెడుతున్నా ఆడదానికింకా స్వేచ్ఛ లేదు. ఎవరో ఒక మగాడి నీడలో బతకాల్సిందేనా?

కానీ నేను అబలని కాను. నరోత్తమ్‌తో కలిసి ఒకే ఇంట్లో ఉంటూ ఆయన మీద పగ తీర్చుకుంటాను. నాకు ఇంత బాధ కలిగించి తను మాత్రం సుఖంగా ఎలా ఉంటారో? చూస్తాను. అందరూ తమ తమ స్వార్థం చూసుకుంటున్నప్పుడు నేను మాత్రం నోరుమూసుకుని ఎందుకు అన్నీ భరించాలి? ఇక చూసుకోండి! ఈ చెవిటి సమాజం ముందు గొంతు విప్పి 'నువ్వు కప్పుకున్న ముసుగుని పీకేసి నీ అసలు స్వరూపం ఏమిటో చెపుతాను! అదే నా జీవిత లక్ష్యం నరోత్తమ్! మా పిన్నితో నువ్వు నడిపిన రహస్య వ్యవహారం తరువాత అదే కుటుంబంలోని నన్ను సిగ్గులేకుండా పెళ్ళాడావు. ఇప్పుడు నీకు మా అక్క కూడా కావలసివచ్చిందా? ఎంత మోసం? ఇక నాకు తెలీకుండా ఎంతమందితో ఇలా ప్రేమాయణాలు నడిపావో! ఇంకా నడుపుతూనే ఉన్నావేమో? నాకేం తెలుసు? నీకు దారంతా పూలబాటే కాదు. నేనిప్పుడు ముళ్ళు పరవబోతున్నాను చూడు!' అని అరవాలనిపించింది నాకు.

*జూన్ 04, 1991*

మా ఆయనకి నరకం చూపించటం మొదలెట్టాను. కావాలనే ఆయనకి బాధ కలిగించే పనులు చేస్తున్నాను. నా బాధలు తట్టుకోలేకేమో మా బావగారిని తన పరపతి ఉపయోగించి ఆయన విడిపించారు. సురేఖ ఇదంతా నా చలవేనని అనుకుంటోంది. బావగారు కూడా 'రాయిలాంటి మనిషిని మైనం ముద్దలా కరిగించేశావు' అని నన్ను పొగిడారు. కానీ నాకు

అ
క్ష
రం

అధికారం మీద ఉండే ప్రేమను
జయించినపుడు
ప్రపంచం ప్రశాంతంగా ఉంటుంది

– జిమి హెన్రిక్స్



నరోత్తమ్‌ని చూస్తేనే రోత పుడుతోంది. తనకీ మా పిన్నికీ మధ్యన జరిగిన వ్యవహారం మాకు పెళ్ళి అవకముందే జరిగిందే అయినా, చేసిన తప్పుకి ఎవరైనా సరే.. ఎప్పుడైనా సరే శిక్ష అనుభవించాల్సిందే కదా!

నరోత్తమ్ నాకు ద్రోహం చేశావు కదూ! నువ్వు మాత్రం సుఖంగా ఎలా ఉండగలవు? నా తడాఖా ఏమిటో చూపిస్తాను ఉండు! మన ఈ పెళ్ళి జరగడంలో నీ తప్పేమీ లేదంటున్నావు కదూ! అదంతా నువ్వు, మా పిన్ని కలిసి చేసిన కుట్ర. నువ్వు నిజాయితీగల వాడివైతే మన పెళ్ళికి ఒప్పుకోకుండా ఉండేవాడివి. మీ అమ్మ ఈ పెళ్ళి చేసుకోమని నిన్ను అడిగిందని అన్నావు. నీ గతం తెలిసి ఉంటే మీ అమ్మని అంత బాగా చూసుకునేదాన్నా?

ప్రభాస్, స్వప్న కూడా మా ఇద్దరి మధ్యా గొడవలతో విసిగిపోయారు. 'ఇదంతా ఏమిటమ్మా?' అని నన్ను నిలదీస్తున్నారు. 'సర్వగుణ సంపన్నుడు మీ నాన్న ఉన్నారుగా, ఆయన్నే అడగండి!' అని చెపుతున్నాను. పిల్లలిద్దరికీ నా మీదే జాలి. ఇద్దరూ వాళ్ళ నాన్నతో మాట్లాడడం మానేశారు. ఆయన వాళ్ళని ఏమైనా అడిగితే ముక్తసరిగా జవాబు చెపుతున్నారు అంతే!

ఈ మధ్య ఎక్కువ సమయం నరోత్తమ్ బయటే గడుపుతున్నారు. నేను మాత్రం తక్కువ తిన్నానా? డ్రైవర్నీ, ఆయనగారి పీఏనీ అడిగి రోజంతా ఆయన ఎక్కడెక్కడ తిరుగుతున్నారో? ఏమేం చేస్తున్నారో? తెలుసుకుంటున్నాను. ఆయన కలుసుకునే ఆడవాళ్ళు ఎవరు? వాళ్ళతో సరదాగా నవ్వుతూ మాట్లాడుతున్నారా? లాంటి వివరాలు తెలుసుకుంటున్నాను. ఆడవాళ్ళెవరినైనా కలుసుకున్నారని తెలిస్తే.. 'ఆవిడతో ఏం మాట్లాడారు?' అని అడుగుతున్నాను. అప్పుడు ఆయన మొహం చూడాలి!

కానీ రోజూ నేనిలా అడగడం మామూలైపోయి నాకు జవాబు చెప్పడం మానేశారు! దాంతో నాకు ఆయన మీద కోపం, అసహ్యం పెరిగిపోసాగాయి.

**సెప్టెంబరు 21, 1991**

నరోత్తమ్‌ని ఏడిపించడంలో పిల్లలిద్దరూ నాకు సాయం చేస్తున్నారు. ఈ మధ్యన మా వల్ల కలిగే బాధలని తట్టుకునేందుకు ఆయన తాగడం మొదలెట్టారు. 'మాకేం పట్టింది? ఇష్టమొచ్చినంత తాగండి! పర్యవసానం మీరే అనుభవిస్తారు!' అనుకునే దాన్ని. ప్రభాస్‌కి పరీక్షల్లో చాలా తక్కువ మార్కులు వచ్చాయి. బావగారు సాయం చేసి వాణ్ణి ఇంజినీరింగ్ చదివేందుకు డొనేషన్ కట్టి కాలేజీలో చేర్పించారు. లేకపోతే వాడి భవిష్యత్తు ఏమయేదో? నరోత్తమ్ మాట్లాడడం పూర్తిగా మానేశారు. ఎవరితోనూ మాటల్లేవు. నౌకర్లు కూడా ఆయన్ని చూసి చాటుగా నవ్వుతున్నారు. మునుపు ఆయన్ని ఎవరైనా అంటే బాధపడేదాన్ని! కానీ ఇప్పుడు అవే మాటలు నాకు సంతోషాన్ని కలిగిస్తున్నాయి. 'ఏమయింది నాకు? హాయిగా సాగుతున్న జీవితం ఇలా గాడి తప్పిందేమిటి?' అని

అప్పుడప్పుడూ అనిపించే మాట నిజమే! కానీ తప్పు చేసింది నరోత్తమ్, నేనెందుకు బాధ పడాలి?

సురేఖ ఈ మధ్య మా ఇంటికి రావడం లేదు. ఫోన్లోనే మాట్లాడుకుంటున్నాం. ఒక్కోసారి అది నవ్వుతూ, 'పాపం ఇంక చాలే! అతను ఎవరూ లేని అనాథ! క్షమించెయ్యరాదూ?' అంటుంది. కానీ నరోత్తమ్‌ని బాధపెట్టడం నాకొక వ్యసనంగా మారిపోయింది. అతనితో పోట్లాడకపోతే ఆ రోజిక నాకు నిద్ర పట్టదు. నాకు పిచ్చి గాని పట్టడం లేదు కదా!

***అక్టోబరు 19, 1991***

ఈయనగారు నాకు మతి చెడిందని అనుకుంటున్నారు. నన్ను సైకియాట్రిస్ట్ దగ్గరకి ఒకసారి తీసుకెళ్ళారు. లాటరీలో దొరికిన యాభైలక్షలు నాకిచ్చి కోల్పోయిన సుఖాన్ని కొనుక్కోవాలని చూస్తున్నారు. 'లేదు నరోత్తమ్! నిన్ను సుఖపడనివ్వను!' అనుకున్నాను. పోట్లాటల్లో ఎప్పుడూ నాదే పై చెయ్యి అవడంతో పొగరు నా తలకెక్కింది. ఆ మత్తులో ఎప్పుడూ కయ్యానికి కాలు దువ్వుతూ, స్త్రీ శక్తి అంటే ఏమిటో ఆయనకి తెలియజేయాలని ఎప్పుడూ సిద్ధంగా ఉంటాను. ఆయన నిస్సహాయత చూస్తే అప్పుడప్పుడూ మనసు కరిగిపోయేది. కానీ ప్రతీకారం తీర్చుకోవాలన్న కసి ఆ జాలిని జయిస్తుంది. మళ్ళీ, 'నేను నరోత్తమ్‌ని బాధపెట్టి సాధించేది ఏముంది? తప్పు చేస్తున్నానా? దీనివల్ల నా సంసారం దెబ్బతినడం లేదా? ఏదోవిధంగా పరిస్థితులు బాగుపడితే బావుణ్ణు!' అనే ఆలోచన కూడా వస్తుంది. ఇలా రెండు రకాల భావాల మధ్య ఊగిసలాడుతూ బతకడం నాకూ కష్టంగానే ఉంది.

సైకియాట్రిస్ట్ మా ఇద్దరితో విడివిడిగానూ, ఇద్దర్నీ ఒకేసారి కూర్చోబెట్టి మాట్లాడాడు.

చివరికి "మీరిద్దరూ అనవసరంగా గొడవ పడుతున్నారు. ఎంతసేపూ ఎదుటి మనిషిలో లోపాలు వెతుకుతున్నారే తప్ప, ఈ గొడవలు మీ జీవితాలని ఎలా పాడు చేస్తున్నాయో మీరు గమనించడం లేదు" అన్నాడాయన.

క్లినిక్‌లో కూర్చుని ఆయన చెప్పేది వింటున్నప్పుడు, 'అది నిజమే!' అనిపించింది నాకు. కానీ రెండు మూడు రోజుల తరువాత నరోత్తమే డాక్టర్ని అలా చెప్పమని చెప్పి ఉంటాడని అనిపించింది. అతని ఎత్తు పారనివ్వకూడదు అనుకుని మళ్ళీ ఆయనతో చీటికీ మాటికీ పోట్లాడడం మొదలెట్టాను. ఇప్పుడు ఆయన కూడా నోరుమూసుకుని ఊరుకోవడం లేదు. ఇల్లు రణరంగంలా మారింది. మా నాన్న తనని మోసం చేసి ప్లాటు లాక్కున్న విషయం ఎత్తి దెబ్బలాడుతున్నారు. ఆ అమ్మకాలు నన్నడిగే చేశారా? అంటూ ఆయన్ని నిలదీస్తున్నాను.

"మా అన్నయ్యకీ, వదినకీ ఉద్యోగాలు ఇప్పించి చాలా సాయం చేశాను" అని అంటూ ఉంటారు.

"అసలు మా నాన్న సాయం చెయ్యకపోతే పట్నంలో మీ చదువెలా సాగేది? ఐ.ఎ.ఎస్. అసలు ఎలా చేసేవారు" అని దెప్పుతాను.

"మీ నాన్న చేసిన సాయానికి ఏం చేస్తే నా రుణం తీరుతుంది? వడ్డీ తీర్చడంతోనే నా బతుకు తెల్లవారేటట్టుంది" అంటూ తల బాదుకుంటారు నరోత్తమ్.

"అది సరే! మరి పిన్ని వ్యవహారం మాటేమిటి? ఆ రుణం ఎలా తీరుస్తారు?" అని నేననగానే ఎర్రబడిన మొహంతో తడబడే నరోత్తమ్ మొహం చూసి తీరవలసిందే! నా మీద చెయ్యిచేసుకునేంత ధైర్యం లేదాయనకి. కానీ ఒక్కోసారి నాకు ఈ జీవితంతో, ఈ దెబ్బలాటలతో అలిసిపోయానని అనిపిస్తూ ఉంటుంది.

***జనవరి 26, 1992***

నరోత్తమ్ ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించారు. అది అంతా నటన అని నాకు తెలుసు. నాకు చెడ్డపేరు తెచ్చేందుకే అలా చేశారు. లేకపోతే నర్మదా నదిలో దూకడానికి వెళ్ళిన వాళ్ళెవరైనా బతికి బట్ట కట్టారా? అసలు ఆయన అందులో మునిగి చనిపోయుంటే బావుండేది! ఆ వంకన నాకు ఏదో ఒక ఉద్యోగమైనా దొరి కేది. కానీ ఆయన నన్ను జీవితాంతం పీడించేందుకే చావకుండా బతికినట్టు ఉన్నారు. జీవచ్ఛవంలా మిగిలున్న ఆయ నతో కలిసి ఆయనకు సేవలు చేస్తూ ఆ ఇంట్లో ఎలా ఉండగలను? అక్కడ ఉండ టంలో నాకు ఎటువంటి అర్థం కనిపించ లేదు. అందుకే ఆ ఇల్లు వదిలేసి మా పుట్టింటికి వచ్చేశాను. బావగారి సలహాతో ఎప్పుడో మా ఊళ్ళో నా పేరు మీద ఒక ప్లాట్ కొనుక్కోవడం మంచిదైంది. దాన్ని అమ్మగా వచ్చిన డబ్బు బ్యాంకులో వేసుకు న్నాను. ఆ డిపాజిట్ మీద వచ్చే వడ్డీతోనే నా జీవితం గడిచిపోతోంది. అవసరమైతే ఏదైనా ఉద్యోగం చేసుకుంటానే తప్ప, ఆ మోసగాడితో కలిసి బతకలేను. నాన్న కూ డా పోయాడు. ఇక నన్నా నరక కూపం లోకి బలవంతంగా నెట్టేవాళ్ళెవరూ లేరు.

అమ్మకి విచారంగా ఉంది. కానీ నాతో ఏమీ అనే ధైర్యం లేదావిడకి. అక్కా బావా అప్పుడప్పుడూ నరోత్తమ్‌ని చూసివస్తూనే ఉన్నారు. ఆత్మహత్యకు ప్రయత్నించి విఫ లమైన దగ్గర్నుంచి అతను ఏమీ మాట్లా డడం లేదనీ, ఎవరేం అడిగినా 'ఏం లాభం లేదు!' అనే జవాబు తప్ప మరో మాట లేదనీ సురేఖ ఫోన్ చేసి చెప్పేది. ఇదంతా ఉత్త నాటకం. నేను మళ్ళీ తన దగ్గరకి వెళ్ళాలనే ఆయన అలా మా వాళ్ల దగ్గర నటిస్తున్నారని గ్రహించాను. కానీ ఛస్తే నేను మళ్ళీ అక్కడికి వెళ్లను.

*జులై 10, 1995*

కొన్నాళ్లు ప్రైవేట్ కాలేజీలో పార్ట్‌టైమ్ లెక్చరర్‌గా పనిచేసి ఈ రోజే దానికి స్వస్తి

**కొత్తగాలి...**

**'స్వచ్ఛ భారత్' అంటే కాని**
**చీపురు పట్టవా?**
**నిన్ను నీవు శుభ్రపరచుకోడానికీ**
**నినాదం కావాలా?**

– నేమాన సుభాష్ చంద్రబోస్,
విశాఖపట్నం

చెప్పాను. అక్కడ కూడా మగాళ్లు ఆడవా ళ్లని ప్రశాంతంగా బతకనివ్వరు! ప్రిన్సిపల్ దగ్గర్నించీ తోటి మగలెక్చరర్ల దాకా అందరి దృష్టీ ఆడదాని శరీరం మీదే. నరో త్తమ్‌తో కలిసి ఉన్నప్పుడు అందరూ నన్ను ఎంతో గౌరవంగా చూసేవారు! తలెత్తి నా వైపు చూడడానికి కూడా భయపడేవారు. ఎటువంటి అర్హతలూ, పదవులూ లేకపో యినా కలెక్టర్‌గారి భార్య అయినందువల్ల రెడ్‌క్రాస్, ఇతర ప్రభుత్వ సేవా సంస్థలకి అధ్యక్ష పదవి దొరికేది. అక్కడ జరిగే కార్యక్రమాల్లో తీసే ఫొటోలు మర్నాడు అన్ని పేపర్లలోనూ వచ్చేవి. నా ఫొటోలు పేపర్లో పడ్డాయని ఎంత మురిసిపోయే దాన్నో! ఏవైనా ప్రారంభోత్సవాలూ గట్రా చేయించాలంటే కలెక్టర్ భార్యకి వీలున్న తేదీల్లోనే వాటిని జరిపించేవారు. నా నోటి వెంట 'సరే' అనే మాట రప్పించడానికి ఎన్ని ప్రయత్నాలు చేసేవారో? అంత గౌరవం దక్కేది నాకు.

కానీ ఇప్పుడు నేను కలెక్టర్ భార్యని కాను కదా? ఇప్పుడు భర్త వదిలిపెట్టిన స్త్రీని! నిజమే! నేనే నరోత్తమ్‌ని వదిలి వచ్చే శాను. కానీ లోకం దృష్టిలో ఆయన వది లేసిన ఆడదాన్ని నేను. నా మీద అందరికీ హక్కున్నట్టే ప్రవర్తిస్తారు. ఇంతకు ముందు నేను పుట్టింటికి వచ్చానని తెలి

యగానే ఇక్కడున్న ఆఫీసర్ల భార్యలు నన్ను భోజనానికి రమ్మని డిన్నర్లు ఏర్పాటు చేసేవాళ్లు. ఇప్పుడు నేనెవరో తెలీ నట్టే ప్రవర్తిస్తున్నారు. డ్రైవింగ్ లైసెన్స్ రెన్యువల్ కోసం ఆఫీసు చుట్టూ ఎన్ని చక్కర్లు కొట్టానో లెక్కలేదు. చివరికి మధ్య వర్తికి రెండు వందలు ముట్టచెబితేగానీ పని జరగలేదు.

***ఆగస్టు 08, 1995***

ఇవాళ ప్రభాస్ ఫోన్ చేశాడు. ఆఖరి సంవత్సరం మంచి మార్కులతో పాసయా ననీ, ఏదో అమెరికన్ కంపెనీలో ఉద్యోగం వచ్చిందనీ, రేపే అమెరికా వెళ్లి పోతున్నా ననీ చెప్పాడు. ఆ రెండు ముక్కలూ చెప్పి ఫోన్ పెట్టేశాడు. అంతే నా పిల్లలు కూడా నాకు కాకుండా పోయారు. నన్ను కలిసేం దుకు రావడం తక్కువే! సెలవుల్లో సురేఖ దగ్గరకి వెళ్లి వాళ్ల పెదనాన్న సలహా తీసు కుంటారు. కానీ డబ్బులు మాత్రం నన్ను అడిగి తీసుకుంటారు. ఒకసారి పదిహేను వేలు కావాలని ప్రభాస్ ఫోన్ చేశాడు. అంత డబ్బు ఎందుకు కావల్సి వచ్చిందని అడగ్గానే టక్కున ఫోన్ కట్ చేశాడు. ఆ తరువాత 'ఎందుకు?' అని అడిగేందుకు వెనకాడేదాన్ని. స్వప్న ధోరణి కూడా ఇలాగే ఉంది. అది కూడా డొనేషన్ కట్టి డెంటల్ కాలేజీలో బి.డి.ఎస్. చేస్తోంది. ఏడాది మొత్తంలో ఒకటి రెండుసార్లు నా దగ్గరకి వస్తుంది. రెండు రోజులకన్నా ఎక్కువ ఉండదు. నా మీద ప్రేమ ఉన్నట్టు నటించి పిల్లలిద్దరూ నా దగ్గర డబ్బులు తీసుకుని వెళ్లిపోతారు. తండ్రి ఇంటి పేరు నామమాత్రంగానే తగిలించు కున్నారు తప్ప మా కుటుంబం చెదిరిపో యింది. నాకు తోడు అమ్మ ఉంది కాబట్టి సరిపోయింది కానీ, లేకపోతే ఈపాటికి నాకు పిచ్చి పట్టి ఉండేదే. నాన్నా, పిన్నీ పోయాక అమ్మ ఆ దుఃఖం నుంచి త్వర



గానే బయటపడింది. బయటికి వెళ్లి బజారు పనులు చెయ్యడం, బ్యాంకుకి వెళ్లడం నాన్న ఉన్నంత కాలం ఆవిడ ఎప్పుడూ చేసి ఎరగదు. కానీ అవన్నీ చక్కగా నేర్చుకుంది. ఫరీదాబాద్ వదిలి మేం మధురకి వచ్చేశాం. అక్కడ మా తాతముత్తాతలు కట్టించిన బంగళాలో ఉంటున్నాం. ఇది మా అమ్మమ్మా, తాతా ఉండిన బంగళా. మా నాన్నావాళ్ల నాన్నకి బంగళాలూ అవీ లేవు కదా.

అమ్మ అప్పుడప్పుడూ నన్ను వెళ్లి నరోత్త మ్‌ని ఒకసారి చూసిరమ్మని చెపుతూ ఉంటుంది. వినేసి ఊరుకుంటానంతే! ఆయన గురించి వార్తలు మాత్రం నా చెవి దాకా వస్తూనే ఉంటాయి. ఇంకా ఆయన



పరిస్థితిలో ఏ మార్పూ లేదనీ, అలాగే మాటామంతీ లేకుండా ఉన్నారనీ విన్నాను. ఉద్యోగం పోయిందో? ఆయనే మానేశారో? తెలీదు. ఆయన స్నేహితులు గజేంద్రగారు ఆయనకి సాయం చేస్తున్నారట! నరోత్తమ్ ఎలా ఉన్నారో? వెళ్లి చూడాలనిపిస్తుంది ఒక్కోసారి. కానీ ధైర్యం చాలడం లేదు. అయినా వెళ్లి కలుసుకుంటే మాత్రం ఏం లాభం? ఆయన మన లోకంలో లేరాయె! సురేఖ పెద్ద కూతురు పెళ్లి చేసుకుని అమెరికాలో స్థిరపడింది. చిన్నది ఎక్కడో యూరప్‌లో ఉంటోంది. సురేఖని కూడా అరుదుగానే కలవడం అవుతోంది. అయినా తనని కలవాలని నాకూ లేదు. నాకు ప్రస్తుతం ఉద్యోగం ఏమీ లేదు. పొద్దున్న ఆలస్యంగా నిద్ర లేస్తాను. నెమ్మదిగా అన్నిపనులూ చేసుకుంటాను. ఏదో కాలం అలా గడిచిపోతోంది. పనేమీ లేనప్పుడు టీవీ చూస్తాను. అయినా టీవీలోనూ కుటుంబాలు విచ్ఛిన్నం అవడం, మనుషుల మధ్య విభేదాలూ, మనస్పర్థలూ తప్ప ఇంకేముంటాయి చూసేందుకు? ఎప్పుడైనా అమ్మా, నేనూ కలిసి తీర్థయాత్రలకు వెళ్తాం. ఇక నాకు ఉన్నది అమ్మ ఒక్కతే! ఆవిడకి దీర్ఘాయుష్షు ఇమ్మని దేవుణ్ణి ప్రార్థిస్తుంటాను. అందులో నా స్వార్థమే! అమ్మ లేకపోతే మరీ ఒంటరినైపోతాను కదా!

*జనవరి 02, 1996*

ప్రభాస్ దగ్గర్నించి కొరియర్‌లో ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉంది. 'కారణాంతరాల వల్ల ఉద్యోగం వదిలేశాను. ఉద్యోగం లేకుండా అమెరికాలో ఉండడం వీలవదు. మా కంపెనీ వాళ్ల ద్వారా దొరికిన వీసా, ఉద్యోగం పోగానే ఇక పనికిరాదు. అయితే నేను తెలివిగా ఉద్యోగం వదిలేసే ముందే గ్రీన్‌కార్డ్ ఉన్న ఒక ఎన్.ఆర్.ఐ. అమ్మాయిని పెళ్లి చేసుకున్నాను. ఆమె పేరు ఉపమానాయర్. కేరళ అమ్మాయి. ఆరేళ్లుగా ఇక్కడే ఉద్యోగం చేస్తోంది. నాలాగే ఆమె కూడా కంప్యూటర్ ఇంజినీర్.

పెళ్ళి హడావిడిగా చేసుకోవలసి వచ్చింది. నిన్ను ఇక్కడకి పిలిపించుకోలేక పోయినందుకు బాధగానే ఉంది. కానీ ఏం చేస్తాం? పరిస్థితులు అలా వచ్చాయి. అన్నట్టు సురేఖ పెద్దమ్మ ప్రస్తుతం ఇక్కడే ఉంది. నేను పెళ్లి చేసుకుంటున్నట్టు వాళ్లకి చెప్పాను. కానీ వాళ్లెవరూ మా పెళ్లికి రాలేదు. కనీసం గ్రీటింగ్స్ కూడా పంపలేదు! అయినా మేమిద్దరం నిరాడంబరంగా రిజిస్టర్ మ్యారేజి చేసుకున్నాం. మా పెళ్లి ఫొటో పంపుతున్నాను. నీ ఆశీస్సుల కోసం ఎదురుచూస్తూ..'

'ఆశీస్సులా? తమ పిల్లలు సుఖంగా, సంతోషంగా ఉండాలని మన దేశంలో తల్లిదండ్రులు అనుక్షణం కోరుకుంటూనే ఉంటారురా! ఇక ప్రత్యేకంగా ఆశీర్వదించేదేముంది? మీ అమ్మమ్మ ఈ ముసలి వయసులో కూడా రోజూ నా సుఖమే తను కోరుకుంటున్నానని చెపుతూ ఉంటుంది. మీరిద్దరూ కలకాలం సుఖంగా సంతోషంగా కలిసిమెలిసి ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. కానీ నువ్వు గ్రీన్‌కార్డ్ కోసం పెళ్లి చేసుకున్నానని రాయడం వల్ల తప్పనిసరి పరిస్థితిలో ఈ పెళ్లి జరిగిందే అని కొంచెం బాధ అనిపించింది. అన్ని పెళ్ళిళ్ళూ ఇలా తప్పనిసరిగానే జరుగుతాయా? నరోత్తమ్ తన తల్లిని సంతోషపెట్టేందుకు నన్ను పెళ్లి చేసుకున్నారు. మా నాన్నకి ఎదురు చెప్పలేక నేనూ పెళ్లికి తలవంచాను. నా తరువాతి తరం వాడివి. ఇప్పుడు నువ్వు కూడా అదే పనిచేశావా? నువ్వు ప్రేమించి పెళ్లి చేసుకున్నానని రాసి ఉంటే మనసారా సంతోషించేదాన్ని. కానీ నువ్వు సంతోషంగా ఉంటే నేను కూడా సంతోషంగా ఉన్నట్టే అనుకో! మీ ఇద్దరికీ నా ఆశీస్సులు..' అని జవాబిచ్చాను.

*జనవరి 11, 1996*

ప్రభాస్ ఇవాళ ఫోన్ చేశాడు. "అమ్మా! చిన్న చిన్న విషయాలని అంత సీరియస్‌గా తీసుకుంటావేమిటి? ప్రస్తుతం జీవితం ఎంత వేగంగా పరుగులు పెడుతోందో నీకేమైనా తెలుసా? ఇందులో సెంటిమెంట్స్‌కీ, సున్నిత భావాలకీ చోటు మిగలటం లేదు" అన్నాడు.

'మీ పెద్దమ్మా వాళ్లు నీ పెళ్లికి రాలేదని నువ్వు బాధపడ్డం సెంటిమెంట్ కాదా ప్రభాస్? ఒకవేళ వాళ్లు పెళ్లికి వచ్చి ఉంటే నాకు ఉత్తరంలో ఆ విషయం రాసేవాడివి కాదు కదా!' అని అందామనుకున్నాను. కానీ అనలేదు. వాడు ఎప్పుడూ గబగబా మాట్లాడుతాడు. మనం ఏమైనా అనేందుకు సందు దొరకదు.

*మార్చి 26, 1996*

ప్రభాస్ ఈ మధ్య తరచు ఫోన్ చేస్తూనే ఉన్నాడు. ఇవాళ చాలాసేపు ఆప్యాయంగా ఏవేవో కబుర్లు చెప్పాడు. "నాన్న గురించి ఏమైనా తెలిసిందా? ఎలా ఉన్నారు?" అని కూడా అడిగాడు.

నేను జవాబు చెప్పకపోయేసరికి "అలా అడిగి నిన్ను బాధ పెట్టినట్టున్నాను. క్షమించమ్మా!" అన్నాడు.

వెంటనే మాట మార్చి "నువ్వు అమెరికా ఒకసారి రాకూడదూ! టికెట్ తీసి పంపి

స్తాను" అన్నాడు.

"అక్కడికొచ్చి ఏం చేస్తానురా? " అంటే.. "త్వరలోనే నువ్వు నాయనమ్మవి కాబోతు న్నావు! అమ్మా.. మాకూ సాయంగా ఉంటుంది నువ్వు వస్తే! సిద్ధంగా ఉండు! పది పదిహేను రోజుల్లో నీకు టికెట్ పంపిస్తాను" అన్నాడు.

"అదేమిట్రా? నీ పెళ్లి జరిగి మూడు నెలలేగా అయింది.! అప్పుడే పిల్లలేమిటి? ' 'అని అడిగాను.

"అవన్నీ నువ్విక్కడికి వచ్చాక చెపు తాను. జూన్‌లో ఉపమకి డెలివరీ డేట్ ఇచ్చారు డాక్టరు. సరే! అయితే నేను త్వరలో అన్ని ఏర్పాట్లూ చేసి టికెట్ పంపుతాను, సరేనా!" అంటూ నేను జవాబు చెప్పేలోపల ఫోన్ పెట్టేశాడు.

'నేను రావడం వీలుకాద'ని ఫోన్ చేద్దా మనుకున్నాను. కానీ చెయ్యలేకపోయాను. కన్నపేగు కదా ఎంతైనా! ప్రాణం పోయేవ రకూ పిల్లల మీద మమకారం చావదేమో!

ప్రభాస్ పంపిన ట్రావెల్ ఏజెంట్ ఇవాళ వచ్చాడు. నా పాస్‌పోర్ట్ రెన్యూ వల్ చేయించాలి. టూరిస్ట్ వీసా సంపా దించాలి. వాటికి సంబంధించిన కాయితా లను నా చేత నింపించి తీసుకెళ్లాడు. తత్కాల్ సర్వీస్‌లో పాస్‌పోర్ట్ ఒక్క వారంలో వచ్చేస్తుందనీ అన్నాడు. ప్రభాస్ పంపిన టికెట్, ఉపమ ప్రెగ్నెన్సీ సర్టిఫి కెట్ చూపిస్తే పాస్‌పోర్ట్ త్వరగా ఇస్తా రట! అంతా త్వరత్వరగా జరిగిపోయింది. ఒకపక్క వెళ్లాలని లేదు. ఆ విషయం ప్రభాస్‌కి చెప్పలేకపోయాను. ఇక ఈ ట్రావెల్ ఏజెంట్‌కి ఏం చెప్పి ఆపగలను? నాకేమీ పాలుపోవడం లేదు.

అమ్మని అడిగితే "నువ్వు వెళ్లు రత్నా! నీ కోడలు మొదటిసారి ప్రసవించబోతోంది" అని సలహా ఇచ్చింది.

నేను మాట్లాడకుండా ఊరుకున్నాను. నా మనసులో మాట అమ్మకి చెప్పలేను. అమ్మ మనసులో ఏముందో నాకు అర్థం కాదు. అసలు ఇంకొకళ్ల విషయం ఎందుకు? జీవితం మొత్తం గడిచిపో యినా మనని మనం అర్థం చేసుకోలేం!

*ఏప్రిల్ 19, 1996*

ఇవాళ అమెరికా చేరుకున్నాను. అంత సేపు విమానంలో ప్రయాణం చెయ్యడం చాలా విసుగనిపించింది. ఇండియాలో చాలాసార్లు నరోత్తమ్ వెంట విమానాల్లో ప్రయాణం చేశాను. కానీ ఇన్ని గంటలు కదలకుండా కూర్చుని ప్రయాణం చెయ్యడం ఇదే మొదటిసారి. ఒకే ఒకసారి ఢిల్లీ నుంచి లండన్‌కి మేమిద్దరం వెళ్లాం. నరోత్తమ్‌కి అప్పుడు దేనికో పురస్కారం లభించింది. కానీ అప్పుడు నా వెంట నరో త్తమ్ ఉన్నారు. ఇద్దరి మధ్యా గొడవలు కూడా అప్పటికింకా ప్రారంభం కాలేదు. ఇక విసుగెందుకుంటుంది? మా లండన్ ప్రయాణం హనీమూన్‌లాగే అనిపించింది. కానీ ఢిల్లీ నుంచి న్యూయార్క్‌కి చేసిన ప్రయాణం మహా అయితే సీటుని కాస్త వాల్చుకుని నిద్రపోవడం తప్ప సుఖంగా అనిపించలేదు. కళ్లు మూసుకున్నా వెల్తురు తెలుస్తూనే ఉంది. ఎయిర్‌హోస్టెస్ ఇచ్చిన బ్లాక్ ఐ ప్యాడ్ కళ్లకి తొడుక్కుంటే అది వెల్తురుని ఆపగలిగింది కానీ, మనసులోని అలజడిని ఆపలేకపోయింది.

నేనెక్కిన విమానం కొరియన్ కంపె

## కొత్తగాలి...

**కొడుకు పుట్టాడు**
**పుత్రోత్సాహం కలిగింది**
**ఆ కొడుక్కి కొడుకు పుట్టాడు**
**వృద్ధాశ్రమం దిక్కయింది!**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా

నీది. ప్రయాణికుల్లో ఎక్కువమంది యూరప్ దేశస్థులే ఉన్నారు. నా పక్క సీట్లో పొడుగ్గా, బలంగా ఉన్న ఒక నడివయసు యూరోపియన్ ఉన్నాడు. ఇండియన్ యువకుడో, మధ్య వయసు మగాడో అయితే ఈ పాటికి నాతో మాటలు కలిపి ఉండేవాడే. అందమైన ఆడది కనిపిస్తే ఆకర్షించేందుకు అడ్డమైన వేషాలు వేస్తారు మనవాళ్లు. కానీ ఈయన తన లోకంలో తనున్నాడు. నేను పక్కన ఉన్నానన్న ధ్యాసే ఉన్నట్టు లేదు ఈయనకి. కానీ రాత్రి నాకు కడుపులో తిప్పి, వాంతి అయితే అప్పుడు మాత్రం సీటుకున్న అరలోంచి డిస్పోజబుల్ వామిటింగ్ బ్యాగ్ తీసి నాకివ్వడమే కాకుండా, నా తలని గట్టిగా పట్టుకుని సాయం చేశాడు. అతని ప్రవర్తన చాలా సహజంగా, మనిషికి మనిషి చేసే సాయంలానే అనిపించిందే తప్ప దాన్ని అవకాశంగా చేసుకుని నన్ను తాకేందుకు చేసిన ప్రయత్నంలా అనిపించలేదు. అతనికి ఇబ్బంది కలిగించినందుకు క్షమాపణా, సాయం చేసినందుకు ధన్యవాదాలూ చెప్పాను. అతను చిరునవ్వు నవ్వుతూ, 'ఇట్స్ ఆల్ రైట్, టేక్ ఇట్ ఈజీ' అన్నాడు.

మనదేశంలో అనుబంధాలూ.. సానుభూతీ అంటూ పెద్దపెద్ద కబుర్లు చెపుతాం, కానీ పని చెయ్యాల్సి వచ్చినప్పుడు మాత్రం మనది వెనకంజే. మన దృష్టిలో అనుబంధాలంటే ఎప్పుడూ అవతలి వ్యక్తి నుంచి వీలైనంత పొందాలన్న స్వార్థమే ఉంటుంది. మన వైపు నుంచి తీసుకోవలసిన బాధ్యతల్ని గుర్తుంచుకోం.

విమానంలో భోజనం సర్వ్ చేసినప్పుడు కూడా ముందు సీటు వెనక ఉన్న ట్రేని కిందికి దింపడంలోనూ, పదార్థాలున్న ప్లేట్‌ని అందించడంలోనూ ఏండ్రూజ్ - అదే తన పేరని చెప్పాడు - నాకు సాయం చేశాడు. ఇక ఆ తరవాత న్యూయార్క్ చేరేవరకూ నేను చిన్న పిల్లనైనట్టు చూసుకున్నాడు నన్ను.

ప్రయాణం విసుగ్గా అనిపించడం మానేసింది. భవిష్యత్తు గురించిన విచారం మాయమైంది. చూపు ముందుకు తిరిగింది. విమాన ప్రయాణం ఎంజాయ్ చెయ్యడం మొదలెట్టాను. న్యూయార్క్ చేరుకోబోతున్నామని పైలట్ అనౌన్స్ చేశాడు. మళ్ళీ ఊహాలోకంలో నుంచి ఈ భూమ్మీదికి దిగి వచ్చాను. ప్రభాస్ ఎయిర్‌పోర్ట్‌కి వచ్చాడో? లేదో? అన్న ఆలోచన రాగానే ఏండ్రూజ్‌ని అడిగాను.

"మీ అబ్బాయి రాకపోతే మీరు నా వెంట రావచ్చు" అన్నాడతను ఆంగ్లంలో.

సరదాకి అలా అన్నాడని నాకు వెంటనే అర్థమయేటట్టు, "మీ అబ్బాయి తప్పకుండా వస్తాడు!" అని వెంటనే ధైర్యం చెప్పాడు.

ఒకవేళ ప్రభాస్ రాకపోతే అతని ఫోన్ నెంబర్ చెబితే ఫోన్ చేసి నేను చేరిపోయానని చెపుతానని అన్నాడు.

విమానం దిగేముందు అతను తన విజిటింగ్ కార్డు నాకిచ్చాడు.

ప్రభాస్ వచ్చాడు.

నా దగ్గరకి వచ్చి కాళ్ళకి దణ్ణం పెట్టాడు. వెంటనే బయలుదేరి వాడి కారులో ఇల్లు చేరుకున్నాం. విమానం దిగాక ఏండ్రూజ్ మళ్ళీ ఎక్కడా కనబడలేదు. ఇంట్లో ప్రభాస్ ఒక్కడే ఉన్నాడు. కోడలు ఆఫీసు పని మీద నెలరోజుల పాటు ఇంకో ఊరికి వెళ్ళిందట. ఇంక రెండుగంటల్లో ప్రభాస్ కూడా ఆఫీసుకెళ్ళాలి. నాకు ఓవల్టీన్, శాండ్‌విచెస్ ఇచ్చి, ఇంట్లో ఏవేవి ఎక్కడున్నాయో చెప్పసాగాడు. అసలు ప్రభాస్‌కి ఎప్పుడూ అన్నిటికీ తొందరే. అమెరికా వచ్చాక ఆ వేగం ఇంకా పెరిగిపోయింది.

ఆఫీసుకెళ్తూ, "నువ్వు రెస్టు తీసుకో! నేనింకో పన్నెండు గంటల తరువాత గాని ఇంటికి రాను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అక్షరం

ఇతరులు చేసిన ఏనుగంత తప్పును
ఆవగింజంత చిన్నదిగా చూడు
నువ్వు చేసిన చిన్న తప్పును కూడా
కొండంత తప్పుగా భావించు

– మహాత్మాగాంధీ



అమెరికా వచ్చానేగాని, ఏమిటో వెల్తిగా అనిపించింది. 'కోడలు ఊళ్ళో లేదు, ప్రభాస్ రాత్రి పొద్దుపోయిగాని ఇంటికి రాడు. ఇలా ఒంటరిగా ఏ పనీ లేకుండా కూర్చునేందుకా ఇంత దూరం ప్రయాణం చేసి వచ్చాను!' అనుకున్నాను.

ప్రభాస్ టీవీ ఆన్ చేసి వెళ్ళాడు. నాకేమీ చూడాలని అనిపించలేదు. టీవీ ఆఫ్ చేసేసి, డైరీ తెరిచి రాయడానికి కూర్చున్నాను.

### ఏప్రిల్ 27, 1996

నేనిక్కడికి వచ్చి దాదాపు వారం అయింది. ఇల్లు జైలులా ఉంది. అయినా ఇక్కడ అన్నీ సౌకర్యంగా, శుభ్రంగా ఉన్నాయి. దుమ్మూ, ధూళీ భూతద్దంతో వెతికినా కనబడవు. ముందుగా వండిన పదార్థాలూ, పానీయాలు లెక్కలేనన్ని దొరుకుతాయి. టిన్ తెరవడం, పదార్థాలని మైక్రో ఓవెన్‌లో వేడి చెయ్యడం, తినడం. వంటపని సులభంగా తప్పించుకోవచ్చు. కానీ ఇక్కడ దొరికే ఆహారం - ముఖ్యంగా ఇండియన్ ఫుడ్ - అంత రుచికరంగా అని పించదు. 'ఇక్కడికెందుకొచ్చానురా భగవం తుడా!' అని అనుకుంటున్నాను. రాత్రి బాగా పొద్దుపోయాక వస్తాడు ప్రభాస్. రాగానే ఒక పెగ్గు గ్లాసులో పోసుకుని నా ముందు కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పడం మొదలుపెడతాడు. ఆ తరువాత వెళ్ళి కంప్యూటర్ ముందు కూర్చుంటాడు. పొద్దున్న బ్రేక్‌ఫాస్ట్ సమయానికి చెయ్యడం. మధ్యాహ్నం ఏం తింటాడో? రాత్రి భోజనం ఎప్పుడు చేస్తాడో? ఆ దేవు డికే తెలియాలి! ఆదివారం న్యూయార్క్ నగరం తిప్పి చూపిస్తానన్నాడు, కానీ వాడు బారెడు పొద్దెక్కినా నిద్ర లేవలేదు. నేను కూడా వాడిని లేపలేదు. పిల్లలు ఎంత పెద్దవాళ్ళయినా తల్లి దృష్టిలో వాళ్ళింకా చిన్నపిల్లలే!

ఆదివారం రాత్రి ఉపమ ఫోన్ చేసింది. "క్షమించండి ఆంటీ! మీరొచ్చినప్పుడు స్వాగతం పలికేందుకు ఇంటి దగ్గర లేకుండా పోయాను!" అంటూ మర్యాదకి రెండు మాటలు మాట్లాడింది.

### మే 20, 1996

అర్ధరాత్రి రెండు గంటలకి ఉపమ వస్తోందని చెప్పి ప్రభాస్ ఎయిర్‌పోర్ట్‌కి వె ళ్ళాడు. ఆ అమ్మాయి కోసం నేను కూడా నిద్ర ఆపుకుని కూర్చున్నాను. చివరికి వచ్చింది. చామనచాయ, చూసేందుకు మామూలుగా ఉంది. ప్రభాస్‌ని కానీ, మరెవరినైనా కానీ ఆకర్షించే శక్తి ఎక్కడా ఆమెలో నాకు కనిపించలేదు.

"హాయ్ ఆంటీ!" అంటూ వంగి నా కాళ్ళకి దణ్ణం పెట్టబోయింది, కానీ బాగా నెలలు నిండడంతో పొట్ట అడ్డొచ్చింది.

నేను కూడా ఆ అమ్మాయిని పట్టుకుని ఆపి, "పద! ముందు ఏదైనా తిందువు గాని, వంట చేసి పెట్టాను" అన్నాను.

"లేదాంటీ! నాకు చాలా నిద్రొస్తోంది, పోయి పడుకుంటాను" అందా అమ్మాయి. వెంటనే పడకగదిలోకి వెళ్ళిపోయింది.

ఐదు నిముషాలాగి ప్రభాస్ కూడా వేరే గదిలోకి వెళ్ళిపోయాడు.

'ఇంట్లో ఉన్నది ఇద్దరు. ఇద్దరికీ విడివిడి

పడకగదులా? ఎప్పుడూ ఇంతేనా? లేక ఆ అమ్మాయికి నెలలు నిండాయని ఈ ఏర్పాటా? ఏమో? అయినా నాకెందుకు?' అని అనుకున్నాను.

***మే 24, 1996***

నాకు మాగన్నుగా నిద్ర పడుతూ ఉండగా ఫోన్ మోగింది. ప్రభాస్ వస్తాడని కాసేపు చూసి నేనే ఫోన్ ఎత్తాను.

"అమ్మా! నీకు మనవడు పుట్టాడు. ఆస్పత్రి నుంచి మాట్లాడుతున్నాను. సాయంకాలం ఇంటికొచ్చాక అన్ని వివరాలూ చెపుతాలే" అని ఫోన్ పెట్టేశాడు.

వాడిని ఏమైనా అడిగేందుకు అవకాశమే ఇవ్వలేదు నాకు. నేనింట్లోనే ఉన్నాను. లేపి చెప్పొచ్చు కదా! నన్ను కూడా తనతో పాటు ఆస్పత్రికి తీసుకెళ్ళొచ్చు కదా! లేదు, ఏమీ చెప్పకుండా తనొక్కడే ఆస్పత్రికి వెళ్ళి, ఉపమ డెలివరీ అయాక తాపీగా ఫోన్ చేసి రెండు ముక్కలు చెప్పాడు! ఇదీ అమెరికాకి వచ్చి నేను చేసిన సాయం..! వాడు నాకు ఇచ్చిన విలువ!

***జూన్ 02, 1996***

ఆస్పత్రికి వెళ్ళేప్పుడు నాకు చెప్పకుండా వెళ్ళినట్టే, హఠాత్తుగా ఇద్దరూ పసివాణ్ణి తీసుకుని ఇవాళ ఇంటికి వచ్చారు. ఉపమ గదిలో ఆమె పనిచేసే కంపెనీ వాళ్ళు పుట్టిన బిడ్డకి కావల్సిన వస్తువులన్నీ అమర్చి వెళ్ళారు. రకరకాల డిస్పోజబుల్ నేప్‌కిన్స్, వాడిన నేప్‌కిన్‌లని పారవేసేందుకు డిస్పోజబుల్ క్యాన్లూ, బుడ్డీపాల కోసం బాటిల్స్, ఇంకా ఏవేవో బోలెడు సామాన్లు! ప్రభాస్ ఇంట్లో ఉన్నప్పుడే, ఇవన్నీ సర్ది వెళ్ళారు. వాడు ఇంట్లో ఉన్నాడన్న మాటేగానీ ఈ హడావిడిలో, మరో పక్క పని మీద తన ఆఫీసుకి వెళ్ళిరావడంలో నాతో మాట్లాడేందుకే వాడికి తీరిక దొరకలేదు. తీరా పిల్లాణ్ణి ఇంటికి తీసుకొచ్చిన రోజునే నాకు జలుబు చేసింది.

"అమ్మా! నీకు వైరల్ కోల్డ్ పట్టుకుంది. ఒక పదిరోజులపాటు ఉపమ ఉన్న గదిలోకి వెళ్ళొద్దు. ఉజ్వల్ (పిల్లవాడికి పేరు పెట్టే విషయంలో కూడా నాకేమీ చెప్పలేదు, వాళ్ళిద్దరే నిర్ణయించేశారు)కి అంటుకుంటే చాలా కష్టం!" అన్నాడు.

నాకు చాలా బాధనిపించింది. కానీ చేసేదేం లేక నా గది దాటి బయటికి రాకుండా జాగ్రత్త పడ్డాను. వంటింటి పనులన్నీ ప్రభాసే చూసుకుంటున్నాడు.

***జూన్ 10, 1996***

నిన్నటినుంచీ నాకిద్దరూ ట్రైనింగ్ ఇస్తున్నారు! పిల్లవాణ్ణి ఎలా ఎత్తుకోవాలో? వాడికి స్పాంజి బాత్ ఎలా ఇవ్వాలో? నేపీ ఎలా మార్చాలో? వాడిన నేపీలు స్ప్రే కొట్టి క్యాన్‌లో ఎలా పడెయ్యాలో? లాంటి పనుల గురించి ఇద్దరూ నాకు క్లాసు తీసుకున్నారు. నేను పసివాడికి నాయనమ్మని కానట్టూ, నర్సునో? ఆయానో? అయినట్టూ అనిపించింది నాకు.

మర్నాడు పొద్దున్నే ఉపమ కూడా ఆఫీసుకి వెళ్ళింది. మూడు నెల్లపాటు కొన్ని గంటలే పనిచేసి ఇంటికి వచ్చేసే వెసులుబాటు ఉంది తనకి. ఇంట్లో ఉన్నది నేనూ, నా మనవడూ. నాకు వాడిమీద మమకారం పొంగిపొర్లి వచ్చింది. వెంటనే వాణ్ణి ఎత్తుకుని బుగ్గలు ముద్దుపెట్టుకున్నాను. నా పిల్లలకి చిన్నప్పుడు నేను పాడిన జోల పాటలన్నీ మళ్ళీ గుర్తొచ్చాయి. రోజంతా వాడితోనే గడిచిపోయింది. మాటిమాటికీ నేపీలు మార్చే పని కూడా ఉంది కదా!

***జూన్ 12, 1996***

ఉజ్వల్ మొహం మీద పొక్కులు లేచాయి. డాక్టర్ దగ్గరకి తీసుకెళ్తే, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ అనీ, పసిపిల్లవాణ్ణి ఎక్కువగా ముద్దులు పెట్టుకోవడం వల్ల అది వస్తుందనీ అన్నాడట.

ఉపమ నాతో ఏమీ అనలేదు, కానీ ప్రభాస్ నా మీద అంతెత్తు ఎగిరాడు.

"అమ్మా! నీకు ముందే చెప్పాను, పిల్లవాణ్ణి ముద్దులూ అవీ పెట్టుకోవద్దనీ! ఇండియన్స్‌కి బుద్ధిలేదు, పల్లెటూరి బైతులు! ఇప్పుడు చూడు! అనవసరంగా వాడు జబ్బు పడ్డాడు కదా!" అన్నాడు.

వాడి ధోరణి ఒక నేరగాడిని విచారించి కోప్పడే పోలీసు వ్యవహారంలా కనిపించిందే తప్ప, నేను వాడి కన్నతల్లినన్న భావనే కనిపించలేదు.

***జూన్ 15, 1996***

రాత్రి పదకొండు గంటలకి ఎందుకో టీ తాగాలనిపించి వంటింటి వైపు నడిచాను. ఉపమ పడకగది తలుపు తెరిచే ఉంది. నేను హాల్లోకి రాగానే వాళ్ళ మాటలు వినిపించాయి.

"ఉప్పీ! చూడు! వాడు ఎలా ఏడుస్తున్నాడో? నేప్‌కిన్ మార్చాలేమో? నా గదిలోకి వినిపిస్తోంది వాడిగొంతు. పక్కనే ఉన్నావు, నీకు వినిపించడం లేదా? ప్లీజ్! లేచి నేపీ మార్చు" అంటున్నాడు ప్రభాస్.

ఉపమ ఏమీ జవాబివ్వలేదు.

"నేనన్నది విన్నావా ఉప్పీ? "

"విన్నాను. నేను బాగా అలసిపోయానని ముందే చెప్పాను. ఎలాగూ వచ్చావుగా! నువ్వే మార్చేద్దూ" అంది ఉపమ.

"నేను ఆఫీసు పని చేసుకుంటున్నాను ఉపమా!"

"అయితే ఆ ముసల్దాన్ని పిలు! లక్షరూపాయలు టికెట్‌కి ఖర్చు చేసి ఎందుకు పిలిపించినట్టు? రోజంతా ఇంటిపట్టున హాయిగా కూర్చునే ఉంటుందిగా!"

"ప్లీజ్.. లే! లేచి నేపీ మార్చు. నాకు చచ్చేంత పనుంది. ఈ రోజు రాత్రికే ముగించి జర్మనీ ఆఫీసుకి పంపించాలి. అయినా లక్ష ఖర్చయిందని అంటున్నావు, అమ్మని పిలిపించకపోతే బేబీ సిటర్‌కి దీనికి ఐదారు రెట్లు మనకి ఖర్చయేది తెలుసా!"

"షటప్..! నన్ను నిద్రపోనీ! నాకసలు అప్పుడే పిల్లాపీచూ వద్దనుకున్నాను. నీ

## కొత్తగాలి...

**తియ్యని మాట**
**నెయ్యపు మూట**
**కరకు మాట**
**కయ్యపు బాట**

– ధవ్వూరి శ్రీధరాచార్యులు,
సీతారాంబాగ్, హైదరాబాద్

మొండి పట్టు వల్లే ఇలా జరిగింది. నీకు నా గ్రీన్ కార్డు మీదే కానీ నా మీద ప్రేమ ఎక్కడుందిలే! నేనే బుద్ధిలేకుండా దీనిలో ఇరుక్కున్నాను"

నేను టీ సంగతి మర్చిపోయి నా గదిలోకి వెళ్ళిపోయాను. భగవంతుడా! ఏమిటిది? పెళ్ళయి ఏడాదన్నా కాలేదు! అప్పుడే ఇద్దరూ ఇలా దెబ్బలాడుకుంటున్నారు. మనం మనుషులను ప్రేమించమల్లే ఉంది. మన స్వార్థంతో ప్రేమిస్తాం! ప్రేమ లేకుండా స్వార్థంతో పెళ్ళిళ్ళు చేసుకుంటే ఇంకెలా ఉంటుంది? ఇద్దరికీ అన్యాయం జరుగుతోంది! అయితే నన్నిక్కడ ప్రభాస్ తల్లిగా కాదు, ఒక ఆయా పని కోసం పిలిపించారన్న మాట! కోడలికి తన మొగుడంటేనే గౌరవంలేదు, ఇక నేనెంత! గ్రీన్ కార్డ్ కోసమే తనని పెళ్ళిచేసుకున్నాడని వాడు లోకువ దీనికి! మరి అది వీణ్ణి ఎందుకు చేసుకుందో? పెళ్ళి చేసుకునేప్పుడే కడుపుతో ఉందిగా..! అసలు వీడు ప్రభాస్‌కి పుట్టినవాడేనా? ఒక ఆడదాన్నై ఉండి అలా ఆలోచించినందుకు మళ్ళీ నన్ను నేనే తిట్టుకున్నాను. ఒక పక్క పిల్లాడు గుక్కపట్టి ఏడుస్తూ ఉంటే వీళ్ళిద్దరూ ఇలా పోట్లాడుకోడం ఏమిటి? వెయ్యి అనుమానాలూ.. లక్ష భయాలూ..! తక్షణం ఇండియాకి పారిపో

వాలన్న కోరిక కలిగింది.

**జులై 01, 1996**

ఈ మధ్య ఉపమ నాకు యజమానురాలిలాగే ప్రవర్తిస్తోంది. నా మొహం మీదే నేను వాళ్ళింట్లో పనిమనిషిని తప్ప ఇంకేమీ కాదని స్పష్టంగా చెపుతోంది. మునుపు ప్రవర్తనలో మాత్రమే కనిపించిన ఆ తృణీకారం ఇప్పుడు మాటల్లో వినిపిస్తోంది. ప్రభాస్ తన మాటలకి అడ్డొస్తే విడాకులు ఇచ్చేస్తానని బెదిరిస్తోంది. విడాకులు తీసుకుంటే వాడికి ఇక గ్రీన్‌కార్డ్ రాదని బ్లాక్‌మెయిల్ చేస్తోంది. నాకింక ఒక్కరోజు కూడా అక్కడ ఉండాలని అనిపించలేదు. ఇవాళ ఇద్దరూ ఉండగా నాకు వెనక్కి వెళ్ళిపోవాలని ఉందని చెప్పాను.

"టికెట్‌కి అయ్యే డబ్బులు ఇస్తే తిరిగి వెళ్ళిపోవచ్చు! ఫ్రీగా అమెరికా తిరిగి చూసేందుకు పిలిపించలేదు మేం" అంది ఉపమ నిర్మొహమాటంగా.

ప్రభాస్ నోరు తెరవలేదు. నాకు లోపల్నించి ఏడుపు తన్నుకొస్తోంది. నేను మా నౌకర్లతో కూడా ఇంత ఘోరంగా ఎప్పుడూ మాట్లాడలేదు.

**జులై 05, 1996**

ఈ రోజు ఉపమ హద్దుమీరి ప్రవర్తించింది. నన్ను 'ఓల్డ్ బిచ్' అనేసింది. విని కూడా ప్రభాస్ ఏమీ అనలేదు. రాత్రి రెండుగంటలయినా నాకు నిద్రపట్టడం లేదు. 'పరాయి దేశం. నాకిక్కడ ఎవరూ తెలీదు' అని అనుకుంటుండగానే నాతో పాటు విమానంలో ప్రయాణం చేసిన ఏండ్రూజ్ గుర్తుకొచ్చాడు. లేచి పర్సు తెరిచి అతనిచ్చిన విజిటింగ్ కార్డ్ కోసం వెతికాను. దొరికింది. దాన్ని చేతిలో పట్టుకుని 'ఇంత రాత్రివేళ పరాయి మగాడికి ఫోన్ చేస్తే ఏం బావుంటుంది?' అనుకున్నాను. కానీ మనసుకి అయిన గాయం నన్ను నిలవనీయలేదు. ఏమైతే అదే అవుతుందని నెంబర్ డయల్ చేశాను. చాలాసేపు రింగ్ అవుతూనే ఉంది. చివరికి ఫోన్ ఎత్తాడు. ఏండ్రూజ్ గొంతు వినిపించింది. మా ఇద్దరి సంభాషణ ఆంగ్లంలోనే సాగింది:

"హల్లో!"

"హల్లో.. ఏండ్రూజ్ మాట్లాడుతున్నారా?"

"అవును! ఎవరు మాట్లాడేది?"

"రత్నని! ఢిల్లీ నుంచి మీతో కలిసి ప్రయాణం చేశాను, గుర్తుందా?"

"ఓ! మిసెస్ రత్నా! ఎలా ఉన్నారు? మీరు నాకు గుర్తున్నారు! వాట్ ఈజ్ ద మేటర్? ఇంత రాత్రి వేళ ఫోన్ చేశారంటే, ఏమైనా ప్రాబ్లమా?"

అతనలా అడగ్గానే నాకు ఏడుపు ఆగలేదు. కష్టపడి గొంతు పెగుల్చుకుని నాకు అతని సాయం కావాలని అడిగాను.

వెంటనే అతను అడ్రస్ అడిగి, తనూ తన భార్యా వీలైనంత త్వరగా వచ్చి నన్ను కలుస్తామని అన్నాడు. రేపు ఉదయం ఇంటికి రమ్మని అడ్రస్ చెప్పాను.

ఉదయం తొమ్మిదిగంటల తరువాత ప్రభాస్, కోడలూ ఆఫీసుకి వెళ్ళిపోతారు.

కావాలంటే ఇప్పుడే వస్తానని అన్నాడు ఏండ్రూజ్. మా ఇంటి నుంచి వాళ్ళుండే ప్రాంతం డెబ్బై కిలోమీటర్ల దూరంలో ఉంది. కానీ నేనే ప్రభాస్, ఉపమ లేని సమయంలో వస్తే బావుంటుందనుకుని రేపు రమ్మన్నాను.

ఫోను పెట్టేశాక కూడా నేను చేసిన పనికి భయంతో వణికిపోతూనే ఉన్నాను.

**జులై 06, 1996**

ఏండ్రూజ్ తన భార్య మార్థాని వెంటపెట్టుకుని చెప్పిన టైమ్‌కి వచ్చేశాడు. నేను ఏడుస్తూ నా బాధనంతా వాళ్ళ ముందు వెళ్ళగక్కాను. మార్థాకి చాలా కోపం వచ్చింది. పోలీసులని పిలుద్దామంది. కానీ నేనే వద్దన్నాను. సాయంత్రం పిల్లలిద్దరూ ఆఫీసు నుంచి వచ్చేదాకా కబుర్లు చెపుతూ

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, నవలావలోకనం ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

---

ఇద్దరూ నా దగ్గరే ఉన్నారు. ప్రభాస్ ఇంటికి వచ్చి ఈ కొత్తవాళ్ళని చూసి ఆశ్చర్యపోయాడు. నేనే పరిచయం చేశాను. ఇంతలో ఉపమ కూడా వచ్చేసింది. ఏండ్రూజ్ నా పాస్‌పోర్ట్ తనకిమ్మని ప్రభాస్‌ని అడిగాడు.

ప్రభాస్ మొహం జేవురించడం చూసి మార్థా కల్పించుకుని "ఈవిడ పాస్‌పోర్ట్, సామానూ తెచ్చివ్వండి! ఈమెని మా ఇంటికి తీసుకుపోతున్నాం! ఇవ్వనని ఏదైనా గొడవ చేస్తే పోలీసులని పిలవాల్సి వస్తుంది. మీరు ఈవిణ్ణి బలవంతంగా బంధించి ఉంచారని రిపోర్ట్ చేస్తాం!" అంది ఇంగ్లీషులో.

ఇక వాడు మారుమాట్లాడకుండా పాస్‌పోర్ట్ తెచ్చిచ్చాడు.

నేను గదిలోకి వెళ్ళి నా నాలుగు వస్తువులూ బ్యాగులో సర్దుకుని తెచ్చుకున్నాను. మార్థా వాళ్ళింటికి వెళ్ళాను. ఈ పరాయిదేశంలో, నా భాష.. నా కులం.. నా దేశం వాళ్ళు కాని వీళ్ళకి నా గురించి ఇంత శ్రద్ధ ఏమిటి? మానవత్వం తప్ప నాకూ వీళ్ళకీ ఉన్న సంబంధం ఏమిటి? కానీ నా కొడుకు దగ్గర ఉన్నప్పుడు లేని స్వేచ్ఛ నాకీ అపరిచితుల ఇంట్లో దొరికింది. చాలాకాలం తరువాత హాయిగా ఊపిరి పీల్చుకోగలుగుతున్నాను.

**జులై 09, 1996**

ప్రభాస్ నన్ను కలుసుకునేందుకు రాలేదు. నేనున్న చోటుకి రిటర్న్ టికెట్ కొరియర్ చేశాడు. నాకు వీలైనంత త్వరగా వెనక్కి వెళ్ళిపోవాలని ఉంది. కానీ ఏండ్రూజ్, మార్థా అస్సలు ఒప్పుకోలేదు. "అమెరికా నుంచి మీరు ఇలా బాధపడుతూ వెళ్ళేందుకు మేం ఒప్పుకోం! ఇక్కడ చూడాల్సిన ప్రదేశాలు చూసే వెళ్ళదురుగాని

## కొత్తగాలి...

**నేను**
**రిటైరయ్యాను!**
**శ్రీమతికి**
**ఓవర్ టైమ్!**

– జి. రంగబాబు,
అనకాపల్లి, విశాఖ జిల్లా

మీరు!" అన్నారు.

నా దగ్గర ఖర్చు పెట్టేందుకు డబ్బు లేదని చెపితే, నెలరోజులు వాళ్ళ స్టోర్‌లో పనిచేస్తే దానికి అవసరమైన డబ్బు సంపాదించుకోవచ్చని చెప్పింది మార్థా. వాళ్ళు అతిగా నా మీద సానుభూతి చూపించకపోవడం, తాము డబ్బు ఇస్తామని నన్ను ఇరకాటంలో పెట్టకుండా ఇలాంటి ఉపాయం చెప్పడం.. నాకు చాలా హాయిగా అనిపించింది. తల్లీ.. కొడుకూ, భార్యా.. భర్తా ఇలాంటి ఎందుకూ పనికిరాని సెంటిమెంట్ల కన్నా మానవత్వానికి గల అడ్డంకులని తొలగించి మనకి చేతనైనంత వరకూ మంచి పనులు చెయ్యడం ఎంతో అభిలషణీయం కదా!

**సెప్టెంబరు *01, 1996***

రెండునెలలు ఎలా గడిచిపోయాయో తెలీనేలేదు! ఏంట్రూజ్ వాళ్ళ స్టోర్‌లో అకౌంట్స్ అసిస్టెంట్‌గా చేరాను. ఈ షాపులో పని మొదలెట్టాక ఇక్కడి పద్ధతి చూస్తే ఆశ్చర్యం వేసింది. బేరాలూ అవీ ఏమీ ఉండవు. పూర్తి ధర చెల్లించి బిల్లు తీసుకుని వెళ్తారు వస్తువులు కొనేవాళ్ళు. ప్రతి శనాదివారాలూ భార్యాభర్తల్లో ఎవరో ఒకరు నన్ను అమెరికాలో ఎక్కడికో ఒకచోటికి తీసుకెళ్తారు. ఏంట్రూజ్ వెంట నేను మాత్రం వెళ్తే మార్థాకి నచ్చదేమోనని మొదట్లో జంకేదాన్ని. కానీ ఆమె ప్రవర్తనలో ఎటువంటి మార్పూ కనిపించకపోయేసరికి అర్థం చేసుకున్నాను.

అమెరికాలో స్త్రీ పురుషుల మధ్య ఎంత విచ్చలవిడి సంబంధాలున్నప్పటికీ, ఒకసారి ఒకరి మీద ఒకరికి నమ్మకం ఏర్పడ్డాక, ఇక వాళ్ళమధ్య సంబంధం నిజాయితీగా కొనసాగుతుంది. ఏంట్రూజ్ ఎప్పుడూ నాతో భారతదేశంలోని కొందరి వెకిలి మగాళ్ళలా ప్రవర్తించి అతి చనువు తీసుకోలేదు. మొదటిసారి 'నా అంతట నాకే నేను తప్పు చేశానా? నరోత్తమ్ పరాయి ఆడవాళ్ళతో మాట్లాడినంత మాత్రాన, పాత స్నేహితురాలు స్వాతిని తాకినంత మాత్రాన అపార్థం చేసుకున్నానా?' అని అనిపించింది. ఇక్కడికి వచ్చాక మానవ సంబంధాల గురించీ, స్త్రీ పురుష సంబంధాల గురించీ నాకున్న అభిప్రాయాలు మారిపోయాయి.

నరోత్తమ్‌ని నేను సరిగ్గా అర్థం చేసుకోలేదేమో! నేను ఏంట్రూజ్‌తో ఇలా బయటికి వెళ్ళినట్లు నరోత్తమ్‌తో ఏ పరాయి ఆడదైనా వెళ్తే నేనేం చేసేదాన్ని? భగవంతుడా! ఈ విషయంలో నరోత్తమ్‌ని నేను ఎంత మానసికంగా హింసించాను! పాపం, ఆయన ఎంత బాధపడి ఉంటారు? వెంటనే ఇండియా వెళ్ళిపోవాలనిపించింది నాకు.

"ఇక నేను మా దేశానికి వెళ్ళిపోతాను" అన్నాను ఏంట్రూజ్‌తో.

"ఇంకా కొన్నాళ్ళుండి, మరికొన్ని ప్రదేశాలు చూడొచ్చు కదా!" అంది అతని భార్య మార్థా.

కానీ నాకు వెంటనే నరోత్తమ్ దగ్గరకెళ్ళిపోవాలన్న కోరిక చాలాకాలం తరువాత తీవ్రంగా కలిగింది. అప్పటికి నా దగ్గర చాలా డబ్బే ఉంది. అందుకే ప్రభాస్ నా కోసం కొన్న రెండు టికెట్ల డబ్బూ వాడికి పంపించేసి, నా డబ్బుతో ఇండియాకి టికెట్ కొనుక్కున్నాను. అయినా ఇంకా

అ
క్ష
రం

నిరంతరం వెలిగే సూర్యుణ్ని
చూసి చీకటి భయపడుతుంది
అలాగే నిరంతరం శ్రమించేవాణ్ని
చూసి ఓటమి భయపడుతుంది

– స్వామి వివేకానంద



నా దగ్గర రెండువేల డాలర్లు మిగిలాయి. అంటే బోలెడన్ని రూపాయలు!

సెప్టెంబరు *09, 1996*

స్వప్న కూడా తన క్లాస్‌మేట్‌ని పెళ్ళి చేసుకుంది. ఇద్దరూ రిజిస్టర్ మేరేజ్ చేసుకున్నారన్న విషయం మాత్రం నాకు ఫోన్ చేసి చెప్పింది. నాకు కావాలంటే సప్తపది, పెళ్ళితంతూ చేసేందుకు తను సిద్ధమేనని అంది. నీ ఇష్టం అని చెప్పి, ఓ ఐదులక్షలు పెళ్ళికానుకగా దానికి పంపించి నా బాధ్యత నెరవేర్చాను. మొన్ననే సురేఖ ఫోన్ చేసి నరోత్తమ్ స్నేహితుడు గజేంద్ర కారు ప్రమాదంలో చనిపోయారనీ, నరోత్తమ్ దగ్గర ఒకప్పుడు చదువుకున్న సురేంద్ర వ్యాస్ అనే అతను నరోత్తమ్‌ని జబల్‌పూర్‌లో ఉన్న వాళ్ళింటికి తీసుకెళ్ళాడనీ చెప్పింది.

నేను విని ఊరుకున్నాను. పిల్లలిద్దరూ అసలు తండ్రి ఊసే ఎత్తరు. నేనూ, అమ్మా, సురేఖ - మేం ముగ్గురమే - ఎప్పుడైనా నరోత్తమ్‌ని తల్చుకుంటూ ఉంటాం. సురేఖగాని, అమ్మగానీ ఆయన గురించి ఏమైనా అన్నా కూడా నేను కల్పించుకుని ఏమీ మాట్లాడను. అతని గురించిన ఆలోచనలు నా మనసులోనే ఉంచుకుంటాను. కానీ ఇటీవల నేను అమెరికాలోని కొందరి భార్యాభర్తల జీవితం చూశాక, నాలో ఏదో పరివర్తన చోటుచేసుకుంది. మావారి మీద నాకున్న కోపం, ద్వేషం మాయమయ్యాయి. మా కుటుంబం ఇలా అవడానికి మేమిద్దరం బాధ్యులమేననీ, ఇందులో ఇద్దరి తప్పూ ఉందనీ అనిపించింది. ఎక్కడైనా కొత్తగా పెళ్లయిన జంట కనిపిస్తే, వాళ్ళ కళ్ళలో ఒకరిమీద ఒకరికి పొంగి పొర్లే ప్రేమ కనిపిస్తే ఏదో తెలీని ఆనందంతో నా కళ్ళు చెమరుస్తాయి. వాళ్ళిద్దరూ అలాగే కలకాలం సుఖంగా ఉండాలనీ, నాలాగా, నరోత్తమ్‌లాగా తెలివితక్కువగా అపార్థాలతో జీవితాన్ని పాడుచేసుకోకూడదనీ దేవుణ్ణి ప్రార్థిస్తుంటాను. కానీ ఇప్పుడు జ్ఞానోదయం కలిగినా ఏం ప్రయోజనం? అమెరికాలో నా కొడుకు ఇంట్లో కలిగిన మనస్తాపం, ఏండ్రూజ్ మార్థాల అన్యోన్య దాంపత్యం తాలూకు జ్ఞాపకాలు ముసురుకుని నన్ను నరోత్తమ్ దగ్గరకి వెళ్ళమని తొందరపెడుతున్నాయి. కానీ నరోత్తమ్ ఇప్పుడు ఎలా ఉన్నారో? ఏ పరిస్థితుల్లో ఉన్నారో? ఎందుకో మళ్ళీ ఆయన దగ్గరకి పోవాలన్నా, ఆయనకు ఎదురుపడాలన్నా ఏదో తెలీని భయం ముంచుకొస్తోంది.

డిసెంబరు *17, 1997*

ఇక నరోత్తమ్‌ని చూడకుండా ఉండడం నావల్ల కాదనిపిస్తోంది. ఆయనకి మతిభ్రమించిందని సురేఖ నాతో చాలాసార్లు అంది. నేను నమ్మలేదు. అదంతా నటన అని కొట్టిపారేశాను. కానీ ఇప్పుడు నాకు అనిపిస్తోంది. ఇంతకాలం ఎవరైనా ఎలా నటించగలరు? ఇతరులని మభ్యపెట్టగలరు? ఆత్మహత్య చేసుకోవాలని వంతెన మీద నుంచి నదిలోకి ఆయన దూకినప్పుడు తలకేమైనా గాయం అయిందేమో? మెదడు దెబ్బతిని అలా ప్రవర్తించారేమో? లేదా ఆయన మనసుకే చాలా లోతైన

గాయం అయిందేమో? ! ఆయన్ని మళ్ళీ మామూలు మనిషిని చేసేందుకు నేనే ప్రయత్నించాలి. అది నావల్లే వీలవు తుంది. అలా అనిపించగానే ఎక్కడలేని ధైర్యం నాలో చోటుచేసుకుంది.

వెంటనే సురేఖని అడిగి వ్యాస్ అడ్రసు తీసుకుని జబల్ పూర్‌కి బయలుదేరాను. నాకు మాత్రం ఆయనతప్ప ఎవరున్నారు?

అమ్మ ఇంక ఎన్నాళ్ళు ఉంటుంది? సురే ఖకి తన సంసారం పిల్లల బాధ్యతలతోనే సరిపోతుంది. ప్రభాస్, వాడి భార్య వల్ల నాకు కలిగిన చేదు అనుభవంతో ఇంక వాళ్ళు నాకు దూరం అయిపోయినట్టే!

స్వప్న పెళ్ళిచేసుకున్నాక, భర్తతో కలక త్తాలో స్థిరపడింది. ఎవరి గొడవల్లో వాళ్ళు ఉన్నారు. ఇక నరోత్తమ్, నేనూ ఒకరికొ కరం మిగిలాం!

నేను వ్యాస్ ఇంటికి చేరుకునే వేళకి అతనూ, అతని భార్య ఆఫీసుకి, పిల్లలు స్కూలుకీ వెళ్ళిపోయారు.

నరోత్తమ్ ఒక్కరూ వరండాలో కూర్చుని ఉన్నారు. ఇంటి ఆవరణలో ఉన్న బోగన్ విల్లా పొదమాటున నిలబడి ఆయన్ని చూడసాగాను. నా కళ్ళు నీళ్ళతో నిండాయి. ఆయన దగ్గరకెళ్ళాలని మనసు ఒకపక్క లాగుతున్నా, మరో పక్క వెళ్లేం దుకు నా కాళ్ళు కదలటం లేదు. ఇంతలో ఎవరో ఒకామె ఆయన దగ్గరకి వచ్చి నిల బడింది. ఆమె వీపు నా వైపు ఉంది, మొహం కనిపించటం లేదు. పైగా బోగన్ విల్లా కొమ్మలు అడ్డుగా ఉన్నాయి, ఆమె నీడలో నిలబడింది. గుర్తు తెలియటం లేదు. ఎవరీమె?

ఆవిడ మాటలు వినిపించాయి "బాగా



అయిందా కలెక్టర్ బాబూ! నీకు తగిన శాస్తి జరిగింది కదూ! అనుభవించు! నన్ను కాదన్నావు! ఏరి కోరి నీ దగ్గరికొస్తే.. కాలేజీ రోజుల్లో ఎవరో కుర్రాడి మోజులో పడి అతనితో ప్రేమ వ్యవహారం నడిపానని నన్ను తోసిపుచ్చావు! నన్ను పెళ్ళిచేసుకోనని మా నాన్నతో అన్నావు!

నువ్వు చేసిన పాడు పని అప్పుడు నీకు గుర్తురాలేదు.. నువ్వు మాత్రం ఏం ఘన కార్యం చేశావు? నీ కన్నా వయసులో పెద్దదయిన మా పిన్నితో అక్రమ సంబంధం పెట్టుకోలేదా? అయినా అదంతా మర్చిపోయి నేను నీతో పెళ్ళికి సిద్ధం అయానే? మా కుటుంబం సాయం చెయ్యబట్టే కదా నీ చదువు పూర్తయింది! ఆఫీసరవగానే కళ్ళు నెత్తికెక్కాయా? "

నేను మ్రాన్పడిపోయాను. ఆ గొంతు సురేఖది! మాట్లాడటం అయాక సురేఖ కోపంతో ఊగిపోతూ నరోత్తమ్ భుజాలు పట్టుకుని కుదిపెయ్యసాగింది!

ఆయన్ని కాపాడేందుకు నేను ముందుకు వెళ్ళబోయేంతలో, మా ఆయన దగ్గర డ్రైవర్‌గా పనిచేసిన గిరిధారి లోపల్నించి బయటికి వచ్చాడు.

"అమ్మా! మా అయ్యగారిని ఎందుకిలా బాధ పెడతారు? మీరు ఆయన్ని పీడించడం మానకపోతే పోలీసులకి రిపోర్ట్ చెయ్యాల్సి వస్తుంది. మీరు మళ్ళీ వస్తే పోలీసులని పిలవమని వ్యాస్ బాబు చెప్పారు. పోయినసారి ఇక్కడకొచ్చినప్పుడు మీరు ఇలాగే అల్లరి చేస్తే వ్యాస్ బాబు పోలీసులని పిలిపించి మీకు వార్నింగ్ ఇప్పించారు! అప్పుడే మరిచిపోయారా? " అన్నాడు కోపంగా.

సురేఖ తుపుక్కున కసిగా నేలమీద ఉమ్మాక, తలుపు దఢాలున తోసుకుని వెళ్ళిపోయింది.

నా కళ్ళు బైర్లు కమ్మాయి. తల తిరిగిపోసాగింది. 'ఎంతో ధైర్యం కూడదీసుకుని ఇక్కడికి వచ్చింది ఇది చూడటానికా?



భగవంతుడా ఏమిటిది? ఇలాంటి అక్క నాకెందుకు దాపురించింది? నన్నెందుకిలా సర్వనాశనం చేసింది? చెప్పుడు మాటలు విన్న నా వల్లే కదా గంగిగోవులాంటి ఆయన ఇలాంటి స్థితికి వచ్చారు! ఈయన్ని కాపాడటం నా వల్ల అవుతుందా? ఆయన్ని మళ్ళీ మామూలు మనిషిని చెయ్యగలనా? ఇక నేను ఎవరి కోసం బతకాలి? నిద్రమాత్రలు మింగి చచ్చిపోతే అన్ని బాధల నుంచీ నాకు

విముక్తి దొరుకుతుంది!' అనుకుని నరోత్తమ్‌ని దూరం నుంచే తనివితీరా చూశాక అక్కడి నుంచి వెళ్ళిపోయాను.

ఇదే ఆమె డైరీలోని ఆఖరి పేజీ!




ఇది యాదృచ్ఛికంగా జరిగిందో? లేక దురదృష్టవశాత్తు జరిగిందో? తెలీదుగాని రత్న నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకున్న రోజునే నరోత్తమ్ కూడా చనిపోయాడు. ఆ రోజు.. డిసెంబరు 17, 1997న రాత్రి తొమ్మిది గంటలప్పుడు ఇద్దరూ ఈ లోకం విడిచి వెళ్ళిపోయారు.

నరోత్తమ్, రత్నా ఇద్దరూ స్వతహాగా మంచివాళ్ళే! అయినా జీవితాంతం కష్టాలు అనుభవించారు.

పై లోకం అంటూ ఉంటే.. అక్కడ ఇద్దరూ కలుసుకుని ఉంటారా? అక్కడకి వెళ్ళాక ఇద్దరి మధ్యా ఉన్న అపోహలూ అపార్థాలూ తొలగిపోయి ఉంటాయా? మళ్ళీ జన్మ అంటూ ఉండి ఈ లోకంలో పుడితే ఇద్దరూ కలుసుకునే అవకాశం వస్తుందా? ఏమిటీ ప్రశ్నలు నాలో? వీటి వల్ల ఏం లాభం? నాకు సంబంధంలేని వాళ్ళ గురించి బుర్ర బద్దలు కొట్టుకోవడం వల్ల ప్రయోజనం ఏమన్నా ఉందా? ఊహుఁ! ఏం లాభం లేదు!

★ ★ ★

రత్నడైరీ చదవడం పూర్తయేసరికి ఉదయం ఏడు గంటలయింది. చలికాలం కాబట్టి కాసేపు నిద్రపోవచ్చని అనుకున్నాను. మళ్ళీ నిద్రలోకి జారుకున్నాను. రత్న వాళ్ళమ్మగారు కూడా నన్ను లేపలేదు. చివరకి పదకొండు గంటలకి మెలకువ వచ్చింది. గదిలోంచి బయటికి వచ్చాను. రత్నా వాళ్ళమ్మ హాల్లో కూర్చుని ఉన్నారు. నన్ను చూడగానే టీ తెమ్మని పనమ్మాయిని పురమాయించింది. టీ వచ్చింది. నేను చప్పరించసాగాను.

నా మొహంలో ఆమెకి ఏం కనిపించిందో తెలీదుగాని, "కొందరు పుట్టినప్పుడే కష్టాలని వెంట పెట్టుకుని వస్తారు లాగుంది! లేకపోతే మా రత్నా, నరోత్తమ్ ఎందుకలా అన్ని కష్టాలు పడ్డారు నాయనా? వాళ్ళకి ఏం తక్కువైందని? " అంటూ ఆమె పెద్దగా నిట్టూర్చింది.

"మీరు మీ అమ్మాయికి నచ్చ చెప్పేందుకు ప్రయత్నించలేదా? " అని అడిగాను.

"మా ఇంట్లో నా మాట ఎప్పుడూ, ఎవరూ వినిపించుకోలేదు నాయనా! మొదట్లో మావారి దూకుడు స్వభావం వల్లా, తరువాత మొగుడు పోయినా చెల్లెలు మా ఇంట్లో చేరి ఇంటి పెత్తనమంతా తన చేతిలో పెట్టుకోవడం వల్లా నేను నోరెత్తలేకపోయేదాన్ని!

చివరికి నా పిల్లలు కూడా నాకేమీ తెలీదనీ, బొత్తిగా ఏమీ చేతకాని మనిషిననీ నిర్ధారించేశారు. మా ఆయనా, మా చెల్లెలు పోయాక, పెద్ద వయసులో ఆస్తిపాస్తుల వ్యవహారాలు చూసుకునేందుకు మొదటి సారి ఇంటి బయట కాలుపెట్టాను. బయటి వాళ్ళతో మాట్లాడాల్సి వచ్చింది. దానివల్ల ఇప్పుడు నాకు కాస్త ధైర్యం వచ్చింది. మా వారూ, రత్నా పోకముందు నువ్వు నన్ను చూసి ఉంటే నే చెప్పేది నీకు అర్థం అయేది!" అందామె.

"మీరు క్షమిస్తానంటే.. నేను మిమ్మల్ని ఒకటి అడగాలనుకుంటున్నాను. రత్నగారి ఈ డైరీని నేను ఉంచుకోవచ్చా మేడమ్? "

అని అడిగాను.

ఆమె కాస్సేపు జవాబు చెప్పకుండా ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. తరువాత "తీసుకెళ్ళు నాయనా! దీన్ని దాని కూతురు స్వప్నకి ఇద్దామనుకున్నాను, కానీ అది తనకి అక్కర్లేదంది. దీనికి విలువ ఇచ్చే వారెవరున్నారు ఇప్పుడు? నేను పోయాక దీన్ని ఎలాగూ పాత పేపర్లు కొనేవాడికి పడేస్తారు. స్వప్న ఇక్కడికి కేవలం డబ్బు కోసం వచ్చింది, వాళ్ళమ్మ బ్యాంక్ అకౌంట్‌లో తన పేర ఉన్న డబ్బు తీసుకుంది. ఈ ఊరొచ్చినపుడు ఇంటికి రాలేదు. హోటల్లోనే దిగింది. నన్ను చూసేందుకైనా రాలేదు. ఫోన్లో మాట్లాడింది. నేనే డైరీ తీసుకుని అది దిగిన హోటల్‌కి వెళ్ళాను. కానీ అది ఈ డైరీ వైపు కన్నెత్తి కూడా చూడలేదు. ఇక నా మనవడు ప్రభాస్ అసలు రానే లేదు. వాళ్ళ పెద్దమ్మ సురేఖకి పవర్ ఆఫ్ అటార్నీ ఇచ్చాడు వాడు. సురేఖే ఇక్కడికొచ్చి వాడికి రావలసిన వాటా తీసుకుని వెళ్ళింది" అని అంది.

"భర్తని వదిలేసి రత్నగారు పుట్టింటికి వచ్చేశాక, సురేఖగారితో ఆమె సఖ్యంగానే ఉండేవారా? " అని అడిగాను.

"మొదట్లో - నరోత్తమ్‌ని వదిలేసి మా దగ్గరికొచ్చాక - రత్న ఎవరితోనూ ఎక్కువ మాట్లాడకుండా తన గదిలోనే ఉండేది. మా పెద్దమ్మాయీ అల్లుడూ రత్నని కలిసేందుకు వస్తూండేవారు. కానీ సురేఖ ఎప్పుడూ నరోత్తమ్ గురించి ఏదో ఒక పుల్లవిరుపు మాట అనేది.

చూసి చూసి ఒకరోజు రత్న, 'మా ఆయన గురించి ఇలాంటి మాటలు మాట్లాడావంటే ఊరుకోను' అని గట్టిగా దులిపేసింది. దాంతో సురేఖ ఇటువైపుకి రావడం మానేసింది. తన చెప్పుడు మాటలతో సురేఖే రత్న కాపురం చెడగొట్టిందన్న సంగతి ఎప్పుడో గ్రహించాను. రత్న పోయినప్పుడు మాత్రం ఇక్కడికి వచ్చింది. దాని వస్తువులన్నీ బయటికి తీసి దేనికోసమో వెతికింది. రత్న డైరీ రాస్తుందని నాకు తెలుసు. అందుకే ముందే దీన్ని భద్రంగా నా అల్మారాలో దాచాను.

పాపం రత్న! అది పోయినప్పుడు దాని పిల్లలిద్దరూ చూసేందుకు కూడా రాలేదు. ఇక నరోత్తమ్ అయితే రత్నకన్నా అధ్వాన్నమైన స్థితిలో ఉన్నాడు. అతనికి తల కొరివి పెట్టింది కూడా పరాయివాడే కదా! ఏ జన్మలో చేసిన పాపానికి ఇలాంటి శిక్ష అనుభవించారో? అనుకుంటే కడుపు తరుక్కుపోతుంది!" అంటూ ఆవిడ ఏడవడం మొదలుపెట్టింది.

నాకు సాధ్యమైనంతవరకు ఆమెని ఓదార్చి, రత్న డైరీ తీసుకుని అక్కణ్ణించి బయటికొచ్చాను.

మధుర నుంచి నేను ఢిల్లీ వెళ్ళాను. వ్యాస్‌గారికి ఫోన్ చేసి నరోత్తమ్‌గారి గురించి మాట్లాడాలనీ, ఎప్పుడు రమ్మంటారనీ అడిగాను. ముందు ఆయన ఒప్పుకోలేదు. కానీ నేను మరీ మరీ బతిమాలేసరికి తనే నేనున్న హోటల్‌కి వస్తానని, చెప్పిన సమయానికి వచ్చేశాడు. అతనూ నేనూ దాదాపు నాలుగు గంటలు మాట్లాడుకున్నాం. చాలా విషయాలు అతను నాకు చెప్పాడు.

నరోత్తమ్ ఆఫీసులో వ్యాస్ వాళ్ళ నాన్న బంట్రోతుగా పనిచేసేవాడు. కొడుకు తనలా కాకూడదనీ చదివిస్తూండేవాడు. అయితే కొడుకు కాలేజీలో చేరే సమయానికి అతనికి ఏ మందులకీ లొంగని జబ్బేదో పట్టుకుంది. అందువల్ల అతను ఉద్యోగం మానెయ్యవలసి వచ్చింది. ఆఫీసు వాళ్ళు అతని ఉద్యోగాన్ని కొడుక్కి ఇవ్వాలని అనుకుంటూండగా నరోత్తమ్ కలగజేసుకుని ఆ ఉద్యోగాన్ని వ్యాస్ వాళ్ళ అమ్మకి ఇప్పించారు. అంతేకాదు, వ్యాస్‌ని చదివించే బాధ్యత కూడా తనే తీసుకున్నారు. అప్పటికే వ్యాస్ తెలివైన కుర్రాడిగా

పేరు తెచ్చుకున్నాడు. ఇంటర్‌లో స్టేట్ ఫస్ట్ వచ్చాడు. నరోత్తమ్ అందించిన ఆప న్నహస్తం సాయంతోనే బీకామ్, తరువాత బ్యాంక్ పరీక్షలకు చదివి, బ్యాంక్ ఆఫీసర్ అయ్యాడు. అంచెలంచెలుగా ఎదిగి మేనే జర్ స్థాయికి చేరుకున్నాడు. వ్యాస్ పెళ్ళి విషయంలో కూడా నరోత్తమ్ పాత్ర ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యాస్‌కీ అతని కుటుంబానికీ అన్నివిధాలా సాయ పడి, బంట్రోతు కొడుకు బంట్రోతు కాకుండా నరోత్తమ్ ఆదుకున్నారు.

వ్యాస్‌గారు నరోత్తమ్ గురించి చెప్పిన విషయాల్లో నాకు ఇంతకు ముందు తెలి యని కొన్ని కొత్త కోణాలు ఉన్నాయి. ఆఫీ సరు అయాక వేరే ఊర్లో నరోత్తమ్ తన తల్లితో ఉంటున్న సమయంలో, రత్నా వాళ్ళ పిన్ని తరచూ అతని ఇంటికి వచ్చి, తనని పట్టించుకోకపోతే అతని పరువు బజారున పడేట్టు చేస్తానని బెదిరించేదట! అంతేకాదు, ఆ ఊపులో నరోత్తమ్ తల్లి పెద్దామెని కూడా నానా మాటలూ అని వెళ్ళేదట. తిండికి లేక తమ ఇంటికి చేరిన నరోత్తమ్‌కి తాము ఎంతో సాయం చేశా మనీ, కానీ అతను తమ కుటుంబం పట్ల ఏమాత్రం కృతజ్ఞత చూపడం లేదనీ అనేది. ఒకసారి ఏకంగా సురేఖని వెంట బెట్టుకుని వాళ్ళింటికి వెళ్ళి, అక్కడే తిష్ఠ వేసి, సురేఖతో పెళ్ళికి ఒప్పుకోమని, లేక పోతే తాము అక్కణ్ణించి కదలబోమని అతన్ని ఇరుకున పెట్టిందట! వాళ్ళని వది లించుకోడానికి నరోత్తమ్ తమ బంధు జనం చేత సురేఖ వాళ్ళ నాన్నని కల్పిం చుకోమని చెప్పించారు! ఎవరు ఎంత బల వంత పెట్టినా నరోత్తమ్ సురేఖని పెళ్ళా డేందుకు అంగీకరించలేదు. కాలేజీలో ప్రవ ర్తనే కాక, మొత్తం మీద ఆమె అంటే ఆయ నకెంతో అసహ్యం! రత్నావాళ్ళ పిన్ని హఠాత్తుగా చనిపోయి ఉండకపోతే ఆ గొడవలు టీవీ సీరియల్లాగా ఎంతకాలం కొనసాగేవో అన్నారు వ్యాస్.

ఈ విషయాలన్నీ అతనికి ఎలా తెలు సని అడిగాను. నరోత్తమ్‌గారు తనకి చేసిన సాయానికి కృతజ్ఞతా భావంతో తను తరచు వాళ్ళింటికి వెళ్తూ ఉండేవాడి నని, అలా వారి తల్లిగారికి తను చాలా దగ్గరయాననీ, ఇంచుమించు వారి కుటుంబ సభ్యుడిగా తనని ఆమె భావించే దనీ, ఈ కష్టాలన్నీ చెప్పుకునేందుకు మరె వరూ లేకపోవడంతో తనతో ఆమె చెప్పే దనీ అన్నారు వ్యాస్.

మరి రత్నవాళ్ళ పిన్ని బతికుండగానే రత్నకీ నరోత్తమ్‌గారికి పెళ్ళి ఎలా జరిపిం చారని అడిగాను.

నిజానికి ఆ పెళ్ళి కూడా ఆయనకి ఇష్టం లేదనీ, జీవితాంతం పెళ్ళి చేసుకోకుండా ఉండిపోవాలని అనుకున్నారని చెప్పాడు. కాసేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయి మళ్ళీ ఇలా చెప్పడం ప్రారంభించాడు.

"ఒకసారి నేను ఆయన్ని కలుసుకునేం దుకు వెళ్ళినప్పుడు నేను పెళ్ళి చేసుకోక తప్పేటట్టు లేదు. నేను చేస్తున్న ఉద్యోగం కోసం మన దేశంలో అందరూ కలలు కంటారు. కానీ ఇది పూలబాట కాదు. ఈ పదవిలో ఉండటం అంటే ముళ్ళ కిరీటం ధరించడమే! అడుగడుగునా కనబడని ప్రమాదాలుంటాయి. పరిస్థితులకీ, రాజ్య వ్యవస్థకి బందీ అయిపోవడమే! ముఖ్యంగా తోటి మహిళా ఉద్యోగులతో క లిసి పనిచేయడం రెండువైపులా పదు నున్న కత్తి మీద నడవడమే అనుకో! అందుకే మాలాంటి వాళ్లకి ఈ 'పెళ్ళి లేబిల్ అవసరం!

మేం పెళ్ళి చేసుకుంటే కొంతలో కొంత గౌరవం దక్కుతుంది. పెళ్ళయినవాడి జోలికి అంత సులభంగా రారు. సరే! ఇదంతా ఒక ఎత్తు! రాజకీయనాయకుల జోక్యం మరో ఎత్తు! ఇవే కాక ప్రభుత్వశా ఖలలో రాజ్యమేలుతున్న లంచగొండితనం,

మధ్యవర్తులు, దళారుల కుటిల యత్నాలు!" అని అంటూ నిట్టూర్చారు.

నేను ఆయనకన్నా అన్నివిధాలా చిన్నవాణ్ణి! అయినా, నామీద ఆయన ఎంతో వాత్సల్యం చూపించేవారు. తన బంట్రోతు కొడుకుగా నన్ను ఎప్పుడూ చూడలేదు. తను సాయం చేసినందుకు నేను శ్రద్ధగా చదివి జీవితంలో పైకొచ్చానని ఆయనకి ఆనందం. అందుకే తన మనసులోని మాటలన్నిటినీ ఏదీ దాచకుండా నాతో చెప్పుకునేవారు.

చివరికి ఒకరోజు రత్నతో తన పెళ్ళి నిశ్చయమైందని చెప్పారాయన.

నా మనసులోని సందేహాన్ని బయటపెట్టాను. నరోత్తమ్ తనకీ, రత్న పిన్నికీ మధ్యన కొంతకాలం జరిగిన వ్యవహారం గురించీ, రత్న అక్కయ్యని తనకిచ్చి పెళ్ళి చెయ్యాలని వాళ్ళు అనుకున్న సంగతీ నాకు ముందే చెప్పారు. అందుకే, "ఇంత క్రితం జరిగిన సంఘటనల నేపథ్యంలో మీరు ఆ కుటుంబంలోని అమ్మాయితో పెళ్ళికి ఎందుకు ఒప్పుకుంటున్నారో తెలుసుకోవచ్చా? " అని అడిగాను.

"మా అమ్మకి రత్న అంటే చాలా ఇష్టం! రత్నని పెళ్ళి చేసుకోమని ఎప్పటినుంచో పోరుతోంది. రత్నావాళ్ళ నాన్నకి తను మాటిచ్చానని కూడా అంది. ఆయన మా కుంటుంబానికి ఎన్నోవిధాల సాయం చేశారు. ఆ రుణం ఈవిధంగా తీర్చుకునేందుకే ఇలాంటి అవకాశాన్ని ఆ దేవుడే కల్పించాడేమో? అని నాకు అనిపించింది! మరో విషయం! మధ్యతరగతి తల్లిదండ్రులు ఐ.ఎ.ఎస్. సంబంధాల చుట్టుపక్కలకి రావడానికి భయపడతారు. కానీ ధనవంతుల కుటుంబంలోంచి వచ్చిన అమ్మాయిని చేసుకుని నేను ఇబ్బంది పడలేను. నేను చేసే ఉద్యోగం ఎంత గొప్పదైనా, నా స్వభావం, అలవాట్లు మధ్యతరగతివే ఇంకా! అందుకే రత్నతో రాసిపెట్టి ఉంటే, ఆమెతోనే నాపెళ్ళి జరగనీ" అని ఆయన నిర్వేదంగా సమాధానమిచ్చారు.

"నరోత్తమ్‌గారికీ, ఆయన భార్యకీ మధ్య గొడవలు ప్రారంభమై అవి తీవ్రస్థాయి చేరుకున్నాక, ఆయన నన్నొకసారి వచ్చి వాళ్ళ ఆవిడతో మాట్లాడమని కోరారు. మొదట్లో జంకాను. కానీ ఆయన పడుతున్న బాధ చూడలేక, వారి కుటుంబంతో నాకున్న ఆత్మీయ సంబంధంతో చనువు తీసుకుని, వాళ్ళిద్దరినీ కూర్చోబెట్టి వాళ్ళ వ్యక్తిగత సమస్యల గురించి సున్నితంగా ప్రస్తావించాను. రత్నగారిది నిజంగా మంచి మనసు! కల్మషం లేని మనిషి! నా ఎదుటే ఇంకెప్పుడూ తను అలా ప్రవర్తించనని భర్తకి మాటిచ్చేది ఆమె. కానీ మళ్ళీ ఎందుకో ఆమెలో ఏవో మానసిక సమస్యలు తలెత్తేవి. చిన్న చిన్న విషయాలకే భర్తని అనుమానించడం, చివరికి డాక్టర్ల సలహాలు కూడా వినకుండా, వాళ్ళు తన భర్త తరపునే మాట్లాడుతున్నారని కోపగించుకోవడం ఎక్కువైంది. 'నరోత్తమ్‌గారు ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యకముందు, వాళ్ళిద్దరూ కలిసి ఉన్న చివరి రోజుల్లో, రత్నగారి ప్రవర్తన మరీ ఘోరంగా తయారైంది. ఇంటికి ఎవరైనా వస్తే చాలా కటువుగా, వాళ్ళని అవమానించే విధంగా మాట్లాడడం మొదలుపెట్టిందావిడ. చివరికి నేను కూడా ఆవిడ నోటికి దడిసి

## కొత్తగాలి...

**కష్టాలకు**
**సుఖాలకే కాదు**
**కడివెడు నీళ్లు లేనపుడు కూడా**
**కన్నీళ్లు వస్తాయి!**

– నెల్లుట్ల సుదర్శనరావు,
హైదరాబాద్

## కొత్తగాలి...

**నాటి కృష్ణుడు**
**నీల మేఘుడు**
**నేటి కృష్ణులు**
**కాలనేములు**

– యం. సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

అటువైపు వెళ్ళడం మానుకున్నాను. పైగా నేనక్కడికి వెళ్ళడం వల్ల ఆవిడ నరోత్తమ్ గారిని మరింత పీడిస్తుందేమోనన్న భయం కూడా వేసింది? ”

అంతవరకూ చెప్పి వ్యాస్‌గారు ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయారు. 'నాకు చెప్పకూడని విషయాలు ఏమైనా ఉన్నాయా? ' అని అడగాలని అనిపించింది నాకు. కానీ నరోత్తమ్, రత్న రాసుకున్న డైరీలు చదివానని నేను ఆయనతో అంతకు ముందు అన్నాను. ఆయనకా విషయం గుర్తొచ్చినట్లు మళ్ళీ చెప్పడం కొనసాగించాడు.

“రెండు మూడుసార్లు ప్రభాస్‌తో మాట్లాడటానికి ప్రయత్నించాను. వాళ్ళ నాన్న గారి పరిస్థితి ఎలా ఉందో? తల్లిదండ్రులు విడిపోయే ప్రమాదం ఎలా పొంచి ఉందో? చెప్పి, కొడుకుగా అతను కల్పించుకుని ఏదైనా చేస్తే బావుంటుందేమో? అని సూచించాను.

కానీ అతను చాలా అమర్యాదగా ప్రవర్తించాడు. తన తండ్రి విదిల్చిన ఎంగిలి మెతుకులు తిని నేనీ స్థితికి వచ్చాననీ, అలాంటప్పుడు ఆయన పక్షాన వకాల్తా తీసుకోక ఇంకేం చేస్తాననీ, వాళ్ళ బంట్రోతు కొడుకన్న విషయం గుర్తుంచుకుని నేను నడుచుకోవాలనీ నన్ను హేళన చేస్తూ అవమానించాడు. ఆ తరువాత ఎప్పుడూ ప్రభాస్‌తో నేనా విషయం కదపలేదు. నరోత్తమ్‌గారిని ఇంట్లో కలుసుకునేందుకు ఎలాగూ వీల్లేదు. అందుకే ఆయన్ని కలుసుకునేందుకు వారి ఆఫీసుకే వెళ్తూ ఉండేవాణ్ణి. ఎంత పెద్ద మనిషి ఆయన! వెన్నలాంటి మనసు! ఎవరు కష్టాలు పడుతున్నా చూడలేకపోయేవారు. అలాంటి వారు మతిస్థిమితం లేకుండా జీవచ్ఛవంలా ఉన్నప్పుడు కూడా సురేఖ గారు అప్పుడప్పుడూ వచ్చి ఆయన్ని బాధ పెట్టేటట్టు ప్రవర్తిస్తూ ఉండేవారు. ఒకసారి ఆమె మీద నేను పోలీసు రిపోర్ట్ కూడా ఇవ్వాల్సి వచ్చింది” అన్నారు.

“నరోత్తమ్‌గారు చనిపోయినట్టు వారి భార్యా పిల్లలకి కబురు పంపారా? ” అని అడిగాను.

వాళ్ళ ఫోన్ నంబర్లు కానీ, చిరునామాలు కానీ తన దగ్గర లేవని, అందుకే వాళ్ళకి వెంటనే తెలియజేయలేకపోయాను అన్నాడతను.

ఆయన పోయిన మూడు నెలలకి స్వప్నని వెంటబెట్టుకుని సురేఖగారు తన దగ్గరకీ వచ్చారనీ, ప్రభాస్ ఇచ్చిన పవర్ ఆఫ్ అటార్నీ సాయంతో నరోత్తమ్‌గారి బ్యాంక్ అకౌంట్‌లో ఉన్న డబ్బు మొత్తం డ్రా చేసి తీసుకుపోయారనీ, ఆ తరువాత తనకి ఆ కుటుంబానికి సంబంధం తెగిపోయిందనీ వ్యాస్‌గారు చెప్పారు. నరోత్తమ్ తనకి తండ్రిలాంటి వారనీ, ఆయన్ని తలుచుకోకుండా ఒక్కరోజు కూడా ఉండలేననీ అన్నారు. తరువాత నాదగ్గర సెలవు తీసుకుని వ్యాస్ వెళ్ళిపోయారు.

ఇదంతా చెప్పేప్పుడు చాలాసార్లు అతడి గొంతు పూడుకుపోవడం నేను గమనించాను. అతనికి నిజంగా నరోత్తమ్‌గారంటే ఎంతో గౌరవం, ప్రేమ, ఆరాధనా ఉన్నాయి. ఇలాంటి వాళ్ళ వల్లే ఈ లోకంలో ఇంకా మంచితనం, ప్రేమ నిలిచి ఉన్నాయనిపించింది నాకు.



6

## మళ్ళీ ముంబైకి

**నా**కు ఉద్యోగం చెయ్యాలనిపించలేదు. మానేశాను. బొత్తిగా పనీపాటా లేదు. ఈ మధ్యనే అయిన పరిచయాలు.. నరోత్తమ్, రత్న, వ్యాస్.. వాళ్ళ జీవితాలకి సంబంధించిన అంశాలు రంగులరాట్నంలా బుర్రలో తెగ తిరుగుతున్నాయి. వాళ్ళ జీవితాలు అన్నీ రకరకాల సమస్యల సుడిగుండాల్లో చిక్కుకుని చివరికి కుటుంబమే చెల్లాచెదరైపోయినందుకు చాలా బాధ పడసాగాను. నిజానికి వాళ్ళెవరితోనూ నాకు వ్యక్తిగతంగా కానీ, పరోక్షంగా కానీ ఎటువంటి సంబంధమూ లేదు. ఒకవేళ అలాంటి సంబంధమే ఉండి ఉంటే నేను ఇంకెంత బాధపడేవాడినో!

నాకంటూ ఒక కుటుంబం లేదు. ఎవరూలేని ఏకాకిని. నాలాంటి వాడికి సరైన స్థలం ముంబై నగరమే అనిపించింది. అది నన్ను కడుపులో పెట్టుకుంటుంది. ఈ మహానగరంలో ప్రతి మనిషీ ఒక ఒంటరి ద్వీపంలా, గతాన్ని పూర్తిగా మర్చిపోయి జీవిస్తాడు. అందరికీ తమ భవిష్యత్తు గురించే ఆలోచన!

నరోత్తమ్ - రత్న ఒకవేళ ముంబైలో ఉండి ఉంటే, వాళ్ళు వేరు పడినా ఒంటరితనంతో బాధపడుతూ తమ జీవితాలని అలా ముగ్గబెట్టుకునే వాళ్ళు కాదు. హాయిగా ఎవరిదారిన వారు ముందుకి సాగిపోయేవారు. ఆప్యాయతలూ, మమకారాలను పట్టుకుని వెళ్ళాడేంత తీరిక, వేగంగా ఉరుకులు పరుగులు పెట్టే ఈ నగర జీవితంలో వాళ్ళకి దొరికేవి కాదు. ఇక్కడి జనం పక్కవాడి విషయాల్లో జోక్యం చేసుకోనట్టే, తమ విషయాల్లో ఎవరైనా తల దూరిస్తే ఏమాత్రం సహించరు. నా స్నేహితురాలూ, మోడలింగ్ ఐకాన్ రూబీయే దీనికి మంచి ఉదాహరణ.

నేను ముంబై చేరుకున్న రెండు వారాలకి రూబీ కూడా వెనక్కి వచ్చేసింది. ఆమెలో పెద్ద మార్పేమీ కనిపించలేదు. ఇద్దరం మళ్ళీ ఒకే ఫ్లాట్‌లో కలిసి ఉండడం మొదలుపెట్టాం. ఉద్యోగంలో చేరేందుకు నేను జబల్‌పూర్ వెళ్ళానని తనకి తెలిసినా, ఆ ఉద్యోగం నచ్చిందా? అని కానీ, ఎందుకు వదిలేశావని కానీ ఆమె నన్ను ప్రశ్నించలేదు. అలా అడగటం ఆమెకి అలవాటు లేదు.

"మళ్ళీ నాతోనే కలిసి ఉండాలని ఎందుకు అనుకుంటున్నావు?" ఒకసారి రూబీని అడిగాను.

"నేను నీతో కాదు, నీ శరీరంతో కలిసి ఉంటున్నాను!" అంది సరదాగా నవ్వుతూ.

అంతే! మళ్ళీ నేను నోరెత్తలేదు. అంటే నా శరీరంతో తప్ప మిగిలిన నా వ్యక్తిత్వంతో రూబీకి పనిలేదన్న మాట! కానీ నేను మాత్రం ఆమెని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. ఎప్పుడూ కూడా నేను పెళ్ళి చేసుకుంటానని అనుకోలేదు, కానీ ఇప్పుడు రూబీని వివాహం చేసుకుని, ఆమెతోటే జీవితాంతం ఉండిపోవాలని అనిపిస్తోంది. అయినా ఆమె ముందు పెళ్ళి ప్రస్తావన తీసుకువచ్చే ధైర్యం లేదు నాకు. ఆమె 'నో' అంటుందేమోనని భయం.

ఇద్దరం కలిసి జీవిస్తున్నా, ఒకరి గతం గురించి మరొకరికి తెలీదు, తెలుసుకోవలసిన అవసరమూ లేదు. అవన్నీ అడిగితే అది హద్దు మీరడమే అవుతుందేమో

తెలీదు. ఎందుకంటే ముంబైలో మాలాగ ఎక్కడినుంచో వచ్చి స్థిరపడ్డ వాళ్ళు తమ మూలాల నుంచి వేరుపడి వాటిని ఏనాడో మర్చిపోయారు. జుబేదా వాళ్లలాగ తరత రాలుగా అందరూ కలిసి ఒకేచోట ఉండడ మనేది చాలా అరుదు.

ఒకసారి రూబీకి చాలా జబ్బు చేసింది. ఆస్పత్రిలో చేర్పించవలసి వచ్చింది. అన్ని పనులూ మానుకుని ఆమెకి శుశ్రూష చెయ్యడంలో మునిగిపోయాను. ఆమెకి బ్రెయిన్ ఫీవర్ వచ్చింది. చాలారోజులు కోమాలో ఉంది. అతి కష్టం మీద కోలు కుంది. ఆసుపత్రి నుంచి ఇంటికి వచ్చేం దుకు చాలాకాలం పట్టింది.

ప్రమాదం నుంచి రూబీ బయట పడి నప్పటికీ ఇంకా ఆఫీసుకి వెళ్ళేంతగా ఆరోగ్యం కుదుటపడలేదు. అన్నాళ్ళు నేను ఆమెకి సేవ చేసినందుకేమో నాపట్ల ఆమె మనసు కొంచెం మెత్తబడింది.

ఒకరోజు ఇద్దరం మంచం మీద పడు కుని ఉండగా "రూబీ! నువ్వు అన్నాళ్లు కోమాలో ఉండిపోతే ఒకవేళ చచ్చిపోతా వేమో? నువ్వు పోతే నీ అంత్యక్రియలు నేనే చెయ్యాలి కదా! కానీ నీ మతమేమిటో తెలీకపోతే అదెలా సాధ్యం? అని చాలా కంగారు పడ్డాను తెలుసా!" అన్నాను హాస్యానికి అన్నట్టుగా.

అది విని రూబీ నవ్వుతూ "నేను నీకన్నా ముందు చావనులే!" అంది.

రూబీ మంచి మూడ్‌లో ఉండడం గమ నించి ఆమె రెండు చెంపలూ నా అరిచే తుల్లో బిగించి మొహం నావైపు తిప్పుకుని, "అన్నట్టు ఇంకో ప్రశ్న కూడా నా మన సులో తలెత్తింది రూబీ! నువ్వు పోతే మీ వాళ్ళకి కబురు చెయ్యాలి కదా! మరి నీ గురించి నాకేమీ తెలీదు" అన్నాను.

మళ్ళీ నవ్వుతూ "నువ్వు పోతే నేనెవరికి కబురు చెయ్యాలి? " అంది.

"నిజం రూబీ! మనలో చాలామందికి మన బంధువులెవరో కూడా సరిగ్గా తెలీదు. ఇంకొకళ్ళ దాకా ఎందుకు? నా గురించిన వివరాలే నాకు తెలీదు! మా పూర్వీకులు పంజాబీ ఖత్రీలు. అంటే క్షత్రి యులన్నమాట. దేశ విభజన సమ యంలో వాళ్ళు పాకిస్థాన్ నుంచి వచ్చి భారతదేశంలోని పంజాబులో స్థిరపడ్డారు. అలా వచ్చింది మా నాయనమ్మ, మా నాన్నతో. అప్పుడు ఆయన మూడేళ్ళ పిల్లాడు. ముందు కాందిశీకుల శిబిరాల్లో గడిపింది. తరువాత నకోదర్ అనే ఊరు చేరుకుంది. ఈసారి ఆమెతో పాటూ క్యాంప్ నుంచి అంధురాలైన ఒక ముసలా విడ, రెండేళ్ళ ఆమె మనవరాలూ ఉన్నారు. వాళ్ళిద్దరి మధ్యా మంచి స్నేహం ఏర్పడింది. పిల్లలిద్దరూ పెద్దవాళ్ళ యాక వాళ్ళిద్దరికీ పెళ్ళి చేశారు. మా నాన్న దర్జీ పని చేసేవాడు. కొంతకాలం తరువాత అందరూ చండీగఢ్‌కి వెళ్ళి అక్కడ స్థిరపడ్డారు. నాకు నాలుగేళ్ళ వయసప్పుడు, మా అమ్మానాన్నా ఒక రోడ్డు ప్రమాదంలో చనిపోయారు. ఇక అప్పట్నించీ నా బాధ్యత మా నాయనమ్మే తీసుకుంది.

నా చదువుసంధ్యలు ప్రభుత్వ పాఠశాల లోనే సాగాయి. చిన్న తరగతుల్లో ఉన్న ప్పుడు నా సీనియర్ పిల్లల పాత పుస్తకా లని అడిగి తెచ్చి నాకిచ్చేది నాన్నమ్మ. ఇళ్ళల్లో పాచిపని చేసి ఆమె సంపాదించే కాసిని డబ్బులతోనే పేదగా బతికాం. నేను మిడిల్ స్కూల్ చేరుకునే వేళకి విశ్రాంతి తీసుకోవలసిన వయసులో చాకిరీ చెయ్యడం వల్లా, మానసికంగా ఎన్నో దెబ్బలు తిని ఉండడం వల్లా, నాన్నమ్మ ఇల్లు కదల్లేని స్థితికి చేరుకుంది. స్కూల్ అయాక సాయంకాలాలు రెస్టారెంటులో వెయిటర్‌గా పనిచేసి డబ్బు సంపాదించ సాగాను. రాత్రి పది దాకా పనిచేసి ఇంటి కొచ్చి గంటా రెండు గంటలు పాఠాలు

చదువుకునేవాణ్ణి. చాలా శ్రద్ధగా ఆ రెండు పనులు చేస్తూ, మంచి మార్కులతో పన్నెండో తరగతి పాసయాను. కాలేజీలో చేరాక వెయిటర్ పనిచెయ్యడం నామోషీ అనిపించినప్పటికీ తప్పలేదు. తోటి కుర్రాళ్ళ అవమానాలని భరించాను. కొన్నాళ్ళకి ఆ పని మానేసి, ట్యూషన్ చెప్పడం మొదలెట్టాను, కానీ సంపాదన తక్కువగానే ఉండేది.

ఇంతలో రెస్టారెంట్లలో లైవ్ మ్యూజిక్ ఇవ్వడం మొదలైంది. సంగీతం నేర్చుకోక పోయినా చక్కగా పాడేవాణ్ణి. స్వతహాగానే శ్రుతి లయ జ్ఞానం నాలో ఉండేది. అందు కని హోటళ్ళలో పాడడం మొదలెట్టాను. నా పాటని జనం మెచ్చుకోసాగారు. ధైర్యంతో స్టేజ్ షోలు చెయ్యసాగాను. డబ్బు బాగానే ముట్టేది. అలా గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాను. స్టేజి షోలు చేసే రోజుల్లో ఒక అనుభవజ్ఞుడైన ఫొటోగ్రాఫర్‌తో పరిచయం అయింది. ఆయన దగ్గర ఫొటోగ్రఫీ నేర్చుకున్నాను.

నేను బీకామ్ పాసయిన కొన్నాళ్ళకి నానమ్మ కన్నుమూసింది. అహ్మదాబాద్‌లో ఎమ్.బి.ఎ.లో సీటొచ్చింది. డబ్బు లేదు. నానమ్మ పోయాక నాకు మిగిలిన



కొత్తగాలి...

**భగత్ సింగ్ ధైర్యానికి ప్రతిరూపం**
**మదర్ థెరిస్సా**
**మాతృమూర్తికి నిదర్శనం**
**అబ్దుల్ కలాం**
**నీవే కదా మా ఆదర్శం!**

– కురువ సోమశేఖర్,
*రోళ్లపాడు, కర్నూలు జిల్లా*

ఇల్లు నాకెందుకూ పనికిరాకుండా పోయింది. కాందిశీకులకి ఇచ్చిన చిన్న జాగాలో ఏనాడో నానమ్మ కట్టుకున్న రెండుగదుల ఇల్లు అది! ముఖ్యంగా ఆ స్థలానికి, మంచి ధర వచ్చింది. అది అమ్మేసి అహ్మదాబాద్‌కి వెళ్ళాను. ఎమ్.బి.ఎ. చేశాక రెండు మూడు చోట్ల ఉద్యోగాలు చేశాను. నానమ్మ పోయాక - నీతో పరిచయం అయేవరకు - నా వాళ్ళంటూ ఎవరూ లేకుండా పోయారు. ఇప్పుడు నాకు నువ్వు తప్ప ఇంకెవరూ లేరు" అని అంటూ ఉంటే దుఃఖం ముంచుకొచ్చింది. జీవితంలో మొదటిసారి ఒంటరితనం నన్ను బాధించసాగింది. కళ్ళు చెమర్చాయి. గొంతు పూడుకుపోయింది.

రూబీ నా చేతిని ఆప్యాయంగా నిమరసాగింది. తరువాత తనకి ఏమనిపించిందోగాని ఎప్పుడూ తన గురించి మాట్లాడని రూబీ ఇలా చెప్పడం ప్రారంభించింది.

"నువ్వు అదృష్టవంతుడివి! ఒంటరితనం తప్ప ఇంకే బాధా లేకుండా ఇంతవరకూ బతికావు. అయితే నీ వాళ్ళే నీకు కష్టాలు తెచ్చిపెట్టడం నువ్వు ఎరగవు. నన్ను చూడు! మా నాన్న బాగా డబ్బున్నవాడు. పెద్ద బంగళా, నౌకర్లూ, చాకర్లూ, గౌరవం, హోదా, ఏం లేదని? నేనొక రాకుమార్తె లాగే పెరిగాను. కానీ చిన్నప్పుడు జీవితం ఎంత సుఖంగా గడిచిందో అంతకు వెయ్యింతలు నరకాన్ని ఇప్పటిదాకా అనుభవిస్తున్నాను. నా గురించీ, నా గతం గురించీ ఎప్పుడూ అడిగేవాడివి! తెలుసుకోవాలని చాలా కుతూహలంగా ఉంది కదూ? అయితే విను, చెపుతాను.

మా నాన్న చాలా పెద్ద ఆఫీసరు. కానీ ఎందుకో ఆయనకీ, మా అమ్మకీ పడలేదు. చివరిదాకా ఇద్దరి మధ్యా సయోధ్య కుదరనేలేదు. అమ్మ నన్ను చాలా ప్రేమగా చూసేది, తెలివైనదే. నాన్నకి కూడా నేనన్నా, మా అన్నయ్య అన్నా చాలా ప్రేమ. అమ్మమ్మా, తాతా, మామయ్యా, అత్తయ్యా, పెద్దమ్మ - పెద్ద కుటుంబం మాది. కానీ మా నాన్న నీలాగే ఒంటరివాడు!" అంటూ రూబీ హఠాత్తుగా ఆగిపోయింది. ఏవో ఆలోచనలు ఆమెను చుట్టుముట్టినట్టున్నాయి.

మళ్ళీ చెప్పడం మొదలెట్టింది.

"తల్లిదండ్రులు తెలివితక్కువగా ప్రవర్తిస్తే దాని ప్రభావం.. పిల్లల జీవితాలని నాశనం చేస్తుంది. అదెలా ఉంటుందో నాకు బాగా తెలుసు. నా జీవితం పూర్తిగా గాడి తప్పింది. తరచూ అమ్మానాన్న పోట్లాడుకోవడంతో నేనూ అన్నయ్యా కూడా ఎవరి దారి వాళ్ళం వెతుక్కున్నాం. మాకు పెద్దదిక్కు లేకుండా పోయింది. ఉన్నా వాళ్ళ సలహా మేం పెడచెవిన పెట్టాం. అయినా మా తప్పేం ఉంది? పెద్దవాళ్లే తమని తాము సరైన మార్గంలో పెట్టుకోలేకపోయినప్పుడు, ఒకర్నొకరు అర్థం చేసుకోకపోయినప్పుడు.. అర్థం చేసుకుందామన్న ప్రయత్నం కూడా చెయ్యనప్పుడు.. వాళ్ళిక మాకేం సలహా ఇవ్వగలరు? వాళ్ళు పొట్లాడుకోవడం వల్లే నా జీవితం నాశనమైంది. ప్రేమించే ఒకతన్ని పెళ్ళి చేసుకున్నాను. దాన్ని కూడా కాపాడుకోలేక పోయాను. అతను నన్ను మనసారా ప్రేమించాడు, కానీ నేనే అమ్మలాగ అతనితో అర్థం లేకుండా చిన్న చిన్న విష

యాలకి గొడవపడేదాన్ని.

నన్ను పెళ్ళి చేసుకునేందుకు అతను తన తల్లిదండ్రులని కూడా వదులుకుని విడిగా వచ్చేశాడు. నేను తప్ప అతనికి ఇంకెవరూ లేరు. అలాంటప్పుడు నా గయ్యాళితనంతో అతన్ని అలా బాధపె ట్టడం తప్పే కదా? చాలా కాలం నన్నూ, నా ప్రవర్తననీ భరించాడు. మా నాన్న లాగే తనే సర్దుకుపోయేవాడు. అతని మంచితనాన్ని చేతకానితనంగా అర్థంచేసు కుని ఇంకా రెచ్చిపోవడం ప్రారంభించాను. మా ఇద్దరికీ పిల్లలు పుడితే - చేతకాని దద్దమ్మ మా నాన్నకి పుట్టిన పిల్లల్లాగ - నా లాగ మా అన్నయ్య లాగ తయారవు తారేమోన్న భయంతో, అతనికి విడాకు లిచ్చి ఇక్కడికి వచ్చేశాను. మా నాన్న కావ డానికి గొప్ప కలెక్టర్, పేరు నరోత్తమ్! కానీ అంత పనికిమాలిన మగాణ్ణి నేను చూడలేదు. మా అమ్మ పెట్టిన బాధలన్ని టినీ నోరుమూసుకుని భరించాడు. ఆయన్ని మేం కొంచెం కూడా గౌరవించలే కపోయాం"

రూబీ నోటంట నరోత్తమ్ పేరు విన గానే ముందు అవాక్కయాను. తరువాత అప్రయత్నంగా; 'అంటే నువ్వు స్వప్నవా?' అన్నమాట నా నోటంట వచ్చింది.

ఈ సారి ఉలిక్కిపడడం రూబీ వంత యింది.

పడుకున్నది కాస్తా గబుక్కున లేచి కూర్చుంది. "నీకు స్వప్న ఎలా తెలుసు?" అంది. మరుక్షణం "యూ బాస్టర్డ్! నా గురించి నాకు తెలీకుండా సమాచారం రాబడుతున్నావు కదూ? చంపేస్తాను! ఇక ఒక్క నిమిషం కూడా నీతో ఉండను!" అని గట్టిగట్టిగా అరవడం మొదలెట్టింది.

అసలే జబ్బుపడి ఇప్పుడిప్పుడే కోలుకుం టోంది. నీరసం తగ్గలేదు. ఆవేశంతో ఆమె వణికిపోతోంది. అయినా అలాగే తూలు తూ లేచి తన సామాన్లు సర్దుకోసాగింది. నేను లేచి ఆమెని పట్టుకుని మంచం మీద కూర్చోబెట్టేందుకు ప్రయత్నించాను.

సివంగిలా నా మీదికి దూకి, "ఇంత ద్రోహం చేస్తావా? ఎంత ధైర్యం నీకు? నిన్ను నమ్మాను. నా గతాన్ని గురించి తెలుసుకునేందుకు ప్రయత్నించ వద్దని కొన్ని వందలసార్లు చెప్పాను నీకు.." అంటూ ఆయాసంతో రొప్పుతూ సూట్ కేసు పట్టుకుని బయటికి నడవబోయింది.

నేను గుమ్మానికి అడ్డంగా నిలబడి, "స్వప్నా! నేను చెప్పేది ఒక్కసారి విను!" అని బతిమాలాను.

నేనలా అనగానే తన ఎడమచేత్తో నా చెంప పగలగొట్టింది.

తను అలా చేస్తుందని అనుకోలేదు నేను. అసంకల్పిత ప్రతీకార చర్యలా నా చెయ్యి తన పైకి లేచింది. మరుక్షణం ఆమెని బలవంతంగా నా రెండు చేతులతో ఎత్తి మంచం మీద పడేసి "స్వప్నా! నిజం గానే నీకు అహంకారం, పొగరూ బాగా తలకెక్కాయి. ఎదుటి మనిషి చెప్పేది విని పించుకోవేం? నువ్వు రూబీవి కాదనీ, స్వప్నవనీ నాకు ఈ క్షణం వరకూ తెలీదు. నీ గురించి నేనేమీ రహస్యంగా వాకబు చెయ్యడంలేదు. నువ్వు మీ నాన్న పేరు చెప్పే వరకూ అసలు నువ్వెవరో నాకు తెలీదు. ఉండు! నీకు రుజువు చూపి స్తాను" అని నా అల్మారాలో నుంచి రత్నా, నరోత్తమ్‌లు రాసుకున్న డైరీలను తీసి ఆమెకి ఇచ్చాను.

చాలాసేపు తను ఏమీ మాట్లాడకుండా, ఆ డైరీలని ఒళ్ళో పెట్టుకుని కూర్చుండిపో యింది. చివరికి నెమ్మదిగా "నీకివి ఎక్కడ దొరికాయి?" అని అడిగింది.

నేను అన్ని విషయాలూ వివరంగా చెప్పాను. తను మౌనంగా వింటూ ఉండి పోయింది. తరువాత ముందుగా వాళ్ళ నాన్న డైరీ తెరిచి చదవడం మొదలెట్టింది. టీ చేసి తెచ్చిచ్చాను. కానీ చదవడంలో

మునిగిపోయి టీ కప్పువైపు చూడనేలేదు. నేను కూడా ఆమె ఏకాగ్రతకి భంగం కలిగించడం భావ్యం కాదనుకుని అక్కణ్ణించి తప్పుకున్నాను. రాత్రి పదకొండు గంటలకి డైరీలు చదవడం ప్రారంభించిన రూబీ (ఇప్పుడు స్వప్న అనాలేమో? ) మర్నాడు మధ్యాహ్నం దాకా అలా చదువుతూనే ఉండిపోయింది. రెండు డైరీలూ చదవడం అయిపోయాక వెక్కివెక్కి ఏడవసాగింది. 'నాన్నా.. అమ్మా! ఎందుకిలా మీ జీవితాలని చేజేతులా నాశనం చేసుకున్నారు? నాన్నా! నువ్వన్నదే నిజం. అంతా అయిపోయింది. ఏమనుకునీ ఏం లాభం లేదు!' అంటూ తనలోనే గొణుక్కుంది.

ఆమె మనసులో ఏ అగ్ని పర్వతాలు పగిలాయో? హఠాత్తుగా బాల్కనీ వైపు పరిగెత్తింది. హడలిపోయి నేను ఆమె వెంట పరిగెత్తి తను రైలింగ్ మీద నుంచి కిందికి దూకే లోపల, గట్టిగా ఒడిసి పట్టుకుని, ఆమె గింజుకుంటున్నా లెక్కచెయ్యకుండా గదిలోకి లాక్కొచ్చాను. ఆ పెనుగులాటలో రూబీ తన గోళ్ళతో గీరుతూ, చేతులతో కొడుతూ, తలతో నా భుజాలని కుమ్ముతూ, "నన్ను చచ్చిపోనీ! నేను బతికుండి ఏం లాభం? " అంటూ ఏడుపూ.. వెక్కిళ్ళ మధ్య అరవడం మొదలెట్టింది.

నేను అదేమీ పట్టించుకోకుండా ఆమెని మంచం మీద కూర్చోబెట్టాను. ఒక పెగ్గు విస్కీ గ్లాసులో పోసి అందించాను. మామూలుగా ఎప్పుడూ విస్కీ, బీరూ లాంటివి తను తాగదు. కానీ అప్పుడు మాత్రం పూర్తిగా గ్లాసు ఖాళీ చేసేసింది.

తను కాస్త స్థిమితపడ్డాక నచ్చజెప్పే ధోరణిలో "లాభం ఉంది స్వప్నా! జీవితంలో జరిగే ప్రతి సంఘటన వల్లా మనకి ఏదో ఒక లాభం ఉంటూనే ఉంటుంది. కావాలంటే నువ్వే చూడరాదూ! ఇద్దరు వ్యక్తుల మధ్యగానీ, కుటుంబసభ్యుల మధ్య గానీ మాటలు కరవై పోయి, మౌనం అడ్డుగోడలుగా లేస్తే.. వాటిని పడగొట్టడం వాళ్ళకి కష్టం అనిపిస్తుంది. అదే మూడో మనిషి వాళ్ళతో ఎటువంటి బంధుత్వమూ లేని వ్యక్తి... మధ్యలో కల్పించుకుని, నాణానికి మరోవైపు కూడా ఉంటుందనీ, సమస్యకి మరో కోణం కూడా ఉంటుందనీ చెబితే వాళ్ళు తమ తప్పు తెలుసుకుంటారు.

పాత రోజుల్లో ఉమ్మడి కుటుంబాలలో ఇటువంటి పరిస్థితి ఉండేది కాదు. లోలోపల మథనపడుతూ, అపార్థాలతో కుళ్ళి కుమిలిపోతూ, ఒకరితో ఒకరు మనసు విప్పి మాట్లాడుకోకుండా ఉండడం సాధ్యమయ్యేదే కాదు. తాడుని తెగే దాకా లాగకుండా నివారించేందుకు ఎన్నో మార్గాలుండేవి. తండ్రితో చెప్పుకోలేని విషయాలు తాతయ్యతోనో, పెద్దనాన్నతోనో, చిన్నాన్నతోనో చెప్పుకునేవారు. ఆడ పిల్లలకి కూడా తమ మనసులో మాట చెప్పుకునేందుకు అమ్మమ్మో, పెద్దమ్మో, పిన్నో, వదినో ఎవరో ఒకరుండేవారు. తీరా ఆ విషయం చేరవలసిన వారికి చేరే వేళకి, దానిలోని పదును తగ్గిపోయేది. మధ్యవర్తులు చెప్పవలసిన రీతిలో చెప్పే వాళ్లు. విన్న వాళ్ళు కోపగించినా ముందు ఆ కోపం మధ్యవర్తులనే తాకి తీవ్రతను కోల్పోయేది. కానీ కాలక్రమాన పెద్ద కుటుంబాలు అంతరించిపోయాయి. చిన్న చిన్న కుటుంబాలు చోటు చేసుకున్నాయి. ఈ చిన్న కుటుంబాలలో మధ్యవర్తులు లేరు. మనుషుల మధ్యన లింకులు లేవు. ఏదైనా సరే ముఖాముఖి తేల్చుకోవలసిందే. దాంతో గొడవలు, పోట్లాటలూ.. చివరికి ఆ మనస్పర్థలు పరాకాష్ఠకి చేరుకుని కుటుంబాలు విచ్ఛిన్నమవడానికి దారితీస్తున్నాయి.

పాశ్చాత్య దేశాలు ఇలాంటివి జరగకుండా చూసేందుకు గాడ్ ఫాదర్, గాడ్ మదర్ లాంటి సంబంధాలని సృష్టించాయి. వీళ్ళు పిల్లల తల్లిదండ్రులకి దగ్గర స్నేహితులై ఉంటారు. ఆప్తులై ఉంటారు.

దీనికోసం వాళ్ళు చర్చికి వెళ్ళి ఒక తంతు కూడా జరిపిస్తారు. మన దేశంలో కుటుంబంలోని పెద్దలు చేసే పనే ఈ గాడ్ పేరెంట్స్ చేస్తారు. పిల్లల మనసులోని మాటలని తల్లిదండ్రులకి చేరవేస్తారు. ఈ రోజు అతివేగంగా పరుగులు పెడుతున్న ఈ ప్రపంచంలో ఇలాంటి సంబంధాలు కనుమరుగై పోతున్నాయనుకో" నేను ఒక్క క్షణం ఆగి గుండెల నిండా ఊపిరి పీల్చుకుని, "రూబీ! ఐ మీన్ స్వప్నా! నిన్నొకటి అడగొచ్చా? " అని అన్నాను.

ఏమిటన్నట్టు నా వైపు చూసింది స్వప్న. ఆమె బుగ్గల మీద కన్నీటి చారికలు ఎండిపోయిన గుర్తులు ఉన్నాయి.

సంకోచిస్తూనే "ఈ డైరీలు చదవడం వల్ల ఈ సమస్యని మనం ఆసాంతం అర్థం చేసుకున్నామనే అనుకుంటున్నాను. మనిద్దరం తెలివైన మంచి తల్లిదండ్రులుగా ఉండగలం అనిపిస్తోంది. ఏమంటావు? " అని అడిగాను.

స్వప్న సూటిగా నా కళ్ళలోకి చూసింది సమాధానం ఇవ్వలేదు.

"అవును స్వప్నా! మనం పిల్లల్ని చక్కగా పెంచగలుగుతాం. అంతకు ముందు మంచి భార్యా భర్తలుగా బతకాలి. నన్ను పెళ్ళిచేసుకోవడం నీకిష్టమేనా? " అంటూ రెండు చేతులూ ఆమె వైపు చాపాను.

కొంతసేపు ఎటూ తేల్చుకోలేనట్టు.. అన్యమనస్కంగా ఆలోచిస్తూ ఉండిపోయింది స్వప్న. ఆ తరువాత మంచం దిగి నా దగ్గరికి వచ్చి నా కౌగిట్లో గువ్వలా ఒదిగిపోయింది.

ఇన్నాళ్ళూ జరిగిన ఈ భయంకరమైన సంఘటనలన్నీ 'ఏం లాభం లేదు!' అనే నిరాశావాదం పులుముకున్నవే! కానీ నాకు మాత్రం వాటివల్ల చాలా లాభం కలిగింది. ప్రేమించే అమ్మాయి నాకు భార్యగా లభించింది.

మేం ఎక్కువ హడావిడేమీ చెయ్యకుండా మాకున్న నలుగురు స్నేహితులనీ పిలిచి

## కొత్తగాలి...

**ఆటాడితే అలుపు**
**ఎంత కచ్చితమో**
**పోరాడితే గెలుపు**
**అంత కచ్చితం!**

– బి. గోవిందరాజు,
మన్యంవారి పాలెం, తూ.గో. జిల్లా

మా ఫ్లాట్‌లోనే చిన్న పార్టీ ఏర్పాటు చేసి గాంధర్వ వివాహం లాంటిది చేసుకోబోతున్నామనీ, మ్యారేజి రిజిస్ట్రేషన్ లాంటిదీ, పీటలమీద పెళ్ళి కాకుండా ఇన్నాళ్ళుగా కలిసి ఉంటున్నట్టే ఉంటాం! కానీ మా బంధాన్ని భార్యాభర్తల సంబంధంలాగే కొనసాగించబోతున్నామనీ ప్రకటించాం. గాంధర్వ వివాహంలో వెసులుబాటు ఏమిటంటే, జంటగా బతికినా ఒకరి మీద ఒకరు అధికారం చెలాయించడం, హక్కుల గురించి నిలదీయడం లాంటివి ఉండవు.

ఆ పార్టీ ఇచ్చాక మేమిద్దరం ముంబై నుంచి ఎక్కడికన్నా వెళ్ళి కొన్నాళ్ళు అక్కడ ఉండి వద్దామని అనుకున్నాం. ప్రయాణానికి సామాన్లు సర్దుకోవడం ప్రారంభించాం. అలా సామాన్లు సర్దుతున్నప్పుడు ఎప్పుడో నేను తీసిన మిసెస్ దత్ ఫొటో స్వప్న కంటబడింది.

"ఈమె నీకు తెలుసా? " అని అడిగింది.

"నా చిరకాల స్నేహితుడు శంతను ఇంటి యజమానురాలు" అని చెప్పాను.

వెంటనే నా చెయ్యి పట్టుకుని గుంజి, "ఆవిడ దగ్గరికి తీసుకుని వెళ్ళు" అంది.

నేను వారించే లోపల నన్ను కారు దగ్గరికి బరబరా లాక్కుపోయింది.

"ఉండు! కారు తాళాలు లోపలున్నాయి" అని ఇంట్లోకి వెళ్ళి తాళాలు తీసుకొచ్చాను.

స్వప్న మొహంలో కదులుతున్న భావా లని చూశాక ఆమెని ఏమీ అడగాలనిపిం చలేదు. మారు మాట్లాడకుండా డ్రైవర్ సీట్లో కూర్చుని కారు స్టార్ట్ చేశాను. దత్ బంగళా చేరుకునేసరికి ఇంటిముందు పోలీ సులు, జనమూ గుమిగూడి ఉన్నారు.

స్వప్నని కారులోనే ఉండమని, విషయ మేమిటో కనుక్కొస్తానని గుంపులోకి వెళ్ళి నిల్చున్నాను. పక్కనున్న మనిషిని ఏమైం దని అడిగాను. మిసెస్ దత్ ఇంట్లో పని చేసే డైజీ ఆవిణ్ణి హత్య చేసిందని చెప్పా డతను. మిసెస్‌దత్ ఇంట్లోనే పేయింగ్ గెస్ట్‌గా ఉంటున్న శంతను అనే అతన్ని పోలీసులు విచారిస్తున్నారని కూడా తెలి సింది. కారు దగ్గరికి వెళ్ళి స్వప్నకి ఆ విషయం చెప్పాను.

"మంచిదే! లేకపోతే ఈ హత్య నేను చెయ్యవలసి వచ్చేది!" అంది.

నేను అవాక్కయ్యాను. ఏమీ అర్థం కానట్టు తనకేసి చూస్తూ ఉండిపోయాను.

"ఇంటికి పోదాం!" అంది స్వప్న.

నేను బుద్ధిగా కారుని వెనక్కి మళ్ళిం చాను. స్వప్న మొహంలో కోపం, అసహ్యం, ఆనందం కలగాపులగంగా కని పించాయి నాకు. ఏమీ అర్థం కాలేదు. కా నీ నా కుతూహలాన్ని ఇల్లు చేరేదాకా ఎలాగో ఆపుకున్నాను.

ఇంటికి చేరగానే "నీకు మిసెస్ దత్ తెలుసా? " అని అడిగాను స్వప్నని.

"ఆఁ! ఎందుకు తెలీదు? పేరు మార్చు కున్నంత మాత్రాన మనిషి మారిపోతుం దా? ఆవిడే మా పెద్దమ్మ. అసలు పేరు సురేఖ!" అంది మొహం వికారంగా పెట్టి.

మిసెస్ దత్‌ని మొదటిసారి కలుసుకు న్నప్పుడు ఆమెలో రూబీ (స్వప్న) పోలిక లెందుకు కనిపించాయో ఇప్పుడర్థమైంది.

సురేఖ చేసిన పాడు పనులకి ఆమెకి తగిన ఫలితమే దక్కింది. మర్నాడు వార్తా పత్రికల్లో ఆమె హత్య గురించిన వివరాలు వచ్చాయి. తన యజమానురాలు తనని ఎలా వేధించేదో, ఎన్ని బాధలు పెట్టిందో డైజీ చెప్పుకుంది.

మిసెస్ దత్ ఒక పర్‌వర్ట్, సైకో, వికృ తమైన మనస్తత్వం గల స్త్రీ. కామపిశాచి. భర్త పోయాక కొన్నాళ్ళు అమెరికాలో స్థిర పడ్డ తన కూతుళ్ల దగ్గర ఉండి, మళ్ళీ ఇండియా వచ్చేసింది. తనకి ఉద్యోగం ఇచ్చి ఆవిడతో తను ఇంట్లోనే ఉండేట్టు ఏర్పాటు చేసింది. ఆవిడకి మదపిచ్చి. తన కన్నా వయసులో చిన్నవాళ్ళయిన మగా ళ్ళని వల్లో వేసుకునో, డబ్బు ఆశ చూపో తన కోర్కెలని తీర్చుకునేది. అంతేకాక ధన దాహంతో ఆ మగాళ్ళనీ రకరకాల భంగి మల్లో వీడియోలు తీయించి డైజీతో రహ స్యంగా అమ్మించేది.

ఆవిడ బాధలు భరించలేని స్థితికి చేరు కున్న డైజీ ఉద్యోగం మానేసి వెళ్ళిపోతా నని గొడవపెట్టింది. డైజీ వెళ్ళిపోతే నలు గురికి తను చేసే పనులు తెలిసిపోతాయే మోనన్న భయంతో డైజీని ఎలాగైనా అంతమొందించాలని మిసెస్ దత్ ప్లాన్లు వెయ్యడం ప్రారంభించింది. తాగుడు మైకంలో మిసెస్ దత్ వాగిన వాగుడు వల్ల ఆ సంగతి డైజీకి తెలిసిపోయింది.

తన ప్రాణం రక్షించుకోవడం కోసం అర్థ రాత్రి నిద్రలో ఉండగా డైజీ ఆమెని హత్య చేసింది. శంతను ఆమెకి తోడుదొంగనీ, ఆమె చేసే హీనమైన వ్యాపారంలో పాలు పంచుకునే వాడనీ అంది.

అదృష్టవశాత్తూ డైజీ ఉన్న వీడియో టే పులు శంతను నాకిచ్చి వాటిలో స్పెషల్ ఎఫెక్ట్స్ పెట్టమని అన్నాడు. వార్తాపత్రి కల్లో వివరాలు చదవగానే ఆ టేపులన్ని టినీ తగలపెట్టాను.

స్వప్న ఇక ఒక్క రోజు కూడా ముంబైలో ఉండేందుకు సిద్ధంగా లేనంది నాతో. కానీ నేను చెయ్యాల్సిన ముఖ్యమైన పనులు కొన్ని ఉండిపోయాయి. వాటిని

పూర్తి చెయ్యడానికి నెల రోజులు ముంబై లోనే ఉండిపోవలసి వచ్చింది.

★ ★ ★

*కథ ఇంకా అయిపోలేదు ...*

కథ అంతటితో అయిపోయిందనుకుని ఉంటారు మీరు. కానీ ఏదో ఒకచోట ముగిసిపోతే ఇక అది కథెలా అవుతుంది? గాలిలా కథ ఎప్పుడూ వీస్తూనే ఉంటుంది. నీళ్ళలా ఒకసారి సమతలంగా, మరోసారి పల్లంలోకి ప్రవహిస్తుంది. ఒక్కోసారి మేఘాలుగా మారి ఆకాశంలో తేలుతుంది. జీవితంలాగే కథ కూడా కొన సాగుతూనే ఉంటుంది.

నరోత్తమ్ - రత్నల దాంపత్య జీవితానికి సురేఖ చెదలా పట్టి వాళ్ళ కుటుంబాన్ని నాశనం చేసింది. అక్కడ నుంచి మొదలైన మా ఇద్దరి జీవితం, నేనూ స్వప్నా (రూబీ) కలిసి జీవించడం వరకు కొనసాగింది. ఆ రోజే మేమిద్దరం మా చేతులనే దండలుగా భావించి ఒకరి మెడలో మరొకరువేసుకున్నాం, పాణిగ్రహణం చేసుకున్నాం. ఎప్పుడూ పరుగులు పెట్టే ఈ మహానగరంలో మానవత్వం తాలూకు అవశేషాలు ఏ మురికివాడల్లోనో, రైలు కట్ట పక్కన ఆకాశమే పైకప్పుగా బతికే పేదల జీవితాల్లోనో ఎప్పుడైనా కనిపిస్తే కనిపించవచ్చు. లేకపోతే ఇక్కడ అందరికీ డబ్బు ధ్యాసే, ధన దాహమే.

మానవత్వం గురించి ఆలోచించే తీరికెక్కడిది? యువతీ యువకుల అర్ధనగ్న శరీరాల్లోనూ, మాఫియాల తుపాకీ గొట్టాలలోనూ, చిన్నకారు నేరగాళ్ల చేతికత్తుల్లోనూ ఈ డబ్బే కనిపిస్తుంది.. ఈ డబ్బే మాట్లాడుతుంది.

ఒక నెలరోజులపాటు మేమిద్దరం మా భవిష్యత్తు గురించి ప్రణాళికలు వేసుకుంటూ గడిపాం. ఎక్కడికి వెళ్ళాలి? ఎక్కడ ఉండాలి? ఈ ఊరు మాత్రం వదిలెయ్యాలని ఇద్దరికీ అనిపించింది. ఇక ఇక్కడ ఊపిరాడదేమో అన్నంతగా మానసికంగా అలిసిపోయాం. ముందు చండీగఢ్ వెళ్దామా అనుకున్నాం. రూబీ కూడా అక్కడ కొంతకాలం ఉండివచ్చింది. నేనైతే అక్కడ చాలా ఏళ్ళే గడిపాను.

చండీగఢ్ నగరం అందంగా ఉంటుంది. వాతావరణం కూడా మధ్యరకంగా బావుంటుంది, కానీ ఆ ఊరు చైతన్యం లేని దానిలా మందకొడిగా ఉంటుందని అంది రూబీ. చండీగఢ్ ప్రభుత్వోద్యోగిలా ఒకేరకమైన రొటీన్‌తో ఉంటుందని అంది. ఆఫీసుబల్ల ముందు పనిచేసే అతని మొహాన మానవ సహజమైన హావభావాలు కనిపించవు. అతనేం చేస్తాడు? పొద్దున్నే తొమ్మిది గంటలకి ఆఫీసుకి వెళ్తాడు, లంచ్ టైమ్‌కి ఇంకా ఒక గంటసేపుందనగా తన సీట్లోంచి మాయమైపోతాడు. సాయంకాలం అయిదవగానే ఇంటికి బయలుదేరుతాడు. మళ్ళీ మర్నాడూ.. ఆ మరుసటి రోజూ.. నిరంతరం అదే జీవితం. అలాంటి జీవితం జైలులాగ ఉండదూ? అని అంటుంది రూబీ.

ఢిల్లీ గురించి మాత్రం మా ఇద్దరికీ ఒకటే అభిప్రాయం. ఆ ఊరు మాకు పనికి రాదు. అందుకు మొదటి కారణం అది ముంబై కన్నా అధ్వానమైన మురికివాడ! పైగా పరిపాలనా కేంద్రం కాబట్టి, దేశ రాజధాని కాబట్టి ఆ నగరానికి సాంస్కృతికంగా ఎటువంటి గుర్తింపూ లేకుండా పోయింది. ఇక రెండో కారణం, కొన్ని శతాబ్దాలుగా శత్రువులు ముట్టడించి యుద్ధాలు చెయ్యడంవల్లో ఏమోగాని, ఢిల్లీలో ఉండే వాళ్ళే కాక, ఆ నగరానికి రెండు మూడు కిలోమీటర్ల పరిధిలో ఉండే వాళ్ళు కూడా ఎప్పుడూ ప్రతి చిన్న విషయానికీ కొట్టుకు చస్తూంటారు.

కలకత్తాకి వెళ్ళడం రూబీకి ఇష్టం లేదు. తన పాత అత్తవారిల్లు ఉన్నది అక్కడే. అక్కడి చేదు జ్ఞాపకాలూ ఇంకా ఆమెని

పూర్తిగా వదల్లేదు. పోనీ బెంగళూరుకి వెళ్దామా అనుకున్నాం. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. మనుషులు మంచి సంస్కారవంతులు, అక్కడ స్థిరపడవచ్చనిపించింది. గోవా గురించి కూడా అటువంటి ఆలోచనే వచ్చింది. కానీ మా నిర్ణయం ఇంకా ఒక కొలిక్కి రాలేదు.

ఒకరోజు తెల్లవారగట్లే రూబీ నన్ను హడావిడిగా నిద్ర లేపింది. "పద! లే! మనం వెళ్ళేందుకు సరైన చోటు నాకు దొరికింది!" అంది ఉత్సాహంగా. ఇంకా నిద్రమత్తు నన్ను వదలకపోవటం వల్ల, నేను ఏమీ అనలేకపోయాను. తనేమంటోందో అర్థం అయేందుకే కొంత సయమం పట్టింది.

"లే, మరి!" అంది విసుగ్గా.

"ఏమిటి? ఎందుకు? " అని నోరు వెళ్ళబెట్టాను. "నువ్వు ముందు లే! చెప్తాను!" అంది. నేను లేచి మొహం కడుక్కుని వచ్చేంతలో తను బ్యాగులు తీసి అన్ని సామాన్లూ సర్దేస్తోంది.

"ఎక్కడికి ప్రయాణం? " అన్నాను.

"నాతో రా! నీకే తెలుస్తుంది" అని మళ్ళీ బ్యాగులు సర్దే పనిలో మునిగిపోయింది.

రూబీ ఏదీ వివరంగా చెప్పదని ఈసరికి మీకు కూడా తెలిసిపోయే ఉంటుంది. ఇక నేను ఏం అడిగినా లాభం ఉండదని చెప్పి, నేను కూడా గబగబా తయారైపోయాను. టాక్సీ పిలిచి సామాన్లన్నీ దాన్లో ఎక్కించి రైల్వేస్టేషన్‌కి బయలుదేరాం.

స్టేషన్ చేరుకోగానే రూబీ, "నీకొక మనిషిని పరిచయం చేస్తాను, పద!" అంది.

బుద్ధిగా ఆమె వెనకాలే నడిచాను నేను. స్టేషన్ మెట్ల దగ్గర నిలబడి ఉన్న ఒకతను రూబీని చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చాడు. ఆదివాసిలా ఉన్నాడతను.

"ఇతని పేరు మొహరా. ఆదివాసీల ప్రాంతంలో పుట్టి పెరిగాడు. కలకత్తాలో నేనున్నప్పుడు కొంతకాలం మా ఇంట్లో తోటమాలిగా పనిచేశాడు. అప్పటినుంచీ నాతో టచ్‌లోనే ఉన్నాడు. ఇతని స్వస్థలం జగదల్ పూర్, ఛత్తీస్‌గఢ్‌లోని బస్తర్ జిల్లాలో ఉంది. ఇప్పుడు మనం ఇతని వెంట అక్కడికి వెళ్తున్నాం" అంది.. రూబీ చాలా మామూలుగా!

అయినా ఏదో ఒక విజయగర్వం తొంగి చూసింది ఆమె గొంతులో.

"ఆc? " అని నోరు తెరిచి అలాగే ఉండిపోయాను నేను.

"అంత ఆశ్చర్యపోతావేమిటీ? నగర జీవితం మనని ఎంత కృత్రిమంగా తయారుచేసిందో తెలుసా? మన సమస్యలూ, ఒత్తిళ్ళూ, కొట్లాటలూ.. అన్నిటికీ కారణం అటువంటి కృత్రిమమైన జీవితమే. మనం ఇంక మన మూలాల్లోకి వెళ్ళాలి. ప్రకృతి ఒడిలో ప్రశాంత జీవితం గడుపుదాం. ఈ ఆదివాసులే మనకి ఎలా బతకాలో నేర్పించగలరు. ఈ భూమికి అసలైన వారసులు వీళ్ళే. డబ్బు సంపాదన కోసం పరుగులు పెట్టిపెట్టి, అనవసరమైన ఒత్తిళ్ళకి గురై ఇంతవరకూ బతికింది చాలు. అవన్నీ మర్చిపోయి అసలు బతకడమంటే ఏమిటో తెలుసుకుందాం. నేను మొహరాతో మాట్లాడి అన్ని ఏర్పాట్లూ చేయించాను. మనకి ఎటువంటి ఇబ్బందీ ఉండదు. పరిశుభ్రమైన వాతావరణంలో, ప్రశాంతంగా బతుకుదాం!" అంది రూబీ.

రైలు బయలుదేరింది. నేను ఆలోచిస్తూ కూర్చున్నాను. రూబీ చెప్పే ఈ కొత్త జీవితం ఎలా ఉంటుందో? నాకు ఇంకా కొన్ని అనుమానాలున్నాయి. రూబీతో చర్చించి వాటిని నివారించుకోవాలని ఉంది. కానీ మీకు తెలీందేముంది? రూబీలాంటి వాళ్ళతో చర్చించడం వల్ల ఏం లాభం ఉండదు! ఆమెది ఎప్పుడూ వన్ వే ట్రాఫిక్! అది తెలిసే ఆమెతో నా జీవితాన్ని పంచుకోవాలనుకున్నాను కదా! ఇప్పుడు ఏమనుకుని ఏం లాభం..? ©




ఈశ్వరచంద్ర

# ఈతరం ప్రతినిధి

సరిగ్గా అరగంట తరవాత సంజయ్, సౌమ్య చెప్పిన ఆలయ సమీపానికి చేరుకు న్నాడు.

వేకువజామున గుడిగంటల సవ్వడి వింటుంటే మనసుకి అంత హృద్యంగా ఉంటుందని అతనికి తెలీదు.

చిన్నప్పటినుంచి ఎన్నోసార్లు చెవులతో విన్న ధ్వనే అయినా అది చప్పుడుగానే మిగిలిపోయింది.

కానీ ఈ రోజు మొట్టమొదటిసారి హృద యాన్ని తాకింది ఆ ధ్వని.

గుళ్ళోకి ఇంకా అడుగుపెట్టక ముందే

## కొత్తగాలి...

**ఆశల వల**
**అధిక రాబడి ఎర**
**కుచ్చుటోపీ రెడీ!**

*– శంకర,*
ఆచంట, ప.గో. జిల్లా

పునీతుడిగా మారిపోయినట్లు మనసుకి అనిపించింది.

మనసు అంతే కదా.. ప్రేమని పదిరెట్లు చేస్తుంది, బాధని వెయ్యిరెట్లు చేస్తుంది.

గుడి బయటే పాదరక్షలు వదిలి, పక్కనే ఉన్న పంపు దగ్గర పాదాలు కడుక్కుని నెమ్మదిగా ఆలయ ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు.

నడుస్తూ ముందుకెళ్తున్నకొద్దీ జీవితంలో తను తీసుకోబోయే అతిపెద్ద నిర్ణయానికి పునాది ఇక్కడే పడుతుందేమో అని బలంగా అనిపించింది.

అలా ఉంది ఆ ఆలయ ప్రాంగణం. కాదు కాదు, ఈ రోజు మాత్రమే అలా ఉంది తను ఎన్నో రోజుల నుంచి చూసే ఈ ఆలయ ప్రాంగణం...

సంజయ్ అందరిలాంటి వాడు కాదు. కొద్దిగా డిఫరెంట్. ఎంతైనా ఈ తరం ప్రతినిధి కదా. అందుకే వాడిలానే వాడి భాష కూడా ట్రెండ్‌కి తగ్గట్టు ఉంటుంది. ఆంగ్లాన్ని కలగలుపుకుపోయే కో-ఆపరేటివ్ సమాజం కదా మనది. వాడూ అంతే. ఇప్పుడు సంజయ్ గురించి వాడు 'ఇలాంటోడు' 'అలాంటోడు' అని నేను చెప్పటం కాదు. మీరే చూద్దురు గాని. పదండి వెళ్దాం వాడితో పాటు హోటల్‌కి.

ఒకసారి హోటల్‌కెళ్లాడు. అరగంట కూర్చున్నాడు ఆర్డర్ ఏమీ ఇవ్వకుండా. మొబైల్‌లో వెబ్‌బ్రౌసింగ్.. అదేనండీ 'అంతర్జాలంలో వెతుకులాట' (ఇదేంటి? తెలుగులోకి డబ్ అయిన ఇంగ్లీష్ సినిమా టైటిల్‌లా ఉంది అనుకున్నారా?) చేసుకుంటూ గడిపేశాడు ఈ అరగంట.

వచ్చిన దగ్గరినుంచి సంజయ్‌నే గమనిస్తున్న మేనేజర్ అతని దగ్గరకెళ్లి, "సర్! మీరొచ్చి అరగంట అయింది. ఆర్డర్ ఇవ్వనే లేదు. సో, దయచేసి మీరు ఆర్డర్ ఇస్తే బావుంటుంది. కస్టమర్స్ వెయిటింగ్ బయట" అన్నాడు.

వెంటనే సంజయ్ తన మొబైల్‌లో ఆ హోటల్ గురించి కస్టమర్‌ల రివ్యూస్ చూడటం మొదలెట్టాడు.

చాలామంది కస్టమర్స్ హోటల్ గురించి 'బావుంది', 'చాలా బావుంది' అని పొగుడుతూ రాశారు.

సంజయ్ వెంటనే అక్కడి నుంచి కదిలాడు బయలుదేరుతున్నట్టు.

వెళ్తూ వెళ్తూ మేనేజర్‌తో, "సారీ బాస్! ఏమీ తినకుండానే అరగంట టైంపాస్ చేశాను. మీ హోటల్ గురించి నెట్‌లో అందరూ చాలా బావుంది అని రాశారు. అందరూ ట్రై చేసినవి ట్రై చెయ్యటం పర్సనల్‌గా నాకిష్టంలేదు. అందుకే వెళ్తున్నా. నెవర్‌మైండ్" అనేశాడు.

మేనేజర్‌కి సంజయ్ వైఖరి అంతుబట్టక జుట్టు పీక్కున్నాడు.

ఇంతకీ అసలు విషయం ఏంటంటే..

ఆఫీసు అయిపోయి ఇంటికెళ్తున్న దారిలో మనోడికి ఒక అమ్మాయి కనపడింది, చాలా అందంగా, చాలా ఆకర్షణీయంగా. సిల్లీ ఫెలోలా ఆ అమ్మాయినే ఫాలో అవుతూ ఈ హోటల్‌లోకి ఎంటర్ అయ్యాడు.

ఆ అమ్మాయి నిజంగానే చాలా బావుందండోయ్.

"ఊరించే ఆరెంజ్‌లా. నిగనిగలాడే బెంజ్‌లా"

అమ్మాయిల అందాన్ని పళ్లతో, కార్లతో పోల్చే రోజుల్లో ఈ రెండు వర్ణనలూ సరిగ్గా సరిపోయి ఉండేవి. ఇప్పుడు తరం మారింది. తీరు మారింది. జోడు కూడా మారింది. ఆ అమ్మాయి కూడా ఈ తరం ప్రతినిధే కదా మరి. అందుకే ఆ అమ్మాయి పైన చెప్పినంత అందంగాలేదు. అంతకంటే అందంగా ఉంది.

"కొత్తగా మార్కెట్‌లో రిలీజ్ అయిన ఐ ఫోన్‌లా, అప్పుడే బాగా పాపులర్ అవుతున్న రింగ్‌టోన్‌లా" ఉంది తను.

ఇలా లోలోపలే ఊహించుకుంటూ హోటల్‌లోకి ఎంటర్ అయిన సంజయ్ ఆ అమ్మాయినే ఫాలో అయ్యాడు. ఆ అమ్మాయి బుక్ చేసి ఉంచిన టేబుల్‌కి సరిగ్గా ఎదురు టేబుల్ ఎంచుకుని మరీ కూర్చున్నాడు. అరగంట నుంచి తననే చూస్తున్నాడు.

అంతలోనే ఊడిపడ్డాడు ఎక్కడినుంచో.. ఇంకెవరు? ఆ అమ్మాయి బాయ్‌ఫ్రెండ్.

ఇంతలోనే మనోడూ కిందపడ్డాడు ఎక్కడి నుంచో. ఎంత పైన నుంచి పడ్డాడో మాత్రం తెలీదు. బహుశా ఆ హోటల్ పై అంతస్తు కంటే పైనుంచే అయ్యి ఉంటుంది. ఊహల్లో ఉన్నప్పుడు ఎంతపైకి ఎగురుతున్నామో తెలీకుండానే ఎగిరిపోతాం కదా. కింద పడ్డాకే కదా తెలిసేది మనది ఊహ అన్న స్పృహ.

మొత్తానికి ఆ అమ్మాయి చేసిన మాయకి అరగంట వేస్ట్ అయిపోయిందే అని బాధపడుతూ లేచాడు.

చూడటానికి జంటగా ఆ అమ్మాయి, అబ్బాయీ బానే ఉన్నారు. వాళ్ళిద్దరి చూపులూ నవ్వులూ కలిశాక ఇక అక్కడ తనకేం పని? అనుకున్నాడు మొబైల్‌లో టైం చూసుకుంటూ.

"అరె... అప్పుడే అరగంట అయ్యిందే. అసలే ఈ హోటల్ మేనేజర్‌గాడు ఇందాకటి నుంచి నన్ను అదోలా చూస్తున్నాడు. వీడికేం చెప్పాలి? ఏదో ఒకటి చెబుదాం లే. కమాన్ సంజయ్.. కథలు చెప్పటం నీకు చాలా కామన్. ఏదో ఒకటి ఆలోచించు" అని అనుకుంటూ మేనేజర్‌కి అలా మస్కా కొట్టేసి తప్పించుకున్నాడు. అదీ అసలు విషయం.

అండ్ దటీజ్ సంజయ్.

★ ★ ★

సంజయ్ ఇప్పటికిప్పుడు ఏదో కొత్తగా అలా తయారవ్వలేదు. పుట్టటమే కొత్తగా పుట్టాడు. కొంతమంది అంతే. రొటీన్‌కి భిన్నంగా ఉంటారు. అలాంటి వాళ్లలో తాను ఒకడిని అని అతని ఫీలింగ్. ఈ క్రింది ఇన్సిడెంట్స్ చదివితే మీ ఫీలింగ్ కూడా అదే అవుతుంది.

చిన్నప్పటి నుంచి సంజయ్ అంతే. ఏ పనైనా సరే, కాఫీ తాగటం దగ్గరినుంచి క్రాఫ్ దువ్వుకోవటం దాకా.

తనకి నచ్చితేనే చేస్తాడు. నచ్చకపోతే నిర్మొహమాటంగా వదిలేస్తాడు. వాళ్ళింట్లో అందరికీ కాఫీ అంటే ఇష్టం. ఇష్టం అనటం కంటే ప్రాణం అంటే బెటరేమో. వాళ్లను చూసే కాఫీ మానేశాడు.

స్కూల్‌లో ఫ్రెండ్స్ అందరూ ఇంటర్వెల్‌లో బయట పిప్పరమెంట్లు కొనుక్కొని తింటుంటే సంజయ్ మాత్రం లంచ్‌బాక్స్ ఓపెన్ చేసి గబగబ ముందే తినేసేవాడు.

"అదేంట్రా? " అని క్లాస్‌మేట్స్ అడిగితే,

"ఏం తినకూడదా? లంచ్ టైంలోనే లంచ్ బాక్స్ ఓపెన్ చెయ్యాలా? ఇప్పుడు తింటే తప్పేంటి? " అనేశాడు. వాళ్లకి ఆ వయసులో అలాంటి క్వశ్చన్ వినటమే కొత్తగా అనిపించి బదులు తెలీక ఒకరి మొహాలు ఒకళ్ళు చూసుకుని అక్కడి నుంచి వెళ్లిపోయారు, 'ఎవడి పిచ్చి వాడికానందంలే' అనుకుంటూ.

సంజయ్ గురించి వాడి ఫ్రెండ్స్‌కి గాని, వాడి గర్ల్ ఫ్రెండ్స్‌కి గాని, అసలు అంతెందుకు? వాడ్ని కన్న వాడి పేరెంట్స్‌కి గాని

ఇప్పటికీ ఒక క్లారిటీ లేదు.

ఒకసారి వాళ్ళ నాన్న వాడి దగ్గరకొచ్చి "అసలు జీవితంలో నువ్వేమవుదాం అను కుంటున్నావ్? ఇంత డిఫరెంట్‌గా ఉంటే బయటి ప్రపంచంలో ఇమడటం చాలా కష్టం. నీ మంచి కోసమే చెబుతున్నా. మారు. మార్పే జీవితం" అన్నాడు.

ఒక్క నిమిషం కూడా ఆలోచించకుండా సూటిగా వాళ్ళ నాన్నగారి కళ్ళల్లోకి చూస్తూ సంజయ్ ఇలా బదులిచ్చాడు.

"చూడండి నాన్నా! మార్పు అనేది సహ జమే కానీ మార్పే జీవితం అంటే నేను ఒప్పుకోను. రోజురోజుకీ మనిషి మారి పోతూ వస్తున్నాడు కాబట్టే ఇవ్వాళ ఇన్ని సమస్యలు అతన్ని చుట్టుముట్టి ఉక్కిరిబి క్కిరి చేస్తున్నాయి. అతని మనుగడే ప్రశ్నా ర్థకం అయ్యే పరిస్థితి నెలకొంది. టెక్నాలజీ ఇచ్చిన, ఇస్తున్న కిక్కు కంటే తెచ్చిన టెక్కు ఎక్కువైపోయి మనం అందరం ఎటు పోతున్నామో తెలీకుండా పోతున్నాం. నేను అందరిలా లేను అని సంతోషించడం మానేసి నన్నే మారమని మీరు అడుగుతా రని నేనైతే అస్సలు ఊహించలేదు"

కొడుకు ఎంత సూటిగా చెప్పాడో అంత సూటిగా తలకెక్కేసింది సంజయ్ వాళ్ళ ఫాదర్‌కి.

సంజయ్ మాటలు అంతే. ఏదో ఒక లాజిక్ తీసి మేజిక్ చెయ్యగలడు.

అసలు ఎవరికి ఎంత చెబితే అంత ఎక్కుతాయో అంత చెప్పి తప్పించుకునే రకం సంజయ్.

నాన్నకి షుగర్ కోటెడ్ నీతులు.

అమ్మకు నేతి పూతరేకుల్లాంటి కబుర్లు.

తమ్ముడికి స్పైసీగా నాలుగు జోకులు.

ఫ్రెండ్స్‌కి ఫన్నీగా పైకి కనిపిస్తున్నట్లు అనిపించే సెటైర్లు.

గర్ల్‌ఫ్రెండ్స్‌కేమో వాళ్ల అందాన్ని ఆకాశా నికి ఎత్తేసే పొగడ్తలు.

ఇవన్నీ సంజయ్ కష్టపడి ప్లాన్ చేసిన పకడ్బందీ రచనలు కావు. ఎందుకంటే, సంజయ్ ఎప్పుడూ పనిగట్టుకుని 'వీళ్ళతో ఇలానే మాట్లాడాలి' అని అనుకుని మాట్లాడే టైపు మనిషి కాదు.

ఇన్‌స్టంట్ కాఫీ టైపు. చిన్నప్పటి నుంచి అందరినీ చూసి, నేర్చుకుని, ప్రాక్టికల్‌గా ఆలోచించి, ఎవడికి ఏది చెబితే సరిగ్గా సూట్ అవుతుందో అదే చెప్పి తప్పించుకో గల నేర్పుని ఓర్పుతో నేర్చుకున్నాడు.

అందుకే 'సంజయ్ ఎప్పుడేం ఆలోచి స్తాడు?' అనేది ఎవ్వరూ చెప్పలేరు. ఎవరో ఎందుకు? అసలు సంజయే చెప్ప లేడు. ఎందుకంటే తన ఆలోచనలు అలాంటివి. అవతలి వాళ్లకి అనుగుణంగా మారిపోతుంటాయి.

కప్‌లో ఉన్నా, గ్లాస్‌లో ఉన్నా కాఫీ టేస్ట్ కాఫీదే. కాఫీ అందం కాఫీదే.

ఏమంటే గ్లాస్‌లో తాగేవాడికి సింపు ల్‌గా ఉంటుంది. కప్‌లో తాగేవాడికి స్టైల్‌గా ఉంటుంది.

సంజయ్ కాఫీ లాంటోడు. ఎక్కడున్నా సరే, తనకంటూ ఒక స్థానాన్ని సంపాది స్తాడు. తనకంటూ ఒక ముద్రని అందరి మనసుల్లో చెదిరిపోకుండా ముద్రిస్తాడు. ఎటొచ్చీ కాఫీకి సంజయ్‌కి చిన్న వ్యత్యాస ముంది. అదేనండీ చిన్న తేడా ఉంది. కాఫీ నచ్చేవాళ్లే కాఫీ తాగుతారు. నచ్చని వాళ్లు తాగరు. టీ నచ్చే వాళ్లుంటారు, బూస్ట్ నచ్చేవాళ్ళూ ఉంటారు. ఈ నచ్చని వాళ్ళ కోసం కాఫీ తన రుచిని మార్చు కోదు. కానీ సంజయ్ మార్చుకుంటాడు. సరిగ్గా ఇక్కడే సంజయ్ డిఫరెంట్.

స్ట్రెయిట్‌గా సంకల్పించుకున్న పనిని అంతే స్ట్రెయిట్ ఫార్వర్డ్‌గా (అదే ముక్కు సూటిగా) చేసుకుపోతాడు.

కానీ అంతే స్ట్రెయిట్‌గా తను అనుకు న్నది అనుకున్నట్టు అందరితో చెప్పడు అన్ని సార్లూ. 'మనిషిని బట్టి మాటమార్చే రకం' అనే అనుమానం రానివ్వకుండా

# వేలంటైన్స్ డే ఉత్సవాలు నిషేధం అక్కడ!




కొన్ని కారణాల వల్ల కొన్ని ప్రభుత్వాలు నిషేధించిన వాటి గురించి తెలుసుకుందాం.

*హైహీల్స్:* గ్రీస్‌లోని చాలా చారిత్రాత్మక ప్రదేశాలకి హైహీల్స్‌తో వెళ్ళడం నిషేధం. అతిప్రాచీన కట్టడాలకి వాటి వల్ల హాని కలుగుతుందనే భయం!

*టాయ్‌లెట్:* స్విట్జర్లాండ్‌లో రాత్రి పది తర్వాత అపార్ట్‌మెంట్స్‌లో టాయ్‌లెట్‌ని ఫ్లష్ చేయడం నిషేధించారు. పక్కవాళ్ళకి ఆ శబ్దం ఇబ్బంది కలిగిస్తుందనేదే కారణం.



*వేలంటైన్ డే:* సౌదీ అరేబియాలో వేలంటైన్స్ డే ఉత్సవాలు నిషేధించారు. ఆ రోజు ఎర్ర రంగు వస్తువులని బహుమతులుగా ఇవ్వడం కూడా నిషేధమే.

*హెయిర్‌కట్స్:* ఇరాక్‌లో వెస్టర్న్ స్టయిల్ హెయిర్ కట్స్‌ని ప్రభుత్వం నిషేధించింది. పాశ్చాత్య సంస్కృతి తమ దేశంలోకి రాకూడదని ఈ నిషేధం.

*వేక్యూం క్లీనర్:* అమెరికాలోని కొలరేడో రాష్ట్రంలో వేక్యూం క్లీనర్‌ని ఇరుగు పొరుగిళ్ల నుంచి తీసుకోవడం చట్టవ్యతిరేకం. అందువల్ల ఇంకో వీధిలోని వారి నుంచి తీసుకుంటుంటారు.

*మరణం:* లండన్‌లోని పార్లమెంట్ భవంతిలో మరణించడం నిషేధించారు. అలా మరణించిన వారి కుటుంబ సభ్యులు ఫైన్ కట్టాలి.

*నెపోలియన్:* ఫ్రాన్స్‌లో పందికి నెపోలియన్ పేరు పెట్టడాన్ని నిషేధించారు. అది ఆయన్ని అవమానించడం అవుతుందన్నది కారణం.

*డామినోస్:* అమెరికాలోని అలబామాలో ఆదివారం మధ్యాహ్నం డామినోస్ ఆట ఆడడం నిషేధం. ఆ ఆట సౌకర్యం ఉన్న దుకాణాలన్నీ ఆదివారం మధ్యాహ్నం మూసేస్తారు.

*చూయింగ్‌గమ్:* సింగపూర్‌కి చూయింగ్‌గమ్‌ని వ్యాపారం కోసం తీసుకురావడం నిషేధించారు. పబ్లిక్ ప్లేస్‌లో చూయింగ్‌గమ్‌ని ఉమ్మితే 500 డాలర్లు ఫైన్ కట్టాలి!

*పావురాలకి మేత:* సెయింట్ ఫ్రాన్సిస్ చర్చి ముందున్న పావురాలకి మేత పెట్టడం నిషేధం. ఎందుకంటే అవి ప్రాచీన కళాఖండాలని నాశనం చేస్తాయని.

'మనిషికో మాట గొడ్డుకో దెబ్బ' టైపులో కవర్ చేస్తూ, ఒక్కో మనిషికీ ఒక్కో మాట చెబుతూ మభ్యపెట్టడు గానీ 'తాత్కాలిక మాయ' చేస్తూ ఉంటాడు.

'నేను చాలా తెలివైన వాణ్ని' అనుకుంటూ ఇలా రోజులకు రోజులు గడిపేస్తున్న టైంలో..

సంజయ్ లైఫ్‌లోకి వైఫ్ ఎంటర్ అవ్వాల్సిన టైం రానే వచ్చింది. ఆ అమ్మాయి పేరు సౌమ్య. పేరుకే సౌమ్య కానీ సంజయ్‌కి ఏ మాత్రం తీసిపోదు. ఆలోచనలలో అండ్ యాటిట్యూడ్‌లోనూ. సౌమ్య స్పెషాలిటీ ఏంటంటే.. సారీ. ఒక్కటైతే చెప్పగలం.

ఒకదాన్ని మించి మరొకటి ఉంటుంటే ఎన్నని చెప్తాం? చెప్పండి.

అందుకే "సౌమ్య ఈజ్ ఎ వెరీ స్పెషల్ పర్సన్" అంటుంటారు తన ఫ్రెండ్స్ అండ్ పేరెంట్స్ కూడా.

పైకి సింపుల్‌గా కనపడుతూనే లోలోపల అవతలి వ్యక్తిని అంచనా వెయ్యగల సామర్థ్యం ఆమెకే సొంతం. సింపుల్‌గా ఒక్క ముక్కలో చెప్పాలంటే, 'సౌమ్యను అందుకోవటం.. ఆకాశానికి నిచ్చెన వేసుకొని ఎక్కటం' రెండూ ఒక్కటే.

సంజయ్‌కీ, సౌమ్యకీ ఒకరికొకరు

## కొత్తగాలి...

**అక్షరం**
**అక్షయం!**
**భాషా సౌందర్యం**
**అనంతం!**

– జి.వి.యస్. ప్రియంవద,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

నచ్చారు.. ఫోటోల ద్వారా, ఫేస్‌బుక్ ద్వారా కూడా.

'వాట్సప్' మర్చిపోయావ్ బాసు అనకండి. ఇలా చెప్పుకుంటూ పోతే లిస్టు చాంతాడంత అవుతుంది అని ఈ రెండే చెప్పి వదిలేశాను లెండి.

పెళ్లిచూపుల రోజు రానే వచ్చింది. వీళ్లిద్దరిదీ 'పర్ఫెక్ట్ మ్యాచ్' అని పెద్దలు భావించారు.

పరిచయాలు అయిపోయాయి. అందరికీ అందరూ బానే నచ్చేశారు. ముఖ్యంగా సంజయ్ పేరెంట్స్‌కి సౌమ్య నచ్చింది. సౌమ్య పేరెంట్స్‌కీ సంజయ్ తెగ నచ్చాడు. సౌమ్య ఫ్రెండ్స్‌కైతే మరీ నచ్చాడు.

"టూ స్మార్ట్.. హ్యాండ్సమ్ హంక్" (తెలుగులో దీనికి సరితూగే పదం 'దసరా బుల్లోడు' అయ్యుండొచ్చు) అని ఒక అమ్మాయి.

"స్టైలిష్" అని ఇంకో అమ్మాయి.. ఇలా సంజయ్ గురించి మంచి కామెంట్స్ వినపడటంతో సంజయ్ ఫ్రెండ్స్ కూడా రెచ్చిపోయారు, మేమేం తక్కువా అన్నట్లు.

"పంతులు గారూ! మా వాడి ఫాలోయింగ్ చూసారుగా.. తొందరగా ముహూర్తాలు చూడండి.. లేదంటే ఇక్కడే కాంపిటీషన్ స్టార్ట్ అయ్యేలా ఉంది" అనటంతో అందరూ ఒక్కసారిగా నవ్వేశారు.

ఇద్దరూ విడిగా కాసేపు మాట్లాడుకోవడానికి సమయం కావాలి, సందర్భం రావాలి.

ఏం చెయ్యాలో అర్థం కాక, ఒకరి మొహాలు ఒకళ్ళు చూసుకుంటున్నారు. ఫ్రెండ్స్ చెవుల్లో ఏదేదో చెప్తున్నారు. సౌమ్య, సంజయ్ ఒకేసారి వారి వారి ఫ్రెండ్స్‌కి చెవుల్లో ఏదో చెప్పటం పెద్దలు గమనించారు.

సంజయ్ వాళ్ళ తల్లిదండ్రులూ, సౌమ్య వాళ్ళ అమ్మానాన్నలు జరుగుతున్న తతంగాన్ని అంతా గమనిస్తూ వెంటనే ఇలా అనేశారు.

"మీ ఇబ్బంది మాకు అర్థం అయ్యింది. సౌమ్య.... సంజయ్... మీరు ఇద్దరూ పైకెళ్ళి మాట్లాడుకోండి"

"వాళ్ళని మీరు కాసేపు ఒంటరిగా వదిలెయ్యండర్రా!" అని ఫ్రెండ్స్‌ని ఉద్దేశిస్తూ అన్నారు.

అలా వాళ్లకి పెద్దల నుండి గ్రీన్ సిగ్నల్ దొరకటంతో ఒకర్ని ఒకరు తెలుసుకుందామనే ఆత్రుతతో ఇద్దరూ టెర్రస్ పైకెళ్ళారు.

ముందుగా సంజయ్ స్టార్ట్ చేశాడు.

"హమ్మయ్య! ఇప్పటికి ఒక క్లారిటీ వచ్చిందండి. నేను వచ్చింది పెళ్ళి చూపులకే అని"

"అదేంటి? అలా అనేసారు సడన్‌గా!" అంది సౌమ్య.

సంజయ్, "మరి లేకపోతే ఏంటండి? పెళ్ళి చేసుకునేవాళ్ళు చూసుకునేవి పెళ్లిచూపులు. మధ్యలో ఆ ఫ్రెండ్స్, పేరెంట్స్. గోల గోల. అవసరమా? "

సౌమ్య, "ఫ్రెండ్స్ అండ్ పేరెంట్స్ మన లైఫ్‌లో చాలా ఇంపార్టెంట్ కదండీ"

సంజయ్, "కరెక్టే అనుకోండి. కానీ మన ఇష్టాయిష్టాలు అంటూ కొన్ని ఉంటాయి కదా. చుట్టూ ఇంతమంది ఉంటే వీళ్ళందరి ఆలోచనలూ మనలోకి ఎక్కేసి మన కంటూ ఒక ఆలోచన లేకుండా చేస్తాయి"

అక్షరం

విజయం పొందినవారు
అపజయాలకు భయపడరు
అపజయాల నుంచి విజయం పొందేందుకు
అవసరమైన విషయాలను నేర్చుకుంటారు
– రాబర్ట్ కియోసకి



సౌమ్య, "సో ఇప్పుడేం అంటారు? ఫ్రెండ్స్, పేరెంట్స్ లేకుండా పెళ్లి చూపులు జరగాలి అంటారా? "

సంజయ్, "అంతే కదా మరి. ట్రిప్‌కి ఫ్రెండ్స్‌తో వెళ్తాం. గుడికి పేరెంట్స్‌తో వెళ్తాం. కానీ పెళ్లి అనే జర్నీని లైఫ్ పార్ట్నర్‌తోటే కదా చేస్తాం"

సౌమ్య, "ఇది చాలా ఓల్డ్ ఫిలాసఫీ, షాపింగ్ అనీ, ఔటింగ్ అనీ, డిన్నర్ లనీ, పార్టీలనీ... అబ్బో ప్రతీ చోటికీ ఫ్రెండ్స్ తోటే వెళ్తున్నాం ఈ రోజుల్లో. అలాంటిది లైఫ్‌లో ఇంపార్టెంట్ డెసిషన్ అయిన పెళ్లి అనే విషయంలో వాళ్ళ సజెషన్ తీసుకోవటంలో తప్పేముంది? అని నా ఫీలింగ్"

సంజయ్, "సరిగ్గా ఇక్కడే నేను మీతో ఏకీభవించను. షాపింగ్‌కీ, ఔటింగ్‌కీ, డిన్నర్‌కీ, పార్టీకీ.. క్యాజువల్‌గా వెళ్తాం. కానీ పెళ్లి అలా కాదు, చాలా సీరియస్‌గా చేసుకుంటాం కదా"

సౌమ్య ఒక్క నిమిషం ఆగి, "అబ్బో... అయితే మీరు ప్రతీది చాలా సీరియస్‌గా ఆలోచించే చేస్తారన్నమాట"

సంజయ్, "ప్రతీది కాదు కానీ... నాకు నచ్చిన ప్రతీది"

సౌమ్య, "మరి పేరెంట్స్ ఎందుకు ఉండకూడదు పెళ్ళి చూపుల్లో? "

సంజయ్, "అందచందాలు, జాతకాలు, ఆస్తిపాస్తులు, నడవడికలాంటి పైపై ఫార్మాలిటీస్ చూస్తారే తప్ప అంతకుమించి చూడరు. అఫ్‌కోర్స్ వాళ్ళ పాయింట్ ఆఫ్ వ్యూలో వాళ్ళకు అంతకుమించి చూడాల్సిన అవసరం లేదనుకోండి. అందుకే ఇలా మనం పైకొచ్చి సెపరేట్‌గా మాట్లాడే ఛాన్స్ దొరికినందుకు చాలా హ్యాపీగా ఫీల్ అయ్యా"

సౌమ్య, "సరే, ఇప్పుడు నాతో ఏం మాట్లాడతారు? ఇప్పుడే కదా ఒకళ్ళని ఒకళ్ళం సరిగ్గా చూసుకున్నాం. అప్పుడే మాట్లాడేసుకుంటే బోర్ కొట్టేస్తుంది. ఏమంటారు? "

ఒక్క నిమిషం సంజయ్ షాక్ అయ్యాడు. అయినా సరే సౌమ్య అన్న ఈ మాట చాలా కొత్తగా అనిపించి తెగ నచ్చేసింది. తనని ఇంప్రెస్ చెయ్యటానికి అన్నట్లు,

"సూపర్ అండి. మీరు చెప్పింది 100 శాతం కరెక్ట్. కాసేపు ఒకళ్ళని ఒకళ్ళు చూసేసుకుని కిందికెళ్ళిపోదాం. అది మీకు అభ్యంతరం లేకపోతేనేలెండి"

సౌమ్య, "మీరు మీ ప్రతీ గర్ల్ ఫ్రెండ్‌ని పరిచయం అయిన మొదట్లో 'అండి' అనే పిలిచేవారా అండి? " అంటూ గలగలా నవ్వేసింది.

అలా తను నవ్వుతున్నప్పుడు ఇక తను మాట్లాడదలచుకోలేదు. ఆ నవ్వుని అలానే చూస్తూ ఉండిపోదాం అనిపించింది సంజయ్‌కి. ఎందుకంటే, తను ఏదైనా మాట్లాడాడంటే సౌమ్య నవ్వటం ఆపేసి వింటుంది. అప్పుడు తన నవ్వుని మిస్ అవుతాడు. అందుకే తను మాట్లాడదలచుకోలేదు. ఒక్క సెకండ్‌లోనే ఇన్ని ఆలోచనలు చేసి ఏం మాట్లాడకుండా తన కళ్ళల్లోకి చూస్తూ ఒక చిరునవ్వుతో అలా స్థాణువులా నిలబడిపోయాడు సంజయ్.

సంజయ్ తననే చూడటం గమనించిన సౌమ్య సిగ్గుపడుతూ నవ్వటం ఆపేసింది.

సౌమ్య, "ఓకే మిస్టర్ సంజయ్! మీరు నాకు పూర్తిగా నచ్చాలి అంటే మీతో మూడు రోజులు నేను మాట్లాడాలి. ఈ మూడు రోజుల్లో మీ గురించి నేను ఎంత తెలుసుకోగలిగితే అంత తెలుసుకుంటాను. అది మాటల ద్వారా కావొచ్చు చేతల ద్వారా కావొచ్చు లేదా మీ కంపెనీలో అలా గడిచిపోయే క్షణాల ద్వారా కావొచ్చు. అది మీ మీదే డిపెండ్ అయ్యి ఉంటుంది.

కానీ, మీ విషయంలో నా తుది నిర్ణయం.. అదే ఫైనల్ డెసిషన్ మాత్రం ఆ మూడు రోజుల్లో మీరు నన్ను ఎంత వరకూ ప్రభావితం చెయ్యగలిగారు అనే దానిమీద డిపెండ్ అయ్యి ఉంటుంది"

సంజయ్ ఒక్క నిమిషం ఆగాడు.

లోలోపల ఇలా అనుకుంటూ ఉన్నాడు.

'పెళ్ళికి ముందే నా మీద ఇంత డిపెండ్ అయ్యి ఉంటే, పెళ్ళి అయ్యాక అసలు నాకు ఇండిపెండెన్స్ ఏమైనా మిగిలి ఉంటుందా? '

సౌమ్య, "మీరు ఏం ఆలోచిస్తున్నారో నాకు అర్థమైంది. మీకు నేను టెస్ట్ పెట్టట్లేదు. నాకు నేనే టెస్ట్ పెట్టుకుంటున్నాను. అండ్ మోర్ ఓవర్, ఈ టెస్ట్‌లో మీరు సక్సెస్ అయితే పెళ్ళి అయ్యాక మీ ఇండిపెండెన్స్‌కి ఎలాంటి భంగమూ కలగదు"

సంజయ్, "నాకు మీ టెస్ట్ షరతు బాగా నచ్చింది. మీ ఇంట్లో వాళ్లు కూడా అంగీకరిస్తే రేపటి నుండే మొదలు పెడదాం. ఏమంటారు? "

సంజయ్ అంత తొందరగా అంగీకరిస్తాడని అనుకోలేదు సౌమ్య.

**మొదటి రోజు**

సంజయ్‌ని పొద్దుటి నుంచి ఏమీ తినకుండా సాయంత్రం తన ఫోన్ వచ్చేదాకా వెయిట్ చేయ్యమంది సౌమ్య.

సంజయ్‌కి ఏమీ అర్థం కావటం లేదు. "ఇదేంట్రా బాబు? " అనుకుని తల బాదుకున్నాడు.

ఫ్రెండ్స్‌కి కాల్ చేశాడు. తన బెస్ట్ ఫ్రెండ్ ఒకడికి కాల్ చేశాడు.

సంజయ్, "ఒరేయ్, ఫస్ట్ డే ఫుడ్ కట్. పొద్దుటి నుండి ఏమీ తినకుండా సాయంత్రం తనని కలవమంది. తన ఉద్దేశం ఏమై ఉంటుందంటావ్? "

అజయ్, "ఏముందిరా? ఆఫీసు అయిపోయి బాగా ఆకలి మీద ఇంటికొచ్చినప్పుడు ఇంట్లో తినటానికి ఏమీ లేకపోతే నీ రియాక్షన్ ఎలా ఉంటుందో చూడటానికి ఇదొక శాంపిల్ టెస్ట్"

సంజయ్, "రేయ్ లేదు రా. దీని వెనకాల ఏదో మర్మం ఉంది. నేను ఇప్పుడు బాగా తినేసి వెళ్ళాననుకో, అప్పుడు దాని అర్థం నా ఆకలిని నేను కంట్రోల్ చేసుకోలేను అని. ఏమీ తినకుండా వెళ్ళాననుకో, అప్పుడు దాని అర్థం...."

అజయ్, "తన మొదటి టెస్ట్ అసలు నీకు అర్థం కాలేదని"

సంజయ్, "అలా కాదు. పొద్దుటి నుంచి ఏమీ తినకుండా రమ్మంది అంటే దాని అర్థం సాయంత్రం వరకూ నేను ఏమీ తినకుండా ఉంటాను అనే తన నమ్మకం. సో, ఆ నమ్మకాన్ని మోసం చెయ్యకూడదు రా"

అజయ్, "అబ్బో... బావుంది రా. షార్ట్ ఆన్సర్ రాయరా అంటే షార్ట్ స్టోరీ రాసినట్లుంది. అసలు మనం ఆలోచించినంత కూడా తను ఆలోచించి ఉండకపోవచ్చు జనరల్‌గా అడిగి ఉండొచ్చు నిన్ను టెస్ట్ చెయ్యటానికి. తింటే తిను, లేకపోతే మానెయ్యి"

సంజయ్, "లేదు రా. తను ఎంతో ఆలోచించి ఈ టెస్ట్ పెట్టింది. పచ్చి మంచి నీళ్ళు కూడా ముట్టను"

అజయ్, "రేయ్, ఇది మరీ రా. ప్రేమలో పడ్డాక ప్రేమ గుడ్డిది అనేవాళ్ళని



చూశాను గాని, గుడ్డిగా ప్రేమలో పడతాను అనే వాడ్ని నిన్నే చూస్తున్నా. ఒక రకంగా తను నిన్ను తన వైపుకి లాక్కుంటోంది. ఎమోషన్స్‌తో ఆడుకోవటంలో ఫస్ట్ రోజే బాగా సక్సెస్ అయింది మేడం"

సంజయ్, "సర్లే. నీకు అర్థం కాదులే"

సరిగ్గా సాయంత్రం 7 గంటలకి సౌమ్య నుండి కాల్ వచ్చింది. సంజయ్ వెంటనే ఫోన్ అందుకున్నాడు.

సంజయ్, "హా సౌమ్య చెప్పు. నువ్వు పెట్టిన టెస్ట్‌లో నేను డిస్టింక్షన్‌లో పాస్ అయ్యాను. టెస్ట్ అయిపోయింది, అని డిక్లేర్ చెయ్యి ఇప్పటికైనా"

సౌమ్య, "హహహ.. టెస్ట్ అయిపోవటానికి ఇంకా మరో అరగంట టైం ఉంది బాబూ. సారీ"

సంజయ్, "ఇంకా అరగంటా? సరే నిన్ను ఎక్కడ కలవాలో చెప్పు"

సౌమ్య, "సవ్యసాచి, 7:30 షార్ప్. ఓకేనా? "

సంజయ్, "షూర్ నిరాహార దీక్షలో ఉన్నోడికి నిమ్మకాయ రసం అయినా చెరుకు రసం అయినా ఒకటే. హే.. బైది వే ఈ 'సవ్యసాచి' కొత్తగా కట్టిన ఫ్యామిలీ రెస్టారెంట్ కదా, శుభం కన్వెన్షన్ సెంటర్ దగ్గర"

సౌమ్య, "కరెక్ట్, అదే అక్కడే. వచ్చేయి తొందరగా."

సంజయ్ "నీ కోసం కాకపోయినా ఈ నిరాహార దీక్షను బ్రేక్ చెయ్యటానికైనా

## కొత్తగాలి...

**మంచి**
**కను విను అను**
**చెడు వైపు**
**వికలాంగుడివైపో..!**

– యల్వీఎస్. మూర్తి,
మార్టేరు, ప.గో. జిల్లా

వస్తాను"

సౌమ్య, "రెండూ ఒక్కటే కదా"

సంజయ్, "వాట్? "

సౌమ్య, "ఏం లేదులే.." గలగలా నవ్వుతూ ఫోన్ పెట్టేసింది.

అనుకున్నట్లే ఈ రోజు సాయంత్రం 7:30కి ఇద్దరూ 'సవ్యసాచి' రెస్టారెంట్‌లో కలిసారు.

కడుపునిండా తిన్నారో లేదో తెలీదు కానీ కళ్ళ నిండా ఒకర్నొకరు నింపుకుని రెండు గంటలు మాట్లాడుతూ గడిపారు. .

సంజయ్‌కి తెగ నచ్చిన విషయం ఏంటంటే సౌమ్య కూడా తనలానే పొద్దుటి నుంచి ఏమీ తినకపోవటం.

సౌమ్యకి బాగా నచ్చిన విషయం ఏంటంటే సంజయ్ పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టకుండా తను పెట్టిన టెస్ట్‌లో 'ది బెస్ట్' గా నిలవటం.

సౌమ్య, "నువ్ మరీ టూ మచ్ సంజయ్. నేను నీలా కాదు. ఆకలేసినప్పుడల్లా మంచినీళ్ళు తాగాను"

సంజయ్ "మంచినీళ్ళు కూడా తాగకుండా రెస్టారెంట్‌కొస్తే నువ్వు ట్రీట్ అదిరిపోయేలా ఇస్తావనే అంచనాతో కావాలనే అలా చేశా"

సౌమ్య, "ఛా... మరి ఎందుకు ఇప్పుడేం తినట్లేదు సరిగ్గా? "

సంజయ్. "అదీ..."

సౌమ్య, "తినాలని అనిపించట్లేదు కదా. మన కోసం ఒకరు తినకుండా వెయిట్ చేస్తున్నారు అనే ఫీలింగ్‌తోటే ఆకలి తీరిపోయింది కదా"

సంజయ్, "నువ్వు చెప్పింది నిజమే. ఎప్పుడో చిన్నప్పుడు ఎగ్జామ్స్ అప్పుడు అనుకుంటా. నేను డిస్టింక్షన్‌లో పాస్ అవ్వాలని చెప్పి అమ్మ నా కోసం దేవుడికి ఏదో మొక్కుకుంది. రాత్రంతా తినలేదు. కేవలం నా కోసం. ఫస్ట్ టైం అప్పుడు భయం వేసింది. ఈ 'నా కోసం' అనే ఫీలింగ్‌లో ఉన్న బరువు, బాధ్యతను చూసి. ఇన్ని రోజుల తరవాత మళ్ళీ ఇప్పుడే. ఇదిగో ఇలా నీ వల్ల"

సౌమ్య సంజయ్‌ని అలా చూస్తూ ఉండిపోయింది. సంజయ్ సౌమ్యనే చూస్తూ ఉన్నాడు.

ఇద్దరికీ ఇద్దరి మాటలూ నచ్చాయి. మొదటి రోజు. మొదటి సారి. మనసారా కలిశారని అనిపించింది ఇద్దరికీ. ఆ రెస్టారెంట్‌లో ఆ ఫుడ్ తింటూ, ఇళయరాజా మ్యూజిక్ వింటూ, భవిష్యత్తు గురించి కలలు కంటూ, ఆ క్షణంలోనే ఉండిపోవాలనిపించింది ఇద్దరికీ.

ఏమో ఎవరికి తెలుసు? మరుక్షణం ఏమవుతుందో?

అందుకే జీవితంలో అరుదుగా దొరికే ఇలాంటి క్షణాలని రికార్డు చేసుకుని కళ్ళలో పెట్టేసుకున్నారు ఇద్దరూ.

రెండో రోజు సౌమ్య ఇంకెన్ని కొత్త పరీక్షలు పెడుతుందో అని సంజయ్ ఊహిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

*రెండో రోజు*

సరిగ్గా తెల్లవారుజామున 4:30 నిమిషాలకి సౌమ్య సంజయ్‌కి కాల్ చేసి దగ్గరలో ఉన్న అమ్మవారి గుడికి అరగంటలో రమ్మంది.

ఈ రోజు ఏం చెయ్యాలో అక్కడికొచ్చాక చెబుతాను అని చెప్పి ఫోన్ పెట్టేసింది

సౌమ్య. సంజయ్ ఒక్క నిమిషం కూడా టైం వేస్ట్ చెయ్యకుండా తలంటుకుని కొత్త బట్టలు వేసుకుని తయారవుతుండగా..

సంజయ్ వాళ్ళ నాన్న, "ఏం అయింది రా ఇవాళ నీకు ? మామూలుగా అయితే 'పండగ రోజు అయినా పదింటికే.. పుట్టిన రోజు అయినా పదింటికే' టైపులో నిద్ర పోయే నువ్వేనా ఇవ్వాళ తెల్లారగానే స్కూల్ పిల్లాడిలా అంత నీట్‌గా రెడీ అయిపోయి బయలుదేరుతున్నావు. ఏంటి సంగతి? " సంజయ్ వాళ్ళ అమ్మ వెంటనే అందుకుని, "ఊరుకోండి. వాడిని ఏదో ఒకటి అననిదే మీకు నిద్ర పట్టదే"

సంజయ్ వాళ్ళ నాన్న, "వీడిని ఇలా చూశాక ఇవ్వాళ నాకు నిజంగానే నిద్రప ట్టదు మరి"

సంజయ్, "నాన్నా! సౌమ్య పిలిచింది. వెళ్తున్నాను. వెళ్ళకపోతే మనకే చెడ్డ పేరు వస్తుంది. అబ్బాయిని డిసిప్లిన్ లేకుండా పెంచారని అనుకుంటారు అమ్మాయి తరపు వాళ్ళు"

సంజయ్ వాళ్ళ నాన్న, "వాళ్ళు ఏమను కుంటారో తెలీదు కానీ.. నువ్వు మాత్రం చాలానే అనేసుకుంటున్నావ్. నువ్వు ఇంత డిసిప్లిన్‌గా తయారువుతావ్ అని తెలి సుంటే నీకు ముందే పెళ్లి చేసుండేవాడ్ని"

సంజయ్, "పెళ్లి అనేది బాగు పడటానికి చేసుకునేది కాదు. బాగు పడ్డాక చేసుకు నేది. పెళ్ళి కోసం మారే వాళ్ళుంటారు కానీ.. మారటం కోసం పెళ్ళి చేసుకునే వాళ్ళు ఉండరు.."

సంజయ్ వాళ్ళ నాన్న, "వామ్మో! నీ కొడుకు చాలా పెద్దోడు అయిపోయాడే. మనోడు అందనంత ఎత్తుకి ఎదిగాడను కున్నా, అర్థం కానంత లోతుకి కూడా ఎది గిపోయాడు"

సరిగ్గా అరగంట తరవాత సంజయ్ సౌమ్య చెప్పిన ఆలయ సమీపానికి చేరుకు న్నాడు. వేకువజామున గుడిగంటల సవ్వడి వింటుంటే మనసుకి అంత హృద్యంగా ఉంటుందని అతనికి తెలీదు. కానీ ఈ రోజు మొట్ట మొదటిసారి హృద యాన్ని తాకింది ఆ ధ్వని.

సౌమ్యని చూశాడు. ఈ గుడి తను కట్టుంటే దేవతగా సౌమ్య విగ్రహాన్నే ప్రతి ష్ఠించి ఉండే వాడినేమో అనే ఆలోచన తొంగి చూసింది సంజయ్ కళ్ళల్లోంచి. మొట్టమొదటిసారి అందం చూసి ఆనందం వేసింది సంజయ్‌కి. మనిషికి జీవితంలో ఇలాంటి ఒక్క ఘడియ దొరి కినా చాలు. ఆ ఆనందమే వేరు. తనని సమీపిస్తున్నకొద్దీ గుళ్ళో గంటలు తదనుగు ణంగా మోగుతున్నాయేమో అనే సంభ్ర మాశ్చర్యాన్ని కలిగించింది.

సంజయ్, సౌమ్య ఇద్దరూ గుడి చుట్టూ ప్రదక్షిణ చేసి ఆ తర్వాత స్పెషల్ పూజలో పాల్గొని అరగంట గడిచాక తలపై అక్షింతలతో, చేతిలో ప్రసాదంతో చూడ ముచ్చటైన జంటగా బయటికి అడు గులు వేస్తూ కదిలారు. బయట ఆలయ కళ్యాణ మండపంలో ఉన్న కుర్చీల్లో ఇద్దరూ ఆసీనులయి అలా ఆకాశంలోకి చూస్తున్నారు. అప్పటికి సమయం 6 గంటలా 30 నిమిషాలు అయింది. సూర్యుడు తేజోవంతుడై వెలిగిపోతు న్నాడు. అతని కిరణాలు కొద్దిసేపటి వరకూ తీక్షణంగా సంజయ్ సౌమ్యల

## కొత్తగాలి...

**వాడి జీతం**
**లక్ష!**
**అమ్మానాన్నల**
**భిక్ష!**

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

మీద ప్రకాశించాయి. అందువల్ల వాళ్ళు కూర్చున్న ఆ ప్రదేశం మొత్తం బంగారు వర్ణంలో వెలిగిపోతోంది. చూడటానికి చాలా కొత్తగా కనిపించింది ఆ దృశ్యం.

కొద్దిసేపటి వరకూ ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకున్నారు. ఏమీ మాట్లాడుకో లేదు. సౌమ్యకు మాటలు రావట్లేదు. సంజయ్‌కి మాట్లాడాలి అనిపించట్లేదు. మాటలే లేని ఇలాంటి రోజు ఇంత బావుం టుందా అనిపించింది ఇద్దరికీ. సౌమ్య వెంటనే తన చేతిలో ఉన్న కాగితం సంజ య్‌కి ఇచ్చేసి తన దారిన తాను నడుచు కుంటూ వెళ్ళిపోయింది.

'డియర్ సంజయ్,

రెండో రోజు మీకు ఎలాంటి టెస్టు లేదు. ఈ కాగితం మీ చేతిలో ఉంది అంటే రెండో రోజు మీకు పెట్టిన టెస్ట్‌లో మీరు పాస్ అయినట్టే లెక్క. అది ఎలా అని నన్ను అడిగితే నేను మీకేమీ చెప్ప లేను. ఎందుకంటే అది నా లెక్క కాబట్టి. ఇకపోతే ఏ మాత్రం సస్పెన్స్ లేకుండా మూడో రోజు మీకు పెట్టే టెస్ట్ గురించి కొద్దిగా చెప్తున్నాను. జాగ్రత్తగా వినండి..

భావము లేని రోజు భాషలోని పాండిత్యం కనపడదు.

భావము ఉన్న రోజు భాషలోని పామ రము వినపడదు.

కృష్ణశాస్త్రి కవిత్వం భావకవితకు పరాకా ష్ఠగా నిలబడింది. అందుకు చిన్న ఉదాహ రణ ఈ కింది కవిత.

ఒదిగిన మనసున పొదిగిన భావము
కదిపే దెవ్వరో! కదిపే దెవ్వరో!
కదలని తీగకు తరగిన రాగము
కరపే దెవ్వరో! కరపే దెవ్వరో!
కదిపే దెవ్వరో ! కరపే దెవ్వరో!
కరగని మనసును కదలని తీగకు?

అందుకే సంజయ్ నాకు జీవితంలో అన్నింటికంటే ఇంపార్టెంట్ "భావం" మీరు భావుకులో కాదో నాకు తెలీదు. మీరు వేటూరి పాటలు వింటారో, సినారే గేయాలు వింటారో నాకు తెలీదు.

ఇప్పుడు నేను చెప్పాను కదా అని చెప్పి ఇప్పటికిప్పుడు మీకు పరిచయం లేని పేర్లని వెతక్కండి. మీరు వినని పాటలనీ వినకండి. నేను ఈజీగా కనిపెట్టేస్తాను. అలా చేస్తే మాత్రం మీరు మూడో రోజు ఈజీగా ఓడిపోతారు.

భాష ఏదైనా సరే మీకు నచ్చిన భావాల్లో మీకు నచ్చిన, మీరు మెచ్చిన వ్యక్తుల పుస్తకాలు కానీ, రాసిన కొన్ని వాక్యాలు కానీ రెడీ చేసుకుని ఆఖరి రోజు ఐన రేపు సాయంత్రం *6 : 30*కి ల్యాండ్ మార్క్ లోని 'ప్రదీప' బుక్‌స్టోర్‌కి వచ్చే యండి. అక్కడ చాలా మంచి పుస్తకాలు ఉంటాయి. ఎందుకంటే అక్కడ చాలా మంచి భావాలు ఉంటాయి కాబట్టి.

మీకు ఇదంతా బోర్ కొట్టిస్తుంది అను కుంటే రావటం స్కిప్ చేసే ఆప్షన్ కూడా మీ చేతిలోనే ఉంది. ఛాయిస్ ఈజ్ యువర్స్.

ఏదైనా సరే మనసారా చెయ్యండి. అప్పుడు మీరు ఓడిపోయినా నా దృష్టిలో గెలిచినట్లే లెక్క. అంతే కానీ, ఈ అమ్మాయి మీద ఎలాగైనా గెలుద్దాం అనో, మూడో రోజు గెలవాలనే తాపత్రయం తోనో మీది కాని మనస్తత్వాన్ని, మీది కాని భావాన్ని ఒక్క రోజైనా సరే నా కోసం మోయకండి. భావాలు మనకు బరువు అనిపించకూడదు. భావాలకే మన బరువు తెలియాలి. అప్పుడే మనకూ, మన భావా లకూ విలువుంటుంది.

ఇట్లు
మీ
సౌమ్య

ఈ లెటర్ చదివాక సంజయ్‌కి సౌమ్య మీద గౌరవం పెరిగింది. ఇన్‌ఫాక్ట్, ఇంకా రెట్టింపు అయ్యింది అని చెప్పొచ్చు. పరిగె త్తుకుంటూ ఇంటికెళ్ళాడు. ఉన్న పుస్తకా



లన్నీ అటూ ఇటూ చూశాడు. తిరగేశాడు. సంజయ్ వాళ్ళ అమ్మానాన్నలకి ఏమీ అర్థం కావట్లేది.

సంజయ్ వాళ్ళ అమ్మ, "రేయ్..! ఏమయిందిరా? దర్శనం బాగా జరిగిందా? ఈ రోజు సౌమ్య పెట్టిన టెస్ట్‌లో పాస్ అయ్యావా మరి? ఏం మాట్లాడకుండా పుస్తకాలు తిరగేస్తావేంట్రా? "

సంజయ్, "అమ్మా, ఇవ్వాళ టెస్ట్ సక్సెస్. రేపటి టెస్ట్ కోసమే ఇదంతా. ఈ లెటర్ చదువు నీకే అర్థమవుతుంది"

సంజయ్ వాళ్ళ నాన్న, "నీ పర్సనల్ లెటర్ మేం చదవం. ఆ పిల్ల ఏమందో చూచాయగా నువ్వే చెప్పరా"

సంజయ్, "రేపు కవి సమ్మేళనం. నా భావుకతని టెస్ట్ చేస్తోంది అమ్మా. అదీ సంగతి. దాని కోసమే ఈ హడావిడి"

సంజయ్ వాళ్ళ నాన్న, "పుస్తకాలు తిరగేసే వాడిని విద్యార్థి అంటారు. పుస్తకాలు రాసేవాడినే కవి అంటారు. ఏమేవ్! కవి సమ్మేళనం అట. విన్నావా? "

సంజయ్, "డైలాగ్‌లు కొట్టేవాడినే నాన్న అంటారు. మీరేమంటారు? "

సంజయ్ వాళ్ళ అమ్మ, "మీ గోల ఆపండి ఇక.. అని నేను అంటాను. చూడు సంజయ్! ఆ అమ్మాయి చాలా తెలివైంది. చాలా సున్నితంగా ఉండేవాళ్ళు చాలా తెలివిగా ఆలోచిస్తారు. తను నీకు ఎలాంటి టెస్టూ పెట్టట్లేదు. నీ గురించి తెలుసుకోవాలని అనుకుంటోంది. సో, బి సిన్సియర్. ఆల్ ది బెస్ట్"

**మూడోరోజు**

రెండు రోజులు ఎలా గడిచిపోయాయో

సంజయ్‌కి తెలీలేదు కానీ, ఈ మూడో రోజు ఎలా గడుస్తుందో అనే భయంతో గడుస్తున్న ఈ గంటలు మాత్రం సంజయ్‌కి ఎప్పటికీ గుర్తుండిపోతాయి. సౌమ్య తెలివితేటల కంటే తన మీద తనకున్న క్లారిటీ నచ్చింది సంజయ్‌కి. జీవిత భాగస్వామి నుండి తను ఆశిస్తున్నది కూడా అదేనని చెప్పకనే చెప్పింది ఆ లెటర్ ద్వారా.. అందుకే కాబోలు సౌమ్య అంత క్లియర్‌గా రాసిన లెటర్‌ని సంజయ్ మళ్ళీ మళ్ళీ చదివాడు. జీవితంలో అన్నింటికంటే కష్టమైనది క్లిష్టమైనది ఏదైనా ఉంది అంటే అది 'నువ్వే'. అంటే అది మనమే అని అర్థం. మనకి ఏం కావాలో మనకి ఎప్పటికీ తెలీదు. చిన్నప్పుడు చాక్లెట్ కావాలని గొడవ చేసే పిల్లాడు, కాస్త పెద్దయ్యాక సైకిల్ కావాలని, ఇంకాస్త పెద్దయ్యాక బైక్ కావాలనీ ఇంట్లో వాళ్ళతో చిన్న సైజు యుద్ధం చేసయినా సరే తను కోరినవన్నీ చేకూర్చుకుంటాడు. ఇదంత పెద్ద విషయంగా ఇంట్లోవాళ్ళు చూడరు. సర్లే పిల్లాడు ఆశపడుతున్నాడు, పిల్లాడు ముచ్చటపడుతున్నాడు అనుకుంటారు. అడిగిన ప్రతిదీ ఇస్తూ పోతే దాని విలువ తెలీదు మనిషికి. రాళ్ళు కొట్టుకుని నిప్పు చేసే మనిషి ఇవ్వాళ ఇంత టెక్నాలజీని ఎలా కనిపెట్టగలిగాడు? మనిషి అడిగిన ప్రతీది దేవుడు ఇచ్చుంటే అసలు ఇన్ని రోజులు మనం అందరం భూమ్మీద బతికి ఉండేవాళ్ళమే కాదు.

దేవుడు ఇచ్చిన బుద్ధిని మనిషి వాడుకున్నాడు కాబట్టే ఇవ్వాళ టెక్నాలజీలో ఇన్ని విప్లవాలు సాధ్యపడ్డాయి. మనిషి తన అవసరాలను అర్థం చేసుకుని తన బలాబలాలను అవగాహన చేసుకున్నాడు కాబట్టే మనకు ఇన్ని సౌకర్యాలు చేకూరాయి.

నిన్ను నువ్వు అర్థం చేసుకోవటం కష్టం. నీకు నువ్వు అర్థం కావటం అనేది అత్యంత క్లిష్టం.

అందుకే జీవితంలో అన్నింటికంటే కష్టమైనదీ క్లిష్టమైదీ ఏదయినా ఉందీ అంటే అది 'నువ్వే'.

అన్నిసార్లు ఆ లెటర్ చదివాక సంజయ్‌కి అర్థం కావాల్సిన విషయం ఏంటో, అర్థం చేసుకోవాల్సిన విషయం ఏంటో కూడా అర్థం అయిపోయింది.

సౌమ్య కావాలని తను ఆశపడుతున్నాడా? సౌమ్యని తను ప్రేమిస్తున్నాడా? సౌమ్యని తను ఆరాధిస్తున్నాడా? అంతకంటే ముందు అసలు సౌమ్యనే తన జీవితానికి 'పర్ఫెక్ట్ మ్యాచ్' అని తనని ఎలా ఒప్పించాలి? అంతకంటే ముందు అసలు సౌమ్యనే తన లైఫ్ పార్ట్‌నర్‌గా ఎందుకు రావాలి?

ఇలాంటి ప్రశ్నలకి తన దగ్గర జవాబులు ఉన్నాయా?

ఈ అన్ని ప్రశ్నలకి సంజయ్ బదులివ్వగలిగేలా ఉండాలి. సౌమ్య కోసం కాదు. తన కోసం. మరోపక్క సాయంత్రం 6 : 30 నిమిషాలకి సంజయ్ ఏం చేస్తాడో, ఏం చెప్తాడో అని అంతే ఆర్తితో ఎదురు చూస్తోంది సౌమ్య.

అనుకున్నట్లే ఇద్దరూ కలిశారు.

అనుకున్న చోటే.

అనుకున్న టైం కే.

సంజయ్, "మీ లెటర్ చదివాను. మీకున్న గొప్ప భావుకత నాకు లేదు. ఇన్‌ఫాక్ట్, మీరు రాసిన ఆ కృష్ణశాస్త్రి గారి కవితలో చాలా పదాలు నాకు అర్థం కాలేదు. కానీ అవన్నీ గొప్ప భావాలని మాత్రం తెలుసు. వాటిని ఆస్వాదించాలని అందరిలానే నాకూ ఉంటుంది. కానీ నా అభిరుచులు వేరు. నాకు కృష్ణశాస్త్రి గారు ఎవరో తెలీదు. నేను చిన్నప్పటి నుంచి విన్నవి సినిమా పాటలు. సిరివెన్నెల సీతారామశాస్త్రిగారి రచన అంత బావుంటుందని పెద్దయ్యేవరకూ తెలీదు. తెలిసినప్పటి నుంచి మాత్రం లిరిక్స్ చదువుతూ పాటలు

అక్షరం

*దూరానికి ఆనందంగానూ*
*దగ్గరికి విషాదంగానూ*
*కనిపించేది జీవితం*

– చార్లీ చాప్లిన్



వింటున్నా. తెలీని విషయాన్ని నిర్మొహమాటంగా నాకు తెలీదు అని ఒప్పుకోవాలి అనే విషయం నాకు అర్థం అయ్యేలా, నాకు తెలిసొచ్చేలా చేసినందుకు మీకు థాంక్స్ చెప్పుకోవాలి.

మీ లెటర్ చదివాక నాకు అర్థం అయింది ఇదే"

నవ్వు ఆపుకుంటూ సౌమ్య ఇలా అన్నది, "అమ్మో! నాన్‌స్టాప్‌గా భలే చెప్పారండీ. నా లెటర్‌ని చాలా సీరియస్‌గా తీసుకుని ఈ స్పీచ్ ప్రిపేర్ చేసినట్టున్నారు. వెరీ గుడ్. మీకో విషయం తెల్సా? నాకు కూడా కృష్ణశాస్త్రి గారు ఎవరో తెలీదు. ఈ మధ్యనే తెలిసింది. ఏదో ఇంటర్వ్యూలో ఎవరో డైరెక్టర్ కృష్ణశాస్త్రి గారు రాసిన లైన్ ఒకటి చెప్పారు. అది చాలా నచ్చింది. అప్పుడు మా ఫ్రెండ్‌కి చెప్పి ఆయన బుక్ ఒకటి ఆర్డర్ చేయించాను. లెటర్‌లో రాసిన కవిత ఆ పుస్తకంలోనిదే"

కాసేపు ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకుంటూ సైలెంట్‌గా గడిపారు.

రెండు నిమిషాల పాటూ నిశ్శబ్దం రాజ్యం ఏలింది.

సంజయ్, "యు నో వాట్? సౌమ్య.. ఐ థింక్.. నువ్వు నాకు కరెక్ట్. ఎందుకంటే, నన్ను ప్రతీక్షణం ఆలోచింపజేసే నీలాంటి అమ్మాయి నాకు భార్యగా రావాలి"

సౌమ్య, "నాకు ఈ విషయం మొదటి రోజే అర్థం అయిపోయింది మిస్టర్ సంజయ్. కానీ మూడోరోజు నువ్వేం చేస్తావా అని చాలా భయపడ్డాను. థాంక్ గాడ్! నా లెక్క తప్పు పోలేదు. నా అంచనా రాంగ్ అవ్వలేదు"

సంజయ్, "సరే మంచి బుక్ కొందాం. రా"

సౌమ్య, "నాకు పౌలో కోయెల్హో బుక్స్ ఇష్టం"

సంజయ్, "హే నాకు కూడా తన బుక్స్ అంటే ఇష్టం"

సౌమ్య, "ఎందుకు? "

సంజయ్, "నాకు అతని మాటలు ఒక ఫ్రెండ్, ఒక ఫిలాసఫర్ అండ్ ఒక గైడ్‌లా అనిపిస్తాయి. ఒక రైటర్ మాట్లాడుతున్నట్లు అస్సలు అనిపించదు"

సౌమ్య, "మరి తెలుగులో ఎవరు ఇష్టం? "

సంజయ్, "ఇంకెవరు? శ్రీశ్రీ గారు"

సౌమ్య, "హే.. నాకు కూడా శ్రీశ్రీ గారంటే చాలా ఇష్టం"

సంజయ్, "సౌమ్య, నేను ఒకటి గమనించాను. నువ్వు నన్ను 'మిస్టర్ సంజయ్' అంటున్నప్పుడు భలే ఉంటావ్ తెల్సా? "

సౌమ్య, "అచ్చా! వాట్ డూ యు మీన్ మిస్టర్ సంజయ్? అంటే అప్పుడు ఒక్కసారే బావుంటానా? "

సంజయ్, "మీ అమ్మాయిలతో మాట్లాడేటప్పుడు ఇదే ప్రాబ్లం. తెలివిగా మాట్లాడాలి. తెలివిగా పొగడాలి"

సౌమ్య, "సంజయ్! నాకంటే ముందు నీకు ఎంతమంది గర్ల్ ఫ్రెండ్స్ ఉన్నారు? "

సంజయ్, "అయిపోయాను రా బాబోయ్!.."

©



# ఇద్దరూ ఇద్దరే

- శేష చంద్ర

రాయలసీమ ఎక్స్‌ప్రెస్ ఐదు నిమిషాల్లో వస్తుందని అనౌన్స్ చేశారు. ప్లాట్‌ఫామ్ మీద రద్దీ ఏమీ లేదు, పది పదహైదు మంది తప్ప. ఓ ఎర్రటిచొక్కా శాల్తీ చమటలు కక్కుతూ పరుగుపరుగున ప్లాట్‌ఫామ్ మీదికి వచ్చాడు ఆదుర్దాగా, చంకలో లెదర్ బ్యాగ్‌తో. ఓ చేతితో మొబైల్ చెవి దగ్గర పెట్టుకొని వచ్చీ రాగానే ఎదురుగా కనపడ్డ ఓ తెల్ల చొక్కావాడ్ని అడిగాడు.. "రాయలసీమ ఇంకా రాలేదు కదూ మాస్టర్? " అంటూ.

నల్లప్యాంట్‌పై తెల్లచొక్కా టక్ చేసుకొని విలాసంగా సిగరెట్టు తాగుతూ లేటెస్ట్ 'ఐ' ఫోన్‌లో మాట్లాడుతున్నవాడల్లా, ఎర్రచొక్కావాడి మాటలకు "లేదు మాస్టర్, ఓ ఐదు నిమిషాల్లో వస్తుందని అనౌన్స్ చేశారు. ట్రైన్‌కు ఏమీకాకపోతే" అని తన జోక్‌కు తానే నవ్వుకున్నాడు.

వాడి జోక్‌కు ఎర్రచొక్కావాడూ ఓ నవ్వు విసిరేసి "అవును. ట్రైన్ ఎక్కడ మిస్ అవుతుందోనని కంగారు పడ్డాను మామా. బై గాడ్ సేక్ ట్రైన్ రాక ముందు స్టేషన్‌కు రాగలిగా" అని తెల్ల చొక్కావాడితో చెప్పి "నీవడిగిన మూడు లక్షలతోనే బయలుదేరాను మామా. దానికే లేట్ అయ్యింది. మాట ఇస్తే తప్పనులే. నీకు కష్టం వస్తే ఆ మాత్రం సహాయం చేయలేనా? మూడు గంటల్లో నీ దగ్గరుంటా ఓకేనా" అంటూ మొబైల్‌లో ఎవరితోనో మాట్లాడసాగాడు.

వాడి మాటలను ఆసక్తిగా వింటూ వాడ్ని పరిశీలనగా చూడసాగాడు తెల్లచొక్కావాడు.

ఎర్రచొక్కావాడు మొబైల్‌ను ఆ చెవినుండి ఈ చెవికి మార్చుకొంటూ మాట్లాడుతూనే, దాంతోపాటు చంకలోని లెదర్ బ్యాగును కూడా ఆ చంకనుంచి ఈ చంకకు మార్చుకొంటున్నాడు చాలా జాగ్రత్తగా. లెదర్ బ్యాగ్‌లో స్పష్టంగా కన్పిస్తున్న నోట్ల కట్టలను చూస్తుంటే తెల్లచొక్కా శాల్తీ కళ్లు మెరిసిపోసాగాయి, జింక పిల్ల కనపడగానే వేటగాడి కళ్లు మెరిసినట్లు. దాన్ని స్వంతం చేసుకొంటే కొంతకాలం పండగే పండగ అని తెల్ల చొక్కావాడి మనసు ఉత్సాహంతో ఉరకలేయసాగింది.

ప్లాట్‌ఫామ్ మీదనే ఎర్రచొక్కావాడితో మాటలు కలపాలని ప్రయత్నం చేస్తున్నా, ఎర్రచొక్కావాడు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండా మొబైల్‌లో మాట్లాడుతూనే ఉన్నాడు.

చెప్పిన సమయానికే రైలు ప్లాట్‌ఫామ్‌మీదికి వచ్చింది. ఎర్రచొక్కావాడు అటూ ఇటూ చూసి రైలెక్కుతుంటే వాడితోపాటు తెల్లచొక్కావాడు అదే బోగిలోకి ఎక్కి వాడికి ఎదురుగా కూర్చుంటూ పలకరింపుగా నవ్వాడు.

సభ్యత కోసం ఎర్ర చొక్కావాడు "మీరు ఎంత వరకు మాస్టర్? " అన్నాడు పలకరింపుగా.

"తిరుపతి వరకు. మీరు ఎంత వరకు? " అని ఆరా తీశాడు తెల్ల చొక్కావాడు.

"నేనూ తిరుపతికే మాస్టర్. మా వాడు అర్జంటుగా డబ్బు కావాలంటే తీసుకువెళ్తున్నా"

"మీరు బాహాటంగా అందరికీ వినపడేలా మీ దగ్గర డబ్బులున్నట్లు చెప్తున్నారు. దొంగలుంటారు, జాగ్రత్తగా ఉండాలి మాస్టర్"

ఎర్రచొక్కావాడు బిగ్గరగా నవ్వుతూ "మీరు మా వాడిలానే మాట్లాడుతున్నారే. మనలాంటోళ్ళ దగ్గర కూడా దొంగలు కొట్టేస్తే మనం బతికి ప్రయోజనం ఏంటి మాస్టర్? అయినా నా దగ్గరనుండి డబ్బు కొట్టేసేందుకు ప్రయత్నం చేసే నా కొడుక్కు ఉంటుంది చూడూ" అన్నాడు పిడికిలి బిగించి చూపుతూ.

ఆ మాటలకు తెల్లచొక్కావాడు నిజంగానే భయపడ్డాడు. ఇంత సేపు డబ్బు సంచిమీదే తన లోకంముందికాని వస్తాదుకు మించి ఉన్న వాడి ఆకారం చూసి, పొరపాటున వాడికి చిక్కితే అంతే సంగతులు అనుకొన్నాడు. కాని నోట్ల కట్టలను చూస్తున్నకొద్దీ మనసు అదుపు తప్పుతోంది. ప్రయత్నించి చూద్దాం ఏం జరిగితే అది కానీ అనుకొని, వాడికి దగ్గరయ్యే ప్రయత్నంగా బ్యాగ్‌లోంచి బిస్కెట్ ప్యాకెట్ తీసి తను రెండు తీసుకొని ఎర్రచొక్కావాడివైపు ప్యాకెటు చాపాడు. వాడు వద్దని సంజ్ఞ చేస్తూ "నో థాంక్స్" అనగానే "ఏం మాస్టర్! మత్తు బిస్కెట్లనుకొంటున్నావా? " అని పగలబడి నవ్వసాగాడు. ఎర్రచొక్కావాడు కూడా వాడి మాటలకు నవ్వుతూ రెండు బిస్కెట్లు తీసుకొన్నాడు. తరువాత మత్తు బిస్కెట్ల ద్వారా జరిగిన దొంగతనాల గురించి మాట్లాడుకొంటూ, ఇద్దరూ పాత స్నేహితుల్లా జోకులు పేల్చుకొని నవ్వుకోసాగారు. తెల్ల చొక్కావాడు ఓ పక్క మాట్లాడుతున్నా ఆలోచన మాత్రం మత్తు మందు కలిపిన క్యాడ్‌బరీస్ ఎర్ర చొక్కావాడితో తినిపించేందుకు ఎప్పుడు సమయం దొరుకుతుందా అని ఎదురుచూస్తుంటే, ఎర్ర చొక్కావాడు తన లోకంలో తనుగా మొబైల్‌లో ఎవరెవరితోనో మాట్లాడుతూనే ఉన్నాడు.

రైలు రైల్వే కోడూరు దగ్గరికి రాగానే స్లో అవసాగింది.

అంతవరకు మొబైల్‌లో మాట్లాడుతున్న ఎర్ర చొక్కావాడు ఉన్నట్లుండి "వెధవది! అప్పుడే బ్యాటరీ డౌన్ అయిపోయి స్విచాఫ్ అయింది" అన్నాడు మొబైల్‌వైపు చూసి విసుక్కొంటూ.

"మీరు మాట్లాడే మాటలకు ఏ మొబైల్ మాత్రం తట్టుకొంటుంది? " అని నవ్వుతూ "నా ఫోన్ తీసుకోండి అవసరమైతే" అని 'ఐ' ఫోన్ అందించాడు తెల్ల చొక్కావాడు.

ఎర్రచొక్కావాడు థ్యాంక్స్ చెప్పి వాడి మొబైల్ అందుకొంటూ "చాలా బాగుంది! ఏ మాత్రమైందేమిటి? " అన్నాడు.

"నేను కొనలేదు మాస్టర్. ఓ ఫ్రెండ్ గిఫ్ట్ ఇచ్చాడు"

నెంబరు డయల్ చేస్తూ "ఇదేమిటి మీ మొబైల్‌కు ఇక్కడ సిగ్నల్స్ రావటం లేదు? " అని ఎర్ర చొక్కావాడనడంతో "అలా డోర్ దగ్గరకెళ్లండి మాస్టర్" అన్నాడు తెల్లచొక్కావాడు అవకాశం కోసం ఎదురుచూస్తూ. వాడు ఆ మాట అనగానే చంకలోని బ్యాగ్ సీటు మీద పెట్టి డోర్ వైపు నడిచాడు ఎర్రచొక్కావాడు.

ఎర్రచొక్కావాడు వదిలివెళ్లిన లెదర్ బ్యాగ్‌ను చూడగానే, 'విక్రమార్కుడు' సినిమాలో రైల్వే ప్లాట్‌ఫామ్ మీద తమకు స్వంతం కాబోతున్న ట్రంకు పెట్టెను చూసి పడి పడి నవ్విన రవితేజా, బ్రహ్మానందాల్లాగా నవ్వుకొంది తెల్లచొక్కా వాడి మనసు.

ఎర్రచొక్కావాడు డోర్ దగ్గరకు వెళ్లి అక్కడ సిగ్నల్స్ లేనట్లు ఫీల్ అవుతూ, ట్రైన్ ఆగగానే

# చతుర కత

కిందికి దిగి అటు ఇటు తిరిగి మాట్లాడసాగాడు.

వాడినే గమనిస్తున్న తెల్లచొక్కావాడు, వాడటు కనుమరుగు కాగానే బ్యాగ్‌ను చంకలో పెట్టుకొని బోగీ దిగి పడి పడిగా బైటకెళ్లి చీకట్లో కలిసిపోయాడు. ఆ తరువాత ఓ టాక్సీ ఎక్కి వాడ్ని త్వరగా వెళ్లమని చెప్తూ ఆత్రుత ఆపుకోలేక బ్యాగు తెరిచి నోట్ల కట్టల్లా కట్ చేసిన కాగితాల కట్టలను చూసి తెల్లమొహం వేశాడు.

ఇక ఎర్రచొక్కావాడు, తెల్లచొక్కావాడు తన బ్యాగు పట్టుకుని పోతుండటం చాటు నుంచి గమనిస్తూనే, 'ఐ' ఫోన్ వంక సంతోషంగా చూసుకుంటూ ఉండిపోయాడు, అధమంగా ఓ ఇరవై వేలైనా గిట్టుబాటు అవుతుందని. కాని వాడు దాన్ని అమ్మకానికి పెట్టినప్పుడు తెలిసింది అది 'ఐ' ఫోన్ కాదని, పై డొప్పలే తప్ప లోపల అంతా చైనా సరుకని! ©




పెద్దిభొట్ల సుబ్బరామయ్య

# ముక్తి

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**ఒక ఊళ్ళోనే వుంటారు. నిత్యం ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూనే వుంటారు. పౌర హక్కులు.. చట్టాలు.. అన్నీ అందరికీ సమానమే! అయినా వాళ్ళ గురించి చాలామందికి తెలియదు. వాళ్ళకి సరైన తిండి ఉండదు. బతకటానికి పర్మినెంటు పని వుండదు. కూటికోసం కోటి విద్యలన్నట్టు రకరకాలుగా జీవనం. ఉండటానికి సరైన ఇళ్ళు కావాలి. దుమ్ములో.. మురికి మధ్య.. కాలుష్యం నడుమ.. అదో ప్రపంచం. ఉమ్మడిగా వాళ్ళకున్న వ్యవహారనామం అలగాజనం.. స్లమ్ పీపుల్..! పట్టణాలలో.. నగరాలలో వీరి ఉనికి ఎక్కువ. పల్లెల్లో బతుకు బరువై కడుపు చేత పట్టుకుని బతకటానికి రకరకాలుగా వలసవచ్చిన వాళ్ళే వీళ్ళు. అలా వచ్చింతర్వాత వాళ్ళపిల్లలు.. వాళ్ళపిల్లలు.. ఇది తరతరాలు చరిత్ర. కళ్ళ ముందే కనిపించినా, వీళ్ళ గురించిన వివరాలు, అంటే ఏం చేస్తారు? ఎలా బతుకుతారు? వానల్ని, వరదల్ని ఎలా తట్టుకుంటారు? జబ్బులు చేస్తే ఎలా? ఇలాంటివన్నీ ఎవరికోగానీ తెలియదు. అవి తెలుసుకోవాలంటే లోతైన పరిశీలన, గట్టి అధ్యయనం కావాలి. ఒకచోటే బతుకుతున్న తోటి మనిషి గురించి తెలియని ఈ విచిత్ర స్థితిని పట్టుకుని 'ముక్తి' గా నవలారూపం ఇచ్చారు పెద్దిభొట్ల సుబ్బరామయ్య.**

**ఆ** ఇళ్ళన్నీ, ఎత్తయిన రోడ్డుకి దిగువున పల్లంలో వున్నాయి. చాలా వరకు పాకలు. కొద్దో గొప్పో రేకుల ఇళ్లు. జేబులు కొట్టేవాళ్లు, వ్యభిచారం చేసేవాళ్లు, దొంగసారా వ్యాపారంతో సంబంధం వున్న వాళ్ళు, రిక్షాలు లాగేవాళ్ళు.. ఇలా రకరకాల జనం. ఇంచుమించు అందరివీ లాటరీ బతుకులే! స్థిరమైన సంపాదన, ఉద్యోగాలు వున్నవాళ్ళు లేరనే చెప్పాలి. చట్టబద్ధమైన హక్కు వున్న ఇళ్ళు కావవి. చాలా ఏళ్ళుగా అవి అలా వున్నాయి. ఉన్నాయని చాలామందికి తెలుసు. విషయం చర్చకు వచ్చినప్పుడు మాత్రం, ఆ స్థలాన్ని ఆక్రమించుకుని కట్టుకున్న ఇళ్ళని, దోషమంతా వాళ్ళదే అన్నట్టు మాట్లాడతారు.

ఆ రోడ్డు పల్లంలో దరిదాపు వంద పాకలుంటాయి. అంతకు ముందు అంటే నాలుగైదు ఏళ్ళ క్రితం వరకూ కాలవ ఒడ్డున వున్న పాకలన్నింటినీ ప్రభుత్వం లేపేయటంతో ఊరికి దూరంగా వున్న స్థలాన్ని ఆక్రమించి పాకలు వేసుకున్నారు. వీళ్ళ అలా వచ్చేనాటికి అక్కడ అన్నీ చిన్న చెట్లూ, పొదలూ తప్ప మరేం వుండేవి కావు. ఇప్పుడు రద్దీ బాగా పెరిగింది. ఊరిలో ఓ గుర్తింపు ఉన్న భాగంగా మారింది. వీళ్ళని ఇప్పుడు ఇక్కడ నుంచీ లేపేసి ఆసుపత్రి కట్టే యోచనలో ప్రభుత్వం వుంది. నోటీసు కూడా ఇచ్చారు. అయినా వీళ్ళు మొండిగా అలా బతికేస్తున్నారు. మొండిగా బతుకుతున్నా అనుక్షణం భయం. ఉంటున్న గూడు పోవటం అంటే సామాన్యమైన దిగులు కాదు. దినసరి భుక్తికీ భరోసాలేదు.. ఉంటున్న గూడు మీద నమ్మకం లేదు.. అలాంటి గాలి బతుకు వాళ్ళది.

వాళ్ళల్లో వాడే వెంకటాద్రి. అద్దె రిక్షా తొక్కుతూ నీతిగా నిజాయితీగా సంసారం చూసుకుంటున్న వ్యక్తి. అతని తప్పేమీ లేకుండానే ఇతరులు ఇరికించిన దొంగసారా కేసులో రెండునెలలు జైల్లో ఉండి విడుదలై వచ్చాడు. ఇక్కడ కథ ఆరంభించారు సుబ్బరామయ్య.

తన దోషం లేకపోయినా జైల్లో ఉండి వచ్చినందుకు న్యూనతగా ఉంది వెంకటాద్రికి. ఆ సిగ్గుతోటే తిన్నగా ఇంటికి కూడా వెళ్ళకుండా అక్కడా ఇక్కడా తిరుగుతున్నాడు. తిరిగి తిరిగి

చివరికి సాయంత్రానికి ఇల్లు చేరాడు. భార్య చంద్రమ్మ భర్తని ఎంతగానో ఆదరించింది. ఇంట్లో వాతావరణం మామూలుగానే వుంది. దాంతో కొంచెం తెప్పరిల్లాడు వెంకటాద్రి.

వెంకటాద్రి జైలుకి వెళ్ళటానికి కారణం బాబూరావు. బాబూరావుకి ఆ ప్రాంతంలో, ఆ ఊళ్ళో పలుకుబడి వుంది. అతను చెయ్యని తప్పుడు పనిలేదు. మోసాలు, దొంగతనాలు, వ్యభిచారం, తార్చటం, దొంగ సరుకు కొనటం, అమ్మటం.. డబ్బు కోసం దేనికేనా సిద్ధం. అతని గేంగ్‌లో ముఖ్యులు సింహాచలం, పాపారావు. ఈ ముగ్గురి వల్లే వెంకటాద్రి జైలు పాలయ్యాడు. తిరిగి వెంకటాద్రిని తమ ఉచ్చులోకి లాగాలని వాళ్ళు ప్రయత్నించారు. మీ పొత్తు వొద్దు. నా బతుకు నన్ను బతకనివ్వండని ఖరాఖండీగా చెప్పేశాడు వెంకటాద్రి.




మళ్ళీ రిక్షా నడుపుకుందామని యజమాని కోటిలింగం దగ్గరికి వెళ్ళి అడిగాడు వెంకటాద్రి. కుంటిసాకులు చెప్పి రిక్షా ఇవ్వలేదు. దానికి కారణం బాబూరావు. వెంకటాద్రికి రిక్షా దొరకకపోతే గతిలేక తననే ఆశ్రయిస్తాడని ఊహ. కోటిలింగానికి అలా చెయ్యమని ముందే చెప్పిపెట్టాడు.

రిక్షా దొరకనందుకు వెంకటాద్రి నిరాశపడ్డా, బాబూరావు దగ్గరికి వెళ్ళలేదు. తోటి రిక్షా అతను, స్నేహితుడు రత్నం ఆదుకున్నాడు. వెంకటాద్రిని ఆ రాత్రికి తన రిక్షా తొక్కుకోమన్నాడు. ఆ రాత్రి సంపాదనతో ఓ రోజు గడుస్తుంది. మళ్ళీ భుక్తికి వెతుకులాటే! ఒక్కటే ధైర్యం. రెక్కల కష్టానికి సిద్ధం. ఏదోపని వెతుక్కుని బతకటమే.

ఇలా ఆ పాకల్లోని వెంకటాద్రి జీవితాన్నే కాదు, ఇంకా అక్కడి కుటుంబాల గురించి చాలా వివరంగా రాశారు సుబ్బరామయ్య. మిషన్ కుట్టే పెంచలయ్య, కోతుల్ని ఆడించి బతికే రామకోటి, ఇద్దరు ఎదిగిన కూతుళ్ళ వ్యభిచార సంపాదన మీద బతికే సన్యాసి.. ఇలా ఎందరెందరో! అందరి జీవితాల్లో ఏదో ఒక ఇబ్బంది.. లేదా ఏదో ఒక అపశ్రుతి. ఈ అధోజగతి జీవనతీరుని కళ్ళకు కట్టినట్టు చూపించటమే సుబ్బరామయ్య 'ముక్తి' నవల ప్రధాన ఉద్దేశం.

చంద్రమ్మకి ఓ తమ్ముడున్నాడు. అతని పేరు అప్పారావు. వాడిదో రికామీ జీవితం. దొంగతనాలు, మోసాలు, సినిమాహాళ్ళ దగ్గర బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మటం లాంటి చిల్లర పనులకి అలవాటు పడ్డాడు. కష్టపడి ధర్మసమ్మతంగా బతకటం చేతకానితనమని అతని సిద్ధాంతం. తమ పక్క పాకలోని వరహాలంటే అప్పారావుకి ఎంతో ఇష్టం. వెంకటాద్రి కథతో పాటే అప్పారావు కథని సమాంతరంగా చిత్రించారు సుబ్బరామయ్య. ఒకే ఇంట్లో రెండు ధోరణులు. వెంకటాద్రి కుటుంబానిది మంచిదారి.. అప్పారావుది చెడుదారి. అయినా పరస్పరం ఎంతో ప్రేమ.

సరైన పని దొరక్క వెంకటాద్రి ఇబ్బందిగా ఉన్నాడు. దానికి తోడు భార్య చంద్రమ్మ గర్భవతి. ముసలి తల్లి, కొడుకు చిట్టిబాబు..! సంసారం భారంగా గడుస్తోంది. ఆ సమయంలో ఆ పాకల్ని వరద నీరు ముంచింది. అందరూ అవసరమైన సామాన్లతో రోడ్డెక్కి కూచున్నారు. వర్షంలో వరదనీటితో నానా బాధలు పడ్డారు. ఆ వరద సమయంలో వీళ్ళ కష్టాలు వీళ్ళవి. రాజకీయ నాయకుల రావటం.. వాగ్దానాలు చెయ్యటం లాంటి కార్యక్రమాలన్నీ నడిచాయి. వరద నీరు తగ్గాక తిరిగి పాకల్లోకి చేరారు. వాళ్ళ జీవితాలు మరింత భారంగా మారాయి. మరింత మురికిమయం అయ్యాయి.

మురికి వాడలుగా వ్యవహరించే ఈ స్లమ్ జీవితాన్ని ఒక ధారగా.. ఒక వరసలో చెప్పటం కష్టం. ఎందుకంటే ఇది ఎందరిదో కథ. రకరకాల ఆటుపోట్ల వివరణ. దానికితోడు మంచి చెడుల సంఘర్షణ. నీతి అవినీతి ప్రభావం. వెంకటాద్రి, అప్పారావు కథల ఆధారంగా నడిచిన ఈ నవలలో కొన్ని నాటకీయ సంఘటనలూ వున్నాయి.

అప్పారావుని మొత్తానికి బాబూరావు బృందం తమ ఉచ్చులోకి లాగింది. మంచి లాభసాటి పని అని చెప్పి అతనికి స్మగ్లింగ్ సరకు తెచ్చే పని అప్పగించారు.

# సామాన్యులే మాన్యులు!



పెద్దిభొట్ల సుబ్బరామయ్య సమకాలీన రచయితలలో పేరెన్నికగన్నవారు. వీరి రచనలు చాలా వరకు సామాన్యుని జీవనం చుట్టూ అల్లుకొని ఉంటాయి. తెలుగులో లఘుకథారచయితగా ప్రసిద్ధికెక్కారు. వీరు ప్రచురించిన 'పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు' సంపుటం *2012*లో సాహిత్య అకాడెమీ అవార్డుకు ఎంపికయింది. సుబ్బరామయ్య రైల్వే స్టేషనుమాస్టర్ కుమారులు. గుంటూరులో జన్మించిన వీరి విద్యాభ్యాసం ఒంగోలు, విజయవాడలలో సాగింది. విజయవాడలో స్థిరపడిన పెద్దిభొట్ల ఆంధ్ర లయోలా కళాశాలలో నాలుగు దశాబ్దాలపాటు ఉపన్యాసకులుగా పనిచేసి పదవీవిరమణ చేశారు. జ్ఞానపీఠ పురస్కారగ్రహీత విశ్వనాథకి పెద్దిభొట్ల వారు శిష్యులు.

సుబ్బరామయ్య *1959*లో రచనారంగంలో అడుగుపెట్టారు. రెండు వందలకు పైగా కథలు రాశారు. 'చక్రనేమి' మొదటి కథ. ఆంధ్రపత్రిక, భారతిలో పెద్దిభొట్ల కథలు అనేకం ప్రచురితమయ్యాయి. నయనతార, నీళ్లు, ముసురు, పొగమంచు, కళ్లజోడు, పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు, చిలకహంస, గాంధీని చూసినవాడు- పేర్లతో కథా సంపుటాలు వెలువడ్డాయి. 'ముక్తి', 'చేదుమాత్ర' రెండు నవలలు రాశారు.

ఆయన రచనలు అనేకం ఇతర భాషల్లోకి అనువదితమయ్యాయి. ఆంగ్లంలో 'ఎ రెయినీ డే అండ్ అదర్ స్టోరీస్' పేర ఒక కథల సంపుటి వెలువడింది. ఆయన రచనలు పేద, మధ్యతరగతి జీవితాలతో ముడిపడి ఉంటాయి. రావిశాస్త్రి స్మారక సాహిత్య నిధి, గోపీచంద్ మెమోరియల్, అప్పాజ్యోస్యుల విష్ణుభొట్ల కందాళం ఫౌండేషన్ అవార్డు సుబ్బరామయ్యకు వచ్చాయి. తెలుగు విశ్వవిద్యాలయం నుంచి 'ఉత్తమ రచయిత' పురస్కారం అందుకున్నారు.

ఆ పనిలో అతనికి జత రంగనాయకి. కొంత కాలం ఆ పని బాగానే సాగింది. ఓసారి రైడింగ్ జరిగింది. రంగనాయకి తాను దొరికిపోయి.. అప్పారావుని తప్పించింది. అప్పుడే అప్పారావులో ఆ జీవితం పట్ల అయిష్టత మొదలైంది. ఆ తర్వాత పరిస్థితులు కలిసొచ్చి గౌరవంగా సరైన దారిలో మంచి ఉద్యోగంలో కుదురుకున్నాడు. వరహాలుని తన జీవిత భాగస్వామిని చేసుకున్నాడు. అలాగే వెంకటాద్రి జీవితంలోనూ కొన్ని నాటకీయ సంఘటనలు జరిగాయి. కానీ అప్పారావులా అతని జీవితం స్థిరపడలేదు. ప్రసవ సమయంలో చంద్రమ్మ.. బిడ్డ ఇద్దరూ పోయారు. తన సర్వస్వం పోయినట్లయింది వెంకటాద్రికి. సరిగ్గా అదే సమయంలో ఆ పాకలన్నింటినీ ప్రభుత్వం పీకేసింది.

ఇంక ఆ నగరంలో తనకేం లేదని, నిర్లిప్తంగా తల్లితో, పిల్లాడు చిట్టితో తన పల్లెకి బయలుదేరాడు వెంకటాద్రి. తన పూర్వీకులు కలిసిన మట్టిలో, ఆ పల్లెలోనే తనూ కలిసి పోవాలనుకున్నాడు. కథగా 'ముక్తి' అంత పెద్దగాథ కాదు కానీ, మన మధ్యే వున్న, చాలామంది దృష్టికి రాని, విభిన్నమైన జీవితాల్ని చూపించిన గాథమైన రచన. అప్పారావుకి ఒకరకంగా.. వెంకటాద్రికి మరోరకంగా ఆ మురికివాడ నుంచి ముక్తి లభించింది.

కానీ అక్కడే ఉంటూ, అక్కడే నశించే వేలాది జీవితాలు ఎన్నో! వారికి ఆ పరిస్థితుల నుంచి ముక్తి గురించి ఆలోంచించేదెవరు?

మురికివాడలో భౌతిక కాలుష్యమే కాదు, మనుషుల్ని, ఆలోచనల్ని నియంత్రించే పరోక్ష కాలుష్యమూ ఉంటుంది. జీవితాన్ని తప్పుదోవకి నెట్టే ప్రభావాలు ఎన్నో! బాబూరావు లాంటి గుంపులు ఎన్నిరకాలో! అవమానం, ఆకలి, బాధ, ఆక్రోశం, అక్కడి నిత్యజీవితం. ఈ మురికివాడల జీవితం అంతే! ఎవరేం చేస్తాం? అన్న అలసత్వం. లోతుగా ఆలోచించగలిగితే ఈ అమానుషం అంతరంగాల్ని కదిలిస్తుంది. వెళ్లి అక్కడ నిలిచి చూస్తే మన తోటి జీవితాలు ఇంత దారుణమా? అనిపిస్తుంది.

ఈ ముక్తి నవలే కాదు, అధోజగతి గురించి మరెన్నో రచనలు చేశారు సుబ్బరామయ్య. నిశితపరిశీలన, ప్రత్యేకదృష్టి, పేదల పట్ల ఆర్తి ఆయన ప్రత్యేకత. ఆ ప్రత్యేకత నిండుగా ఉన్న నవల ముక్తి. ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్
సమాధానాలు

**ప్ర.** జీవితంలో నిజాన్ని దాచో, మరుగున పెట్టో వ్యవహరించాల్సి వస్తోంది. అనేక సందర్భాల్లో మనస్సుకు నచ్చని రీతిలో మసలుకోవాల్సి ఉంటోంది. ఇవన్నీ తప్పుల కిందే పరిగణింపబడతాయా? పరిష్కారమేమిటి?

– డా. శివభూషణం, కర్నూలు

**జ.** తప్పదు 'ఎప్పటికి ఎయ్యది ప్రస్తుతము...' అంటూ పెద్దలు చెప్పారు. 'సాక్షి' వ్యాసాలలో సత్యభాషణం బాధ చాలా అందంగా వివరించారు పానుగంటివారు. జంతికలకి శనగపిండి ఎంత అవసరమో, అవి కరకరలాడాలంటే తగినంత బియ్యపు పిండీ అవసరం తప్పదు. అలాగే వ్యవస్థ సక్రమంగా నడిచి పదిమందికీ మంచి జరగాలంటే కాగితపు నవ్వులు తెచ్చుకొన్న ప్రేమ భావనలూ తప్పవు. ఇది పాపం కాదు. తప్పులూ కావు. తప్పదు కదా! వ్యాస భగవానుడంటాడు 'సత్యం యథార్థ కథనం నహి - సర్వ భూతహితమైనదే సత్యవాక్యమని'. త్యాగయ్యగారు చెప్పారు 'సమయానికి తగుమాటలాడి...' అది ఈనాటి యుగంలో అవసరం! అత్యవసరం! త్యాగయ్యగారే మరొక మాటన్నారు.. 'సంసారులైతే నేమయ్యా శిఖిపింఛావతంసుడెదుట నుండగా' భగవంతుని మీద దృష్టి ఉంచండి. పాపం అంటదు.

**ప్ర.** కలియుగంలో విలువైన వస్తువులు నీచంగాను, నీచమైనవి విలువైనవిగాను చెలామణీ అవుతున్నాయి. అసత్యవాదులు అధికంగా పుట్టుకొస్తున్నారు. నిత్యం ఏసీబీ దాడులేనా?

– ఎం. మీనాక్షి,
సూర్యాపేట, నల్గొండ జిల్లా

**జ.** కలియుగ ధర్మాలు భారతం, భాగవతంతో పాటు అన్ని పురాణాలూ చెప్పాయి. అన్నం అమ్ముకొనే ఇళ్లు బయలుదేరతాయి. చదువుని నమ్ముకొనడం కన్నా అమ్ముకొనే రోజులు వస్తాయి. అందాలను అంగడి సొమ్ము చేసుకొనడం పరిపాటి. ప్రతివారు తమ ధర్మాలు, ఆచారాలు, వృత్తులు వదిలి, ఎదటివారి వృత్తులకి ఎగబడతారు. ఏది తన శరీరానికి పోషణ యిస్తుందో అదే భోగవస్తువుగా భావించే దుర్మార్గులు తయారవుతారు. బోధలు విని బాగుపడవలసినవారే బోధకులుగా అవతారమెత్తి గొప్ప సాధనాపరులుగా చెలామణీ అవుతారు. వేదపురాణశాస్త్రాదులు విమర్శించే వారే, వాటివలన జీవనోపాధి పొందడం కాదు, కోట్లకి పడగెత్తుతారు. శిష్యుల హృత్తాపహారులు కావలసినవారు, విత్తాపహారులు అవుతారు. ఇది యుగ ధర్మం! మనం మన ధర్మం పాటిద్దాం! అంతకన్న మార్గంలేదు.

**ప్ర.** రాచ ఉసిరి పచ్చడిని రాత్రివేళ, ఆదివారాలు తినరాదంటారు.. ఎందువల్ల?

– ఎస్.వి.వి.ఎస్. పద్మావతి, కాకినాడ

**జ.** ఉసిరిక చెట్టుకి అధిదేవత చంద్రుడు, రోహిణి నక్షత్రము. రాత్రి భాగం చంద్ర, నక్షత్ర సంబంధాలు కలది గనుక ఉసిరిక భక్షణ రాత్రి వేళ జరిగితే చంద్రుడిని, రోహిణిని, లక్ష్మిని అవమానపరచినట్లవుతుంది. అదేవిధంగా ఆదివారం ఆదిత్యవారం గదా! చంద్రకాంతి సూర్యుని వలననే గదా! అందువలన ఆదివారం ఉసిరిక తినరాదు. తిన్నట్లయితే ఆయా గ్రహసంబంధమైన దోషాలు అంటుతాయి. ఇది జ్యోతిషపరమైన వివరణ. వైద్య శాస్త్రపరంగా చూచినట్లయితే సాయంకాలం ఆరుగంటల తరువాత ఉసిరిక తిన్నప్పుడు జీర్ణప్రక్రియ మందగిస్తుంది. ఈ స్థితి ఆదివారం రోజంతా ఉంటుంది. అందువలన

మన పెద్దలు ఆదివారంనాడు ఇతర రోజులలో రాత్రివేళ ఉసిరిక తినడాన్ని నిషేధించారు.

*ప్ర. వైధవ్యం ప్రాప్తించిన స్త్రీలు శుభకార్యాల్లో ఎందుకు నిమగ్నం కారాదు? జన్మతః వచ్చిన బొట్టు, పూలు, గాజులుకు ఎందుకు దూరంగా ఉండాలి?*

**– టి. హేమలత,** మచిలీపట్నం, కృష్ణా జిల్లా

జ. దీనికి సంబంధించిన గాథ మహాభారతంలో 'భీష్మసత్యవతీ సంవాదం' (ఆది పర్వము)లో వస్తుంది. 'మమత' అనే రుషిపత్ని చేసిన దుర్మార్గం వలన ఆమె భర్త దీర్ఘతముని శాపం కారణం యిది. ప్రాచీనులలో కొందరి నడవడికల వలన తరువాత తరాలలో ఆ నడవడిక మంచి, చెడులని అనుసరించి ఆచారాలలో మార్పులు వచ్చాయి. ప్రవర్తనావళిలో మంచి కన్నా చెడు ఎక్కువ ప్రభావం చూపింది.

'యక్తాహార విహారస్య' అని గీతా వాక్యము. ఆహార విహారాలలో ఆహారం ఎంత ప్రధానమో విహారమూ అంతే ప్రధానం. 'విహార' శబ్దంలో ఆహార్యము (వస్త్రధారణ, అలంకరణ మొదలైనవి) కూడా ఉంది. పూలు, పసుపు, కుంకుమ, గాజులు, మంగళసూత్రములు ఇలాంటివన్నీ మంగళకర ద్రవ్యములు. ఇవి ధరించే అర్హత కలిగించినవి వేదమంత్రములు. ఇవి ధరించే ప్రక్రియకి అంతటి వైభవము, ముహూర్తము, మంగళ వాద్యాలు వగైరా మీద ప్రతిపత్తి ఉండి, అది దూరమైన స్థితిలో ఉండే ప్రవృత్తిని కాదనడం ఎంత వరకు సబబు.

శుభకార్యాల వేళ వారి భాగస్వామ్యం పనికి రాదని ఎక్కడా లేదు. కానీ వారిని చూడడం వలన, శుభకార్యములో పాల్గొనే స్త్రీలకు తెలియని భయాందోళనలు, వారిని చూచినప్పుడు వీరికి ఇతర భావనలు కలిగి మనసులు చెదిరే స్థితి ఉంటుందని కొన్ని నియమాలు పెద్దలు ఏర్పరచారు. ఇలాంటి నియమాలే భార్య మరణించిన మగవారికి 'విధురులు' అని పేరు పెట్టి వర్తింపచేశారు. దురదృష్టవశాత్తు విధవరాండ్రను హద్దులు దాటిన నియమాలతో కొన్ని శతాబ్దాలు హింసించిన మాట సత్యమే. భర్తలు లేని వారి మనోభావాలు పెడమార్గాలకు పోరాదని పూర్వులు ఏర్పరచిన విధులు అవి. వారిని నీచంగా చూడడానికి కాదు.

పూలు, బొట్టు, గాజులు జన్మతః అంటున్నారు. ఎంతమాత్రం కాదు. ఆడవారికి నుదుట బొట్టు దిద్దడం మొదలు అన్నింటికి ఆయా కాలాలు, ముహూర్తాలు వగైరా చూచి 'సంస్కారాలుగా' ఏర్పరచారు. పుట్టిన 21వ రోజు వరకు స్నానం, బొట్టు ఉండదు. ఆరునెలల వరకు నూతన వస్త్రాలుండవు. తొమ్మిది నెలల వరకు గాజులు వంటివి లేవు. 'సంస్కార చంద్రిక' అనే గ్రంథం చూడండి.

*ప్ర. వరలక్ష్మీవ్రతం, వినాయకచవితి వంటి పూజా కార్యక్రమాలు ఆడియో క్యాసెట్లతో నిర్వహిస్తున్నారు. ఈ యాంత్రిక సౌలభ్యత పవిత్రతకు భంగం కలిగించదా?*

**– తాజీ ప్రసాద్,** చెన్నై

జ. పవిత్రతకి భంగం కలిగించేది యాంత్రిక పరికరాలతో మంత్రోచ్చారణలు కావు. వ్రతాలు జరిగే చోట డీజేలు, డాన్సులు, అరుపులు, గోలలు, మందీమార్బలాల హడావుడి, అశ్లీలపు చలనచిత్ర గీతాలు, జానపదాల పేరుతో సాగే సంకీర్ణ సమాసాల గేయాలు, అలంకరణలు. పవిత్రంగా, శ్రద్ధగా పూజలు జరిపించవలసిన మహనీయులు గంటకి ఇంత అని రేట్లు మాట్లాడుతున్నారు. పూజలు కాలనియతి పాటించకుండా, అందరికీ (కొందరికి) అనుకూలంగా ఉండే సమయాలలో చేస్తున్నారు. ఒకవేళ శ్రద్ధగా చేయడానికి సిద్ధంగా కొందరున్నా, యజమానులు త్వరగా తెమల్చమంటారు. అందువలన ఈ గోల అవసరం లేకుండా కేసెట్లు, సీడీలు పెట్టడంలో తప్పేముంది. నయం ఎలక్ట్రానిక్ అగరొత్తులు, రోబోల పూజలు ఇంకా దేశంలోకి రాలే, సంతోషిద్దాం! 'జయకృష్ణా! ముకుందా! మురారీ!' పాట వింటూ కంట నీరు పెట్టుకోగలిగితే అది యాంత్రిక పరికరమైనా పవిత్రతగా భావించలేమా!

*ప్ర. భార్యను 'సహధర్మచారిణి' అంటారు. భర్త చేసే అధర్మాలకు, అకృత్యాలకు భార్యగా ఆమె ఎంతవరకు బాధ్యురాలు?*

**– యు. చిట్టిబాబు,**
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

జ. సహధర్మచారిణి అంటే సాధారణంగా భార్య అని అర్థం చెప్తారు. జనకుడు కన్యాదానం చేస్తూ 'సహధర్మచరీ తవ' అన్నాడు. అదేమిటండీ! పెళ్లి అయిన తర్వాత గదా 'సహధర్మచారిణి' అవుతుంది అని కొందరి శంక! సహ+ధర్మ అంతరార్థం ఏమిటంటే భర్త అనుసరించే ధర్మం (న్యాయపరమైనది) తన ధర్మంగా ఆచరించునది అని. పుణ్యకర్మలకిది వర్తిస్తుంది. పాప కర్మలకి వర్తించదు. ఇదే భావం వాల్మీకి కథలో అతని భార్యచెప్తే.. సానుభూతి వాల్మీకికి, చీవాట్లు

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

*ప్ర.* హిందూమతం, దేవుళ్లు, ఇతిహాసాలు, పురాణాలను అన్యమతస్థులు, నాస్తికవాదులు అనేక సందేహాలు, చర్చలతో అవమానిస్తుంటే విజ్ఞులైన ప్రవచన కర్తలు, పీఠాధిపతులు, మేధావులు నిజానిజాల్ని తెలియజేయాలి కదా! లేకపోతే యువత వారిపట్ల ఆకర్షితులయ్యే ప్రమాదం ఉంది కదా?

– *ఎ. శైలజా జానకి,*
*నవులూరు, గుంటూరు జిల్లా*

**జ.** ఈ నాస్తిక వాదులు, అన్యమతస్థులు- అలనాటి రావణుడు, కంసుడు, శిశుపాలుడు, హిరణ్యకశిపుడు, వేనచక్రవర్తి,- వీరందరి కంటే గొప్పవారా! 'శరణాగతి' అనే తత్వాన్ని వారానికి ఒకరోజు భగవంతుని దగ్గర క్షమ కోరుకోవడంగా మార్చినవారు ఒక మతం వారు. కంటికి కాటుక ధరించడం మొదలు నిరాకారునిగా భగవదారాధన సామగానంతో చేసే విధానాన్ని మార్చుకు చేసేది మరొకరు. విగ్రహారాధన అవివేకం అని చెప్పుకొంటూ ఆయాప్రవక్తల విగ్రహాలకి ఆరాధనలు చేసే జాతి ఒకటి. ఖాండవ దహనం, ఘోషయాత్ర, ఉత్తరగోగ్రహణం- ఇలా ఎన్నో ఘట్టాలున్నా, చూచి కూడా బుద్ధిమారని దుర్యోధనునికన్నా పెద్ద మూర్ఖులా మీరు చెప్పిన వారందరు! సగం సగం చదివి 'నాకు సర్వంబు ఒచ్చు' (సంధి కలపలేదు మర్యాదకోసం) అనుకొనే నాస్తికవాదులు నిజంగా మేధావులే. ఎందుకంటే ఆస్తికుడు ఒకటో రెండో గ్రంథాలు చదివి దేవునికి దండం పెడతాడు. నాస్తికుడు దేవునికి సంబంధించిన గ్రంథాలు అన్నీ చదువుతాడు. 'అస్తి' అన్నది 'నాస్తి' అని చెప్తాడు. ప్రహ్లాదుడి కన్నా- నిరంతరం విష్ణువుని ధ్యానించిన హిరణ్యకశపుడే గొప్ప. పునరుక్తి దోషం పట్టినా సరే అని పాడిందేపాటగా ప్రవచనకర్తలు, పీఠాధిపతులు వారి వారి సిద్ధాంతాల ప్రచారాలు, ప్రసార మాధ్యమాలు చూసుకోవాలి గదా! ఇంక మీరన్న మేధావులా! వారికొక నమస్కారం- యువత అంత తేలికగా చెడదు- ఎందుకంటే ఇంతకంటే గొప్పవారు మనకి ఉన్నారు. యవ్వనం ఉరకలు వేసిన వేళ సమాజాన్ని భ్రష్టు పట్టించి, వయసు మళ్ళగానే వైరాగ్యంలోకి దిగిన ఎందరెందరినో మనం చూశాం. భారతీయ పునాది అంత తేలికగా కదలదు. మన భవంతి గోడల మీద ఎవరో పిచ్చి రాతలు రాస్తున్నారు. పత్రాలు అతికిస్తున్నారు. అంతే! వారు లోపలికి రాలేరు.

భార్యకి, పిల్లలకి వచ్చాయి. భర్త చేసే అకృత్యాలకు, అధర్మాలకు బాసటగా నిలిచిందాని ఫలితం ఆమె కూడా అనుభవిస్తుంది. నిప్పులో ఉన్న ఇనుము వేడెక్కవచ్చు, వంకర తిరగవచ్చు, నిప్పు కారణంగా దెబ్బలూ తింటుంది. కానీ నీరు తగిలినపుడు నిప్పు రూపం మారే (ఆరిపోతుంది) అవకాశం ఉంది. ఇనుము మాత్రం అలాగే ఉంటుంది. (కొంచెం రజను తప్ప). భర్త వలన భార్యకి ఇదేస్థితి. భర్త అకృత్యాలకి బాసట అయినా, వారించే ప్రయత్నం చేయకపోయినా ఆమెకీ శిక్షపడుతుంది. వారించే ప్రయత్నం చేసి విఫలమైంది గాంధారి. కష్టం, సుఖం రెంటిలో సమాన భాగం పొందింది సీత.

*ప్ర.* దేవాలయాన్ని సందర్శించినపుడు కొంత మంది మూడు, ఐదు, ఇరవై ఒకటి ఇలా ప్రదక్షిణలు చేస్తుంటారు. ఇందులోని పరమార్థం ఏమిటి?

– *టి.వి.డి.ఎన్. సీతారామారావు, విజయవాడ*

**జ.** ఆయా పురాణాలు, గ్రంథాలను అనుసరించి ప్రదక్షిణలు ఎన్ని చేయాలో ఉంది. ఎలా చేయాలో ఉంది. మనం సంఖ్య దగ్గరే ఆగాం. త్రికరణశుద్ధికి మూడుసార్లు సంకేతం. పంచకోశ సమన్వయానికి ఐదు, నవద్వారాల శోధనకి ప్రతీక తొమ్మిదిసార్లు తిరగడం, 27 ప్రదక్షిణలు నక్షత్రాల సంఖ్యకి సంకేతం. తంత్రశాస్త్రంలో విధానాలని బట్టి ఆయా దేవతల రూపాలు, గుణాలు, గ్రహదోషాలు వీటికి సంబంధించి ఇన్ని ప్రదక్షిణలు అని తెలిపారు. 'ప్రదక్షిణ' అంటే ప్రకృష్టంగా భగవంతునికి మనము సమర్పించుకొనుట అని. ఖగోళశాస్త్ర రీత్యా ఆయా గ్రహాలు సూర్యుని చుట్టు తిరిగే విధిని అనుసరించి కూడా ప్రదక్షిణల సంఖ్య ఉంటుందని పురాణ వాక్యం. డాక్టరు చెప్పిన ఉదయపు/ సాయంకాలపు నడకకి ప్రత్యామ్నాయంగా పనిలో పని పుణ్యమూ వస్తుందని ప్రదక్షిణలు చేయడం. అయితే భక్తి లేకుండా చేయకూడదు. Ⓒ

25

# భామనే.. సత్యభామనే...!

'జన్నత్' సినిమాతో బాలీవుడ్‌లో తెరంగేట్రం చేసింది. హిందీలోనే కాదు, లెజెండ్, డిక్టేటర్ వంటి సినిమాల్లోనూ నటించి తెలుగు ప్రేక్షకులకూ దగ్గరైంది. అంతేకాదు, హిందీ సినిమా '3జి'తో గాయకురాలు కూడా అయింది. ఇంతకీ ఎవరా అందాల భామ? అనుకుంటున్నారా? సోనాల్ చౌహాన్! మరి ఆమె సౌందర్య రహస్యాలేంటో చూద్దాం..

## సొగసు చూడతరమా...

అన్నీ తినెయ్యడమే నా ఫిట్‌నెస్ మంత్రం! డైటింగ్ మీద నాకు నమ్మకం లేదు. నేను నాకిష్టమైనవన్నీ లాగించేస్తా. ప్రతిరోజూ జిమ్‌కు వెళ్లి అదంతా కరిగించేసుకుంటా. లంఖనాలు ఉండడం వల్ల మొహంలో కాంతి మాయమవుతుంది. అయితే షూటింగ్ సమయాల్లో మాత్రం చాక్లెట్లు, కేకులు, వేపుడు ఆహారానికి దూరంగా ఉంటా.

వారానికి ఐదురోజులు జిమ్‌కు వెళ్తా. ఓ గంట పాటు వర్కౌట్స్ చేస్తా. జిమ్‌కు వెళ్లడం వల్ల శారీరక ఆరోగ్యంతో పాటు మానసిక ఆరోగ్యం కూడా బాగుంటుంది. వ్యాయామం వల్ల శరీరంలో సంతోషానికి సంబంధించిన హార్మోన్లు విడుదలవుతాయని శాస్త్రీయంగా నిరూపణ అయింది. నాకిష్టమైన సంగీతం పెద్ద శబ్దంతో పెట్టుకుని డ్యాన్స్ చేస్తా.

చేతులు, భుజాలు,

ఛాతి భాగాలను మెరుగుపరచుకోవడానికి చెస్ట్ ఫ్లై వ్యాయామం చేస్తాను. ఇది చాతి కండరాలపై ప్రభావం చూపి చక్కని ఆకృతినిస్తుంది. కాళ్లు, ఆ పై భాగాలను మెరుగు పరుచుకునేందుకు స్క్వాట్స్ చేస్తుంటాను. ధ్యానం, యోగా, శ్వాసకు సంబంధించిన ఆసనాలు నా వ్యాయామ పట్టికలో తప్పకుండా ఉంటాయి. మనసుకు నచ్చినపుడు నడక, సంగీతం వినడం వంటివి చేస్తాను.



ఆహారం విషయంలో ఎలా ఉన్నా నీళ్లు తాగడం, నిద్ర విషయాల్లో మాత్రం చాలా క్రమశిక్షణగా ఉంటా. రోజుకు 10 నుంచి 12 గ్లాసుల నీళ్లు తాగుతా. నీళ్లు ఎక్కువగా తాగడం వల్ల శరీరంలోని విష పదార్థాలు తేలికగా బయటికి వెళ్తాయి. అంతేకాదు, శరీర శక్తిస్థాయిలు పడిపో కుండా ఉంటుంది.

తాజా పండ్లు లేదా కూరగాయల రసంతో నా దినచర్య ప్రారంభమవు తుంది. ప్రతిరోజూ రాత్రి పాదాలకు మాయిశ్చరైజర్ రాసుకుంటా, మెత్తగా మృదువుగా ఉంటాయి. తరచుగా మొహం కడుక్కుంటాను.

ప్రతి రెండుగంటలకోసారి రోజుకు ఆరుసార్లు కొద్దిపాటి ఆహారం తీసుకుంటా. పండ్ల రసాలు ఎక్కువగా తీసుకుంటా. పైన్ ఆపిల్ జూస్ చాలా ఇష్టం. దీనిలో క్యాలరీలు తక్కువగా ఉంటాయి. ప్రతిరోజూ నా భోజనంలో చికెన్ ఉంటుంది. నా శరీరానికి అవసరమైన ప్రోటీన్లు దానినుండే లభిస్తాయి.

చర్మ రక్షణకు అవసరమైన జాగ్రత్తలు తీసుకోవడం తప్పనిసరి. అయితే ఎపుడూ సంతోషంగా ఉండేందుకు ప్రయత్నించాలి. ఎందుకంటే అది మన ముఖంపై ప్రభావం చూపిస్తుంది.

సేకరణ : సంధ్యారాణి

## డబుల్ నోబెల్!

రెండు సార్లు నోబెల్ ప్రైజ్ అందుకున్న ఏకైక మహిళ మేరీ క్యూరీ! భర్త పెర్రీ క్యూరీ, హెన్రీ బెక్వెరల్ లతో కలిసి భౌతిక శాస్త్రంలో ఆమె చేసిన కృషికిగానూ 1903లో మొదటి సారి నోబెల్ బహుమతి అందుకుంది. రసాయన శాస్త్రంలో చేసిన పరిశోధనలకు గానూ 1911లో రెండోసారి ఈ అరుదైన గౌరవం దక్కించుకుంది.



## మహిళా శక్తి



**విమర్శలను ఎపుడూ వ్యక్తిగతంగా తీసుకోవద్దు. అది నిజాయితీగా చేసినదైతే తప్పకుండా పరిగణనలోకి తీసుకోవాలి, లేదంటే వదిలేయాలి**

– హిల్లరీ క్లింటన్



**విజయాన్ని నీ సొంత పదాల్లో నిర్వచించు. నీ సొంత నియమాలతో సాధించు. గర్వంగా జీవించు**

– ఆనీ స్వీనీ

## సోయగం



### చుండ్రు నివారణ

★ తలకు కొబ్బరినూనె పట్టించి ఓ రెండు గంటలు లేదా రాత్రి అంతా అలా ఉంచాలి. తర్వాత తలస్నానం చేస్తే చుండ్రు తగ్గుముఖం పడుతుంది. కొబ్బరినూనెలో కొద్దిగా నిమ్మ రసం కూడా కలపొచ్చు.

★ పెరుగు, మిరియాల పొడి మిశ్రమం కూడా చుండ్రు నివారణగా బాగా పని చేస్తుంది. పెరుగు మాడుపైన పొలుసులు లేవకుండా నివారిస్తుంది. మిరియాల పొడి యాంటీ ఫంగల్ గుణాలను కలిగి ఉంటుంది. ఒక కప్పు పెరుగులో టీ స్పూను మిరియాల పొడి కలిపి జుట్టు కుదుళ్లకు పట్టించి ఓ గంట ఆరనివ్వాలి. తర్వాత తల స్నానం చేయాలి. తల స్నానం చేసేపుడు జాగ్రత్తగా ఉండాలి. మిరియాలపొడి కళ్లలో పడకుండా జాగ్రత్త ప డాలి. ఇలా తరచుగా చేస్తుండడం వల్ల చుండ్రు తగ్గడమే కాకుండా జుట్టు ఆరోగ్యంగా నల్లగానూ ఉంటుంది.

## టెక్ గురూ!

పిల్లలను ఎపుడూ అంటిపెట్టుకుని ఉండడం కుదరకపోవచ్చు తల్లిదండ్రులకు. స్కూలుకు లేదా చిన్న చిన్న పనుల మీద బయటికి వెళ్లినపుడు వాళ్లు క్షేమంగా ఉన్నారా లేదా? అన్న దిగులు ఉంటుంది వాళ్లకు. పిల్లలు లేదా తమ ఇతర కుటుంబ సభ్యులు ఎక్కడున్నా వాళ్ల సమాచారం తెలుసుకునేందుకు రెండురకాల యాప్‌లున్నాయి. అవి..

SPOT "N" SAVE







EASY TO USE FAST SECURE

Stay Connected | Stay Safe

Continue

### స్పాప్ ఎన్ సేవ్ సెక్యూర్ యాప్

స్మార్ట్ ఫోన్‌కు బదులు స్మార్ట్ బ్యాండ్ ఉంటుంది. ఆ బ్యాండ్‌ను చేతికి కట్టుకోవాలి. అత్యవసర పరిస్థితుల్లో బ్యాండుకు ఉన్న బట న్‌ను రెండు సార్లు నొక్కితే పెద్దల నెట్‌వర్క్‌కు సిగ్నల్ వెళ్తుంది. అది ప్రతి రెండు నిమిషాలకో సారి అప్‌డేట్ అవుతుంది. ఈ యాప్ ద్వారా ఐదుగురిని ట్రాక్ చేయొచ్చు.

### స్ప్రింట్ ఫ్యామిలీ లొకేటర్ యాప్

ఈ యాప్ స్ప్రింట్ మొబైల్ నంబర్‌తో స్ప్రింట్ ఫ్యామిలీ ప్లాన్ కింద పనిచేస్తుంది. ఇది స్మార్ట్ ఫోనే కాకుండా సాధారణ ఫోన్ ద్వారా కూడా పనిచేస్తుంది. అంతేకాదు, ట్రాక్ చేయా ల్సిన ఫోన్‌లో ఈ యాప్‌ను ఇన్‌స్టాల్ చేయక్క ర్లేదు. దీనిద్వారా కుటుంబసభ్యులు ఆయా సమ యాల్లో ఎక్కడున్నారో మ్యాప్ ద్వారా తెలుసుకో వచ్చు. వాళ్లు ఉంటామని చెప్పిన చోట లేకపోతే మీకు టెక్స్ట్ మెసేజ్ వస్తుంది. ఫోన్ ఎక్కడైనా మరిచిపోయినా, ఎవరైనా దొంగిలించినా ఎక్కడ ఉన్నది తెలుసుకోవచ్చు. ఈ యాప్ పదిహేను రోజుల వరకు ఉచితంగా వాడుకోవచ్చు. తర్వాత రుసుము చెల్లించాల్సి ఉంటుంది.

# జతపరచండి

మనదేశంలో వివిధ రాష్ట్రాలకు ముఖ్యమంత్రులుగా పనిచేసిన మహిళామణుల పేర్లు, ఆయా రాష్ట్రాల పేర్లు ఇక్కడ ఉన్నాయి. వారు ఏ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేశారో గుర్తించగలరేమో చూడండి..

| | |
|---|---|
| 1. సుచేతాకృపలానీ | ఎ. గోవా |
| 2. నందినీ శతపథి | బి. మధ్యప్రదేశ్ |
| 3. శశికళా కకోద్కర్ | సి. ఢిల్లీ |
| 4. రాజేందర్ కౌర్ భట్టాల్ | డి. తమిళనాడు |
| 5. ఉమాభారతి | ఇ. ఒరిస్సా |
| 6. సుష్మాస్వరాజ్ | ఎఫ్. బీహార్ |
| 7. జయలలిత | జి. ఉత్తరప్రదేశ్ |
| 8. రబ్రీదేవి | హెచ్. పంజాబ్ |

జవాబులు ఈ సంచికలోనే.. కూర్పు : తటవర్తి రామకృష్ణ




## నువ్వు చదివావా?

ఇద్దరు మిత్రులు ఎగ్జామినేషన్ హాల్ నుంచి కోక్ తాగుతూ, చిప్స్ తింటూ బయటికి వస్తున్నారు.

మొదటివాడు: ఇంతకీ ఈ రోజు ఏం పేపర్ రా?

రెండోవాడు: మాథ్స్ అనుకుంటా.

మొదటివాడు: ఏంటిరా! నువ్వు క్వశ్చన్ పేపర్ చదివావా?

రెండోవాడు: కాదులే, నా పక్కన అమ్మాయి కాలిక్యులేటర్ తెచ్చుకుంది!

## బోర్డు పంపించమన్నారు!

'నేనే బాస్‌ని, మరచిపోవద్దు' అన్న బోర్డును ఆఫీసులో తన సీటు వెనకాల గోడకు తగిలించాడు బాసు. అతను మధ్యాహ్నం భోజనం ముగించి వచ్చి సీట్లో కూర్చోగానే..



ప్యూన్: సార్! మీ భార్య ఫోన్ చేశారు. మీరు ఈ రోజు గోడకు తగిలించిన బోర్డు ఇంటినుంచి తెచ్చారట. దాన్ని వెంటనే పంపించమన్నారు!

## మిస్సవుతున్నాను

గోడమీద అంటించిన భార్య ఫోటోపైకి కత్తులు విసురుతున్నాడు భర్త. ఒక్కటి కూడా తగలడం లేదు. ఇంతలో భార్య దగ్గరి నుంచి ఫోన్ వచ్చింది.



భార్య: ఏమండీ! ఏం చేస్తున్నారు?

భర్త: నిన్ను మిస్సవుతున్నాను!

# వెజిటబుల్ కట్‌లెట్స్

చిటికెలో రుచిగా..!

*తయారుచేసే విధానం:*

ముందుగా ఆలుగడ్డలను ఉడకబెట్టుకుని వాటి పొట్టు తీసి చిదిమి పెట్టుకోవాలి. మిగతా కూరగాయల మిశ్రమాన్ని కూడా ఉడకబెట్టి నీళ్లు పూర్తిగా వడకట్టాలి. ఒక కళాయిలో కొద్దిగా నూనె వేసి ఉల్లిపాయ ముక్కలు, అల్లం వెల్లుల్లి పేస్టు వేసి దోరగా వేయించాలి. లేదంటే పచ్చివి కూడా వేసుకోవచ్చు. ఇపుడు మైదాను జారుగా కలపాలి. చిదిమిన బ్రెడ్‌ను లేదా బ్రెడ్ పొడిని ఒక ప్లేటులో వేసుకోవాలి. ఒక వెడల్పాటి గిన్నెలో చిదిమిన ఆలు, ఉడకబెట్టిన కూరగాయల మిశ్రమం, వేయించిన ఉల్లిపాయలు, అల్లంవెల్లుల్లి పేస్టు, నిమ్మరసం, తరిగిన జీడిపప్పు, కొత్తిమీర, జీలకర్ర పొడి, పసుపు, ఉప్పు, కారం, వెనిగర్, తగినంత ఉప్పు వేసి కలపాలి. ఇపుడు ఈ మిశ్రమాన్ని కొద్దికొద్దిగా తీసుకుని గుండ్రంగా లేదా త్రిభుజాకారంలో బిస్కెట్ల మాదిరిగా చేసుకోవాలి. తర్వాత వాటిని మైదా పిండిలో ముంచి, బ్రెడ్ పొడిలో మెదిపి నూనెలో బంగారు రంగు వచ్చేవరకు వేయించాలి. లేదంటే పెనం మీద కొద్దిగా నూనె వేసి కాల్చుకోవచ్చు కూడా. వీటిని సాస్, లేదా పుదీనా చట్నీతో తింటే చాలా రుచిగా ఉంటాయి.



## కావలసిన పదార్థాలు

* ఆలుగడ్డలు - 2
* కూరగాయ ముక్కల మిశ్రమం - 1 1/2 కప్పులు(పచ్చి బఠానీ, క్యారెట్, బీన్స్, మొక్కజొన్న వంటివి)
* పనీర్ - తగినంత
* తరిగిన ఉల్లిపాయ - పావు కప్పు
* అల్లంవెల్లుల్లి పేస్టు - 1టేబుల్ స్పూను
* పచ్చిమిర్చి - 2
* నిమ్మరసం - 2 టీస్పూన్లు
* కొత్తిమీర - ఒక కట్ట
* జీడిపప్పు పలుకులు- 2 టేబుల్ స్పూన్లు
* కారం - 1/2 టీస్పూను
* వేయించిన జీలకర్ర పొడి - 1/2 టీ స్పూను
* ఉప్పు - తగినంత
* మైదా - 2 టేబుల్ స్పూన్లు
* బ్రెడ్ పొడి - 1 కప్పు

**జతపరచండి జవాబులు :** 1. జి, 2. ఇ, 3. ఎ, 4. హెచ్, 5. బి, 6. సి, 7. డి, 8. ఎఫ్

## చిట్కాలక్ష్మి

* నీళ్లలో కాస్త పటిక కలిపి బట్టలుతికితే రంగు పోకుండా ఉంటుంది.
* గాయాలు తగిలిన చోట పటికతో రుద్దితే త్వరగా మానుతాయి.
* పటికను నీళ్లలో వేసి మరిగించి, చల్లారిన తర్వాత పుక్కిలించి ఊస్తే నోటిపూత తగ్గుతుంది.



అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**జి. జయచంద్ర గుప్త**
ఫ్లాట్.నెం. 77/961,
ముజ్ ఫర్‌నగర్, కర్నూలు
పిన్ : 518003

## చతురంగం - 59 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మ | 2 హ | తి | | 3 ప | 4 గ | లు | | 5 ప | 6 ని |
| 7 క | రి | | 8 హ | రి | తం | | 9 చా | రి | క |
| రం | | 10 తూ | నీ | గ | | 11 అ | నా | చా | రం |
| 12 దం | 13 డ | ము | | 14 పం | 15 జా | బు | | రి | |
| | మ | | 16 గం | ట | లు | | 17 స | క | 18 లం |
| 19 ద | రు | వు | | | 20 భు | 21 జ | గం | | బం |
| 22 శా | కం | | 23 మే | 24 జా | | 25 మ | స | ర | |
| న | | 26 భా | ను | మ | 27 తి | | గం | | 28 త |
| 29 ను | ర | గ | | 30 పం | చి | 31 తం | | 32 బా | లా |
| డు | | 33 ము | ద్దా | డు | | 34 డా | బు | స | రి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 2. పి. శుభ, బంజారాహిల్స్, 3. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 4. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 5. నోరి శివప్రకాశం, నెల్లూరు, 6. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 7. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 8. ధరణి పద్మాసన, నల్లకుంట, 9. డా.సి. జనార్ధనసింగ్, నల్లకుంట, 10. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 11. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 12. టి. హేమలత, మచిలీపట్నం, 13. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 14. యం. సుధాకరశర్మ, నెల్లూరు, 15. యు.యు.యు. ఎమ్మిగనూరు, 16. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 17. వి.వి. రమణమూర్తి, మౌలాలీ, 18. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 19. పి.వి.ఎల్. సుజాత, సైనిక్‌పురి, 20. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 21. యు. చిట్టిబాబు, న్యూపాల్వంచ, 22. పెనుమచ్చ నాగేశ్వరి, తుని, 23. పోడూరి గాయత్రీదేవి, రాజమండ్రి, 24. పారేపల్లి గోపాలరావు, కేసరపల్లి, కృష్ణా జిల్లా, 25. సంజీవిగారి శ్రీహరి, బెంగళూరు, 26. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 27. అడపా రత్నకుమారి, కాకినాడ, 28. డి. కృష్ణవేణి, చిక్కడపల్లి, 29. యమ్. అలమేలు, సఫిల్‌గూడ, 30. బి. రమావిష్ణు, బేగంపేట, 31. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 32. ఎం. లాస్యప్రియ, బోరబండ, 33. ఎ. రంగనాథం, బెంగళూరు, 34. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 35. కె. వెంకుబాబు, గుంటూరు, 36. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్, 37. ఎస్.వి.ఎస్. భగవానులు, ఒంగోలు, 38. గోగాడ జాహ్నవి, హోస్పేట, కర్ణాటక, 39. సి. నిర్మల, తిరుపతి, 40. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 41. కె. లక్ష్మీకమల, విజయవాడ, 42. బద్దేపూడి లక్ష్మీసుశీల, చీరాల, 43. ఎం. శ్రీవాణీగిరిజాదేవి, రాజమండ్రి, 44. సముద్రాల సంతోష్‌కుమార్, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 45. గానుగపాటి సరోజినీదేవి, మల్లాపూర్, 46. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 47. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 48. టి. సౌమ్యవెంకట్రామయ్య, మహబూబాబాద్, 49. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 50. డా. కె. శివభూషణం, కర్నూలు, 51. పి.వి.ఎల్.ఎన్. సూర్యసంతోష్, కొత్తపేట, 52. జి.ఎస్.ఎస్.జి.ఎల్. ఆచార్యులు, తాణాం, విశాఖ జిల్లా, 53. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా, 54. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 55. పి.ఎ. సాయిప్రసాద్, బెంగళూరు, 56. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 57. ధర్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 58. పేర్వేల సత్యవతి, మణికొండ, 59. వై.వి. విజయకుమార్, విజయనగరం, 60. మద్దూరి లక్ష్మీకాంతం, హైదరాబాద్, 61. ఎల్.వి. రమణమూర్తి, హిమాయత్‌నగర్, 62. వడ్డీ సుశీల, టెంపుల్ ఆల్వాల్, 63. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 64. సత్రసాల సుభాషిణీకృష్ణ, అనంతపురం, 65. సోంపాక సీత, భద్రాచలం, 66. జి. శ్రీనేత్రి, పెనుమూరు, చిత్తూరు జిల్లా, 67. యాదా రమేష్, తొగర్రాయి, నల్గొండ జిల్లా, 68. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 69. బి. పార్వతమ్మ, కడప, 70. ఆండ్ర రామలక్ష్మి, తణుకు, 71. ఎన్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్, 72. కె. సరోజ, అనంతపురం, 73. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 74. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 75. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, 76. చింతలపాటి శివశంకర శాస్త్రి, కానుకుంట, రంగారెడ్డి జిల్లా, 77. ఎ. స్వరూపరాణి, గుంటూరు, 78. వ్యాకరణం పద్మజ, విద్యానగర్, 79. ఏ.వి. రమణ, అమలాపురం, 80. శీతేపల్లి శశికుమార్, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 81. లోకే పుష్పలత, మంథని, 82. కొల్లూరు వెంకట రమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిశా, 83. అన్నంరాజు పూర్ణచంద్రరావు, విశాఖ, 84. డి.వి. సూర్యకుమారి, విశాఖ, 85. పి.వి. సుబ్బలక్ష్మి, విశాఖ, 86. ఇవటూరి శారదాదేవి, పోడూరు, ప.గో. జిల్లా, 87. తోకల నరేంద్రకుమార్, గుంటూరు, 88. కాకర్ల లక్ష్మీప్రసాద్, అయినముక్కల, ప్రకాశం జిల్లా, 89. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, 90. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 91. తొయ్యేటి వెంకటసూర్యం, విశాఖ, 92. సి. వెంకటసుబ్బయ్య, తిరుపతి, 93. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 94. వి.వి. సుబ్బారావు, బెంగళూరు, 95. ఎం. వీరరాఘవరాజు, బోరబండ, 96. ఎస్. మణిమేగలై, తిరుపతి, 97. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, 98. సౌదామినీ నాగరాజన్, వైజాగ్, 99. ఆర్. శ్రీగౌరి, నొయిడా, ఉత్తరప్రదేశ్, 100. ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 101. జి. జమున, తిరుపతి, 102. గండ్లూరు బలరామశాస్త్రి, మల్లాపూర్, రంగారెడ్డి జిల్లా, 103. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 104. టి. మహలక్ష్మి, బెంగళూరు, 105. యు. నారప్ప, మద్దికెర, కర్నూలు జిల్లా, 106. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, ప.గో. జిల్లా, 107. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 108. టి. సత్యనారాయణమూర్తి, ఖానాపురం హవేలి, ఖమ్మం జిల్లా, 109. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 110. కె. వసంతవీరేశ్, మద్దికెర, 111. హెచ్. అనిక, సోమాజిగూడ, 112. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 113. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ,

*(..128లో)*

# చతురంగం - 60 ఆధారాలు

## అడ్డం

1. లేఖ, ఒక దిక్కు (3)
3. వనం, తోట (3)
5. లోటు (2)
7. సర్పం (3)
8. నకిలీ.. ఆంగ్లంలో (4)
9. బొమ్మ (3)
11. కోరిక, మోహం, తొందర (3)
13. దుర్యోధనుని మేనమామ (3)
17. త్రివిక్రమ్, మహేష్‌బాబుల కలయికలో సూపర్ హిట్ సినిమా (3)
18. బాబా భక్తులకు ప్రియమైన రోజు (4)
19. సంసారం, నివాస స్థలం (4)
20. అమ్మాయిల్ని ముద్దుగా ఇలా పిలుస్తారు (3)
21. చంద్రలతకు పేరు తెచ్చిన నవల తొలి మూడు అక్షరాలు (3)
23. భవన నిర్మాణానికి ఇది బలంగా ఉండాలి (3)
24. తగ్గుదల, క్షయం.. బంగారం ఆభరణాల తయారీలో ఇది తప్పనిసరి (3)
26. స్వరములు ఏడైనా - - - ఎన్నో (3)
27. అడ్డం 21 కి తుది మూడక్షరాలు (3)
29. రాజులు వినోదార్థం చేసేది (2)
30. ఆశ్రమపాఠశాల గందరగోళం (4)
31. నేరం చేస్తే లెక్కపెట్టేది అటునుంచి (5)

## నిలువు

1. అర్జునుడి భార్య (3)
2. దుంగలు కోసే సాధనం (3)
3. ఆకస్మికంగా వచ్చిన అపరిచితుడు (5)
4. అడ్డం 7 కు ఆహారం (3)
5. చంద్రబాబు కుమారుడు (3)
6. నదుల్లో, కాలువల్లో ప్రయాణికులు, సామగ్రి రవాణాకు ఉపయోగించే సాధనం (2)
10. మూడింటి సమూహం (2)
12. ఆంగ్లంలో డబ్బు (2)
13. వంద (3)
14. రావూరి భరద్వాజ నవల - - - మెట్లు (3)
15. శ్రీశ్రీ ఇంటిపేరు, తమిళనాడులోని పుణ్యక్షేత్రం (3)
16. ఒంటరి (3)
17. ఎనిమిది ఎనిమిదులు (6)
18. ఎన్వీఆర్‌తో దీటైన నటుడు, ఒక కాయ కూడా (3)
20. పూజలో ధూపానికి ఉపయోగించేవి (5)
22. ఏడుకొండల సామికి ఏటా జరిపే జంతువినోదం (4)
23. ధూమపానానికి ఉపయోగించే ఆకు (3)
25. గొంతులో నీళ్లు పోసుకున్నాక ఇది వేయక తప్పదు (3)
26. ఊరక - - మహాత్ములు (2)
28. ఇంగ్లీషు పొడవు తలకిందులు (2)

(127వ పేజీ తరువాయి...)

114. నండూరి పద్మజ, విశాఖ, 115. ఎస్. జయరామ్‌మోహన్, చెన్నై, 116. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 117. వి.వి.ఎల్.ఎన్. శాస్త్రి, కాకినాడ, 118. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 119. పాటిబండ్ల సౌభాగ్యలక్ష్మి, అద్దంకి, 120. ద్రోణపల్లి వెంకటేశ్వరరావు, విజయవాడ, 121. వాసా రవికిరణ్, తగరపువలస, విశాఖ జిల్లా, 122. ఏకా సావిత్రి, బాపట్ల, 123. కోలా సత్యనారాయణ, విశాఖ, 124. టి.వి. నరసింహాచార్యులు, దుర్గి, గుంటూరు జిల్లా, 125. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 126. సూరి నాగరాజు, బెంగళూరు, 127. డా. కె. గ్రీష్మారెడ్డి, మంచిర్యాల, 128. దాకే బాలామణి, అనకాపల్లి, 129. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 130. పి.వి. రమణారావు, మల్కాజ్‌గిరి, 131. కె. సావిత్రి బాలాజీ ప్రసాద్, కర్నూలు, 132. బి. రామమోహనరావు, హైదరాబాద్, 133. కె. సుధీంద్రరావు, కర్నూలు, 134. ఎం. లక్ష్మీసుజాత, గుడివాడ, 135. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 136. ఎ. అరుంధతి, పుణె, మహారాష్ట్ర, 137. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 138. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 139. ఎస్.ఆర్.కె. మూర్తి, విజయవాడ, 140. డా. సి.కె. శాస్త్రి, గుంటూరు, 141. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 142. కట్టా లక్ష్మీశివప్రసాద్, హిందూపురం, 143. కె. మోహన్, బెంగళూరు, 144. పొన్నపల్లి వెంకటప్పయ్య, విజయవాడ, 145. యు.ఎన్. మూర్తి, లాలాపేట, 146. గరికిపాటి చైతన్యకృష్ణ, కాకినాడ, 147. గుర్రాల శ్రీనివాసరావు, విశాఖ.

# చతురంగం - 60

రూ.150/- బహుమతి

గడువు తేది : మార్చి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | 6 |
| లూ | ■ | 7 | | | ■ | 8 | | | |
| 9 | 10 | | ■ | 11 | 12 | కం | ■ | | ■ |
| ■ | | ■ | 13 | | | ■ | 14 | ■ | 15 |
| 16 | ■ | 17 | | | ■ | 18 | | | |
| 19 | | | | ■ | 20 | | | ■ | |
| | ■ | | ■ | 21 రే | | | ■ | 22 | ■ |
| ■ | 23 | | | ■ | | ■ | 24 | | 25 |
| 26 | | | ■ | 27 | | 28 లు | ■ | 29 | |
| 30 | | | | ■ | 31 | | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

## నిబంధనలు

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO,** **VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2016

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# మామాశ్రీ ప్లాస్టిక్ ద్వేషి

ఓ కుర్రాడు ప్రేమలోపడ్డాడు. అమ్మాయీ గ్రీన్ సిగ్నలిచ్చింది. అయితే అన్ని ప్రేమకథల్లానే ఇందులోనూ పిల్ల తండ్రే విలను. అలాని అతనేం ఫాక్షనిస్టో, స్మగ్లరో కాదు. కులగోత్రాలూ, ఆస్తీ అంతస్తులతో పట్టింపులేదు. తమాషా ఏమిటంటే పిల్ల తండ్రి అరివీర భయంకర పర్యావరణ ప్రేమికుడు. కూతురు ఇష్టపడిన వ్యక్తితో పెళ్ళి జరిపించడానికి ఆయనకు వేరే అభ్యంతరం ఏమీ లేదు. కాకపోతే కాబోయే అల్లుడు, అతని కుటుంబీకులు ప్లాస్టిక్ మొహం చూట్టానిక్కూడా వీల్లేదు. కుర్రాడికి ప్రేమ దక్కాలంటే ముందుగా ప్లాస్టిక్ ద్వేషి అయిన మామాశ్రీ మనసును దోచుకోవాలి. అందు కోసం అతను పడిన పాట్లు, ఫీట్లతో శ్రీకళ అబ్బరాజు రాసిన కడుపుబ్బా నవ్వించే నవల **ప్రేమించి పెళ్ళి చేసుకో**



**చతుర ఏప్రిల్ కానుకలు**

**బోనస్‌గా...**

* **నవలిక:** గుండెల నిండా దేశభక్తి.. మూర్తికట్టిన మానవత్వం.. నెచ్చెలి మీద ప్రేమ..ముప్పేటగా అల్లుకున్న పి.వి. ప్రసాద్ **ఓ భారతీయుడి ప్రేమకథ**
* **నవలావలోకనంలో** : ఇద్దరు అన్నదమ్ముల మనోభావాలను నేపథ్యంగా చేసుకుని కుటుంబ సభ్యుల పరస్పర అనుబంధాలకు, అనురాగాలకు అద్దంపడుతూ సాగే శ్రీ కాళీపట్నం రామారావు నవల **అభిమానాలు**

**CHATURA** Telugu Monthly, Dt. of publication : March 1, 2016.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978